ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

సంపుటి 2 | సంచిక 3 ఏప్రిల్-జూన్, 2022

మమత-సమత-మానవత
www.gurajada.org

## జానపద సాహిత్య సౌరభం



ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

మమత-సమత-మానవత
www.gurajada.org

## ధన్యోస్మి

ప్రకాశిక ఏప్రిల్-జూన్ 2022 సంచికని జానపద సాహిత్యం మీద ఒక ప్రత్యేక సంచికగా తీసుకు రావాలని అనుకున్నప్పుడు అందుకు సమర్థులైన అతిథి సంపాదకుల కోసం సూచనలు అడిగినప్పుడు మిత్రుడు ఆచార్య డి. శ్రవణ్ కుమార్ గారు ఆచార్య జయదేవ్ గారి పేరు సూచించారు. జయదేవ్ గారు నా ఆహ్వానాన్ని దయతో మన్నించి పలువురు ప్రముఖ రచయితలతో ఆసక్తికరమైన, విజ్ఞానదాయకమైన వ్యాసాలు రాయించారు. ఆరోగ్యం అంతగా సహకరించకపోయినా మిక్కిలి శ్రమతో ఆయన సంపాదక బాధ్యతలు సమర్థవంతంగా నిర్వహించారు. అందుకు జయదేవ్ గారికి ప్రత్యేక ధన్యవాదాలు తెలుపుతున్నాను. ఈ ప్రత్యేక సంచికలో ప్రచురణ కోసం మంచి వ్యాసాలు పంపిన రచయితలకు ధన్యవాదాలు. జానపద సాహిత్యానికి సంబంధించిన కొన్ని ప్రత్యేక వ్యాసాలు రాయించమని కోరగానే డా. భద్రి కూర్మా రావు గారు ఆచార్య రాచుగాల్ల రాజేశ్వరమ్మ; డా. శ్రీ పురుషోత్తం గణపతిరావు; డా. కూన వెంకట రామకృష్ణ గార్లతో మంచి వ్యాసాలు రాయించారు. కూర్మా రావు గారికి ప్రత్యేక ధన్యవాదాలు. రచయితలకి అభినందన పూర్వక కృతజ్ఞతలు. ప్రతీ సంచికలోనూ క్రమం తప్పకుండా పద్య సాహిత్యం మీద చక్కటి వ్యాసం పంపుతున్న డా. చక్రవర్తి గారికి కృతజ్ఞుడను.

ఈ సంచిక వెలువరించడంలో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ సహకరించిన వారెందరో ----, అందరికీ వందనములు.

భవదీయుడు
ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ
ప్రధాన సంపాదకులు

# ప్రకాశిక సంపాదక వర్గం



## ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ

ప్రధాన సంపాదకులు

పుట్టినది పశ్చిమగోదావరి జిల్లాలోని ఇరగవరం అగ్రహారం. పెరిగినది చాలా వరకు తణుకులో. తాడేపల్లిగూడెం కళాశాల నుంచి డిగ్రీ, ఉమ్మడి రాష్ట్ర రాజధాని భాగ్యనగరంలోని కేంద్రీయ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఎస్.సి., దేశ రాజధానిలోని ఢిల్లీ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఫిల్., పి.హెచ్.డి. చేశారు. గత 27 సంవత్సరాలుగా అమెరికాలో నివాసం. చాలా సంవత్సరాలు వైద్య విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా కేన్సర్ వ్యాధికి సంబంధించిన అంశాలపై పరిశోధనలు జరిపారు. ప్రస్తుతం అంతర్జాతీయ ఫార్మస్యూటికల్ కంపెనీలో కేన్సర్ మందులు రూపొందించే శాస్త్రవేత్తగాను, హ్యూస్టన్ లోని టెక్సాస్ విశ్వవిద్యాలయంలోని వైద్యశాస్త్ర విభాగంలో అనుబంధ ఆచార్యులుగానూ పనిచేస్తున్నారు. అంతర్జాతీయ కేన్సర్ పరిశోధనలకి సంబంధించిన అంతర్జాతీయ పత్రికకి ప్రధాన సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. మాటల మాలలల్లడం ప్రవృత్తి. అడపాదడపా రాసిన కవితలు, కథలు, వ్యాసాలు ఒకచోట కూర్చి ''మనస్వినీయం'' అన్న పేరుతో ఇటీవల ఒక పుస్తకం ప్రచురించారు.



## మా శర్మ

గౌరవ సంపాదకులు

మా శర్మగా సుపరిచితులైన మాచవరం వేంకట చెంచురామ మారుతి సుబ్బరాయశర్మ 1967 సంవత్సరం నవంబర్ 29వ తేదీన గుంటూరు జిల్లా, నరసరావుపేటలో జన్మించారు. పాత్రికేయులు, కాలమిస్ట్‌గా ప్రసిద్ధులు. తెలుగువారికి సొంతమైన అవధాన ప్రక్రియ, ఆశుకవిత్వంలో అగ్రగణ్యులు, ఆరాధ్యులైన కొప్పరపు కవులు మా శర్మగారికి మాతామహులు. ఆ మహాకవుల పేరిట శ్రీ కొప్పరపు కవుల కళాపీఠాన్ని 2002లో స్థాపించారు. వారి విగ్రహాలను విశాఖపట్నం సాగరతీరంలో, నరసరావుపేటలో స్థాపించారు. కొప్పరపువారి సాహిత్యాన్ని సేకరించి దొరికినంత వరకూ గ్రంథస్థం చేశారు. ప్రతియేటా శ్రీ కొప్పరపు కవుల ప్రతిభా పురస్కారాలు ప్రదానం చేస్తున్నారు. ప్రముఖులు పీసపాటి నరసింహమూర్తి, వేటూరి సుందరరామ్మూర్తి, మల్లాది చంద్రశేఖరశాస్త్రి, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, నేదునూరి కృష్ణమూర్తి, కె.విశ్వనాథ్, బేతవోలు రామబ్రహ్మం, మేడసాని మోహన్, గరికిపాటి నరసింహారావు, మాడుగుల నాగఫణిశర్మ, పి.సుశీల, సిరివెన్నెల సీతారామశాస్త్రి మొదలు

ఎందరో తెలుగు, జాతీయ కవులు, కళాకారులు ఆ పురస్కారం అందుకున్న వారిలో ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రపత్రిక దినపత్రికకు కన్ సల్టింగ్ ఎడిటర్ గా పాత్రికేయ సేవలు అందిస్తున్నారు. ఎన్నో ఏళ్ల నుండి మీడియాలో ఉన్నారు.



## శ్రీమతి గురజాడ అరుణ

నిర్వాహక సంపాదకులు

గురజాడ వేంకట అప్పారావుగారి ముని మనుమరాలు శ్రీమతి గురజాడ అరుణ. ముంబైలో పుట్టి పెరిగిన వీరు IT రంగంలో ప్రాజెక్ట్ మేనేజర్ గా పనిచేస్తున్నారు. ముత్తాతగారి అకాల మరణంతో అసంపూర్ణంగా మిగిలిపోయిన వారి సాహితీ సేవలు, సంఘ సంస్కరణ కార్యక్రమాలను ముందుకు తీసుకెళ్ళే క్రమంలో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపించారు. గురజాడ వారి పేరిట ఎన్నో సేవా కార్యక్రమాలు చేస్తూ ముత్తాతగారి స్మృతిని చిరస్థాయిగా ఉంచుతున్నారు.



## శ్రీ గురజాడ రవీంద్రుడు

సంపాదక సలహాదారు

గురజాడ వేంకట అప్పారావుగారి మునిమనుమడు శ్రీ గురజాడ రవీంద్రుడు. 2014లో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపనలో ముఖ్య భూమిక పోషించారు. ఫౌండేషన్ లక్ష్యాలను, ఆశయాలను ముందుకు తీసుకెళ్ళడంలో చురుకైన పాత్ర పోషిస్తూ ముత్తాతగారి అడుగుజాడల్లో పయనిస్తున్నారు. గురజాడ ఫౌండేషన్ (అమెరికా) ఇండియన్ చాప్టర్ కు ప్రెసిడెంట్ గా వ్యవహరిస్తున్నారు.



## శ్రీ విహారి

సంపాదక సలహాదారు

విహారి అనే కలం పేరుతో సుప్రతిష్ఠులైన శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు 1941లో తెనాలిలో జన్మించారు. వీరు 12 కథాసంపుటాలు, 15 విమర్శనాత్మకమైన వ్యాస సంపుటాలు, ఒక వ్యాస కదంబం, 7 నవలలు, 5 కవితా సంపుటాలు, ఒక దీర్ఘ కథాకావ్యం- పుస్తకాల రూపంలో వెలువరించారు. అన్ని ప్రసిద్ధ తెలుగుపత్రికలలోనూ 300కి పైగా వీరి రచనలు ప్రచురితమయ్యాయి. వివిధ పత్రికల్లో పరిచయాలూ-పరామర్శలు, బతుకు గీతలు, కథావిహారం వంటి శీర్షికలనూ నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కారం, అజో విభో కందాళం ఫౌండేషన్ (AVKF) వారి జీవన

సాఫల్య పురస్కా రం, ఆం.ప్ర భాషా దినోత్సవ పురస్కా రం, తె.వి.వి.కీర్తి పురస్కా రం లాంటి ఎన్నో ప్రతిష్ఠాత్మకమైన పురస్కా రాలు అందుకున్నారు. ఎల్.ఐ.సి.లో జనరల్ మేనేజర్ గా పదవీ విరమణ చేసి, హైదరాబాద్ లో నివాసం ఉంటున్నారు.



## ఆచార్య వెలమల సిమ్మన్న

సంపాదక సలహాదారు

బహుముఖ ప్రజ్ఞాశాలిగా వాసికెక్కిన ఆచార్య వెలమల సిమ్మన్నగారు 1955 సంవత్సరం మార్చి 1వ తేదీన శ్రీకాకుళం జిల్లా, జలుమూరు మండలం, తిమడాం గ్రామంలో జన్మిం చారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్, స్కూల్ఆ ఫ్ డిస్టెన్స్ ఎడ్యుకే షన్ లో తెలుగుశాఖలో అధ్యాపక ధర్మం నిర్వర్తిం చారు. భాష, సాహిత్యం, వ్యాకరణం, భాషా శాస్త్రం, విమర్శ, పరిశోధన మొదలైన రంగాలకు సంబంధించి 83 గ్రంథాల్ని రాశారు. 440కి పైగా పరిశోధన పత్రాలు ప్రముఖ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. 160కి పైగా వివిధ సెమినార్లలో హాజరై పరిశోధన పత్రాల్ని సమర్పించారు. 50కి పైగా రేడియో ప్రసంగాలు చేశారు.



## ఆచార్య గుమ్మా సాంబశివరావు

సంపాదక సలహాదారు

తెలుగు సాహిత్యంలో ప్రముఖ విమర్శకులుగా, పుస్తక సమీక్షకులుగా, అన్నింటికీ మించి మంచి అధ్యాపకునిగా పేరొందిన గురువర్యులు ఆచార్య గుమ్మా సాంబశివరావుగారు. స్వగ్రామం గుంటూరు జిల్లాలోని వేజెండ్ల. 2018లో ఆంధ్ర లయోలా కళాశాలలో తెలుగు శాఖాగ్రణిగా పదవీ విరమణ చేశారు. మహాకవి గురజాడ 150వ జయంతి కానుకగా 2011 డిసెంబరులో కన్యాశుల్కంలో హాస్యం పేరుతో ఓ గ్రంథాన్ని ముద్రించారు. 2012 డిసెంబరు 27,28,29 తేదీల్లో తిరుపతి నగరంలో నాలుగో ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకుని తెలుగు అకాడమీ వారు ఆచార్య గుమ్మా సాంబశివరావు రచించిన తెలుగువాఙ్మయ చరిత్ర-రచయితలు అనే గ్రంథాన్ని ముద్రించారు. నూటముప్పైకి పైగా వివిధ పత్రికల్లో వ్యాసాలు, 150 కి పైగా పుస్తక సమీక్షలు, 60 కి పైగా ఆకాశవాణిలో ప్రసంగాలు అనేక జాతీయ అంతర్జాతీయ వేదికల మీద వివిధ అంశాల మీద ప్రసంగాలు, సాంబశివరావుగారి విస్తృత ప్రతిభకి తార్కాణం. సాంబశివరావు గారు అనేక జాతీయ, అంతర్జాతీయ సన్మానాలు, సత్కారాలు పొందారు. ఏ అంశంపైనైనా అనర్గళంగా ప్రసంగించే వీరి సామర్థ్యాన్ని గుర్తించి అనేక సాహిత్య పీఠాలవారు 'ప్రసంగప్రజ్ఞా నిధి', 'ఉపన్యాసకేసరి' వంటి బిరుదులతో సత్కరించారు.



## డా.సి. భవానీదేవి

సంపాదక సలహాదారు రచయిత్రి, విమర్శకురాలు

ఆంధ్రప్రదేశ్ సచివాలయం నుంచి ప్రభుత్వ ఉప కార్యదర్శి గా పదవీ విరమణ చేశారు. 15 కవితా సంపుటులు, వివిధ ప్రక్రియల్లో 51 గ్రంథాలు వెలువరించారు. వీరి పలు కవితలు, కథలు ఇతర భాషల్లోకి అనువదించబడ్డాయి. డాక్టర్ సి. భవానీదేవి పలు అవార్డులు, ప్రశంసలు అందుకున్నారు. ఆకాశవాణి, ప్రసారభారతి జాతీయ స్థాయిలో ప్రతి ఏటా ప్రతిష్టాత్మకంగా నిర్వహించి ప్రసారం చేసే జాతీయ కవి సమ్మేళనంలో భాగంగా 2019 సంవత్సరానికి తెలుగు కవయిత్రిగా ఎంపికయ్యారు.



## డా. రేవూరి అనంత పద్మనాభరావు

సంపాదక సలహాదారు

పద్మనాభరావు వందకుపైగా అష్టావధానాలు చేశారు. 120 గ్రంథాలు ప్రచురించారు. అందులో నాలుగు కథా సంపుటాలు, నాలుగు నవలలు, 12 అనువాదాలు, 11 జీవితచరిత్రలు, 12 సివిల్స్ పరీక్షల గ్రంథాలు, పరిష్కరణలు, వ్యాఖ్యలు, పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. వీరి రచనలపై నాలుగు విశ్వవిద్యాలయాల నుండి ఆరుగురు పరిశోధక విద్యార్థులు ఎం.ఫిల్. / పి.హెచ్.డి. డిగ్రీలు సంపాదించారు. పద్మనాభరావుకు 1993లో తెలుగు విశ్వవిద్యాలయ అనువాద పురస్కా రము, 2000లో కేంద్ర సాహిత్య అకాడమీ అనువాద పురస్కా రం లభించాయి. ఢిల్లీ తెలుగు అకాడమీ, మదరాసు తెలుగు అకాడమీ సనాతన ధర్మచారిటబుల్ ట్రస్టు తదితర అవార్డులు పొందారు. కందుకూరి రుద్రకవి రచనలపై పి.హెచ్.డి. చేశారు. 1967లో కందుకూరు ప్రభుత్వ కళాశాల అధ్యాపకులుగా ఉద్యోగ జీవితం ప్రారంభించి 1975 నుండి 2005 వరకు ఆకాశవాణి, దూరదర్శన్ లో పదవీ బాధ్యతలు మూడు దశాబ్దాలు నిర్వహించి, ఢిల్లీ అదనపు డైరెక్టర్ జనరల్ గా పదవీ విరమణ చేశారు. 2005 - 10 మధ్య తిరుమల తిరుపతి దేవస్థానంలో పనిచేసి శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్ కు అంకురార్పణ దశలో కృషి చేశారు. కంచికామకోటి పీఠాధిపతి వీరిని ఆస్థాన విద్వాంసులుగా సత్కరించారు. అమెరికా, యు.కె, జర్మనీ దేశాలలో పర్యటించి ఉపన్యసించారు. 1200 వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురించారు. 74 సంవత్సరాల పద్మనాభరావు హైదరాబాదులో స్థిరపడ్డారు.



## డా. నాగసూరి వేణుగోపాల్

సంపాదక సలహాదారు

దేశవ్యాప్తంగా తొమ్మిది ఆకాశవాణి కేంద్రాలలో సుమారు ముప్పైయి మూడు సంవత్సరాలుగా పనిచేస్తూ మరోవైపు రచయితగా, కాలమిస్టుగా, సంపాదకునిగా డా. నాగసూరి వేణుగోపాల్ ఇంతవరకు 60 పైగా పుస్తకాలు వెలువరించారు.అనంతపురం జిల్లా కొనతట్టు పల్లిలో 1961లో జన్మించిన నాగసూరి ఎస్వీయూ నుంచి ఫిజిక్స్‌లో ఎం.ఎస్సీ., ఎం.ఫిల్., తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జర్నలిజంలో పి.హెచ్.డి. గడించారు. పరిశీలన, పరిశోధన, ప్రణాళికతో ఆకాశవాణి కార్యక్రమాలు నిర్వహించిన నాగసూరి రేడియో పరిచయ కార్యక్రమ నిర్వహణలో పేరుపొందడమే కాక 'ఆదివాసీ అంతరం', 'శతవసంత సాహితీ మంజీరాలు', 'వెలుగుజాడ', 'అన్నమయ్య పదగోపురం', 'జీవనబింబం', 'చిత్తూరు జిల్లా జీవన చిత్రం' వంటి విలువైన కృషి ద్వారా చిరకాలం నిలబడే ముద్ర వేశారు. విజ్ఞానశాస్త్రం, సాహిత్యం, పత్రికారంగం, ప్రసారమాధ్యమాలు, చరిత్ర, భాష వంటి విషయాలపై పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. గురజాడ, తాపీ, పొట్టి శ్రీరాములు, నార్ల, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, జి.వి.కృష్ణారావు, విద్వాన్ విశ్వం వంటి వారి పరిశోధనాత్మక పుస్తకాలు వెలువరించిన నాగసూరి 'సాహితీ వీక్షణం', 'సాహితీ స్పర్శ' వంటి విమర్శనా గ్రంథాలు కూడా రచించారు. 20వ శతాబ్దం ముగుస్తున్న వేళ విజయవాడ ఆకాశవాణి ద్వారా మూడేళ్ళ పాటు పరిచయం చేసిన శతాబ్దపు వంద ఉత్తమ తెలుగు గ్రంథాల గురించి వెలువరించిన 'శతవసంత సాహితీ మంజీరాలు' అత్యంత విలువైన సంకలనం. ఇంకా సాహిత్య అకాడమీకి 'సైన్స్ ఫిక్షన్' 'వైజ్ఞానిక కథలు', అలాగే 'కథావరణం', 'మదరాసుబదుకులు' కథా సంకలనాలను మిత్రులతో కలిసి వెలువరించారు. 'స్థానిక మూలాలు', 'విస్మృత ప్రముఖులు', 'జానపదకళలు', 'హెచ్.ఐ.వి./ ఎయిడ్స్', 'ఆదివాసుల జీవితం', 'ఇతర ప్రాంతాల తెలుగువారు', 'అన్నమయ్య' వంటి అంశాలపై దృష్టి నిలిపి కృషి చేసిన వేణుగోపాల్ ప్రస్తుతం తెలుగువారు విస్మరించిన గాంధీ తత్వంలోని ప్రయోజనకరమైన కోణాలను వివరించడానికి తన బృందంతో కలసి శ్రమిస్తున్నారు. వీరి ప్రస్తుత నివాసం హైదరాబాదు.



## ఆచార్య ఎం. జయదేవ్

అతిథి సంపాదకులు

ఆచార్య మర్రెబోయిన జయదేవ్ గారు ఆంధ్ర విశ్వవిద్యాలయం లో 1990 నుండి 2018 వరకు ఆచార్యులుగా పనిచేసారు. ఆయన వద్ద 24 మంది విద్యార్థులు పి.హెచ్.డీ లు, 8 మంది ఎం.ఫిల్ పపట్టాలు పొందారు. ఆచార్య జయదేవ్ గారికి జానపద సాహిత్యం, వేమన పద్యాలు, కథానికలు, సామాజిక స్పృహ ఉన్న రచనలు అంటే చాలా ఇష్టం. ఆయన దుర్భాక రాజశేఖర శతావధాని చారిత్రక కావ్యాలు, సంస్కృత మహాభారతంలో జానపద కథలు వంటి పలు పుస్తకాలు ప్రచురించారు. పలు పుస్తకాలు ఆముద్రితంగా ఉన్నాయి.






# జానపద సాహిత్య సౌరభం

అమెరికాలో ఉన్న ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణగారు మాతృభూమిని మాతృభాషను మరచిపోకుండా ఆ రెండింటికి భాషా సాహిత్యాల పరంగా సేవ చేయాలనుకోవడం నిజంగా గొప్ప విషయం. భారతదేశంలో సొంత రాష్ట్రాల్లో ఉన్న తెలుగు వాళ్ళు తెలుగు భాష గురించి పట్టించుకోవడం లేదు. ఇది నిజంగా శోచనీయమైన విషయం. ఇతర రాష్ట్రాలకు ఇతర దేశాలకు వలస వెళ్ళిన వారు తమ మాతృభూమి పట్ల మాతృభాష పట్ల మమకారం ప్రదర్శిస్తున్నారు. "వ్యక్తి విలువ ఆవ్యక్తి దూరమైనప్పుడు తెలుస్తుందని" పెద్దలు అంటుంటారు. అలాగే మాతృభాష మాతృ భూమి విలువ, గొప్పతనం వాటికి దూరంగా ఉన్నప్పుడు తెలుస్తాయనుకుంటాను. ఇతర రాష్ట్రాల్లో ఇతర దేశాల్లో ఉన్న తెలుగువారు తమ భాషా సాహిత్యాలను సంస్కృతీ సంప్రదాయాలను మరచిపోకుండా కాపాడుకుంటూ వస్తున్నారు. ఇది అభినందించదగిన విషయం.

గోపాలకృష్ణ గారు గురజాడ స్థాపించిన "ప్రకాశిక" పత్రికని పునరుద్ధరించి, తెలుగు సాహిత్యంలోని ఒక్కొక్క ప్రక్రియను గురించి ఒక్కొక్క ప్రత్యేక సంచికను తీసుకుని రావాలని సంకల్పించడం అభినందించదగ్గ విషయం. ఇందులో భాగంగా జానపద సాహిత్యానికి సంబంధించిన సంచికను చూడవలసిందిగా

నాకు అప్పగించారు. ద్రావిడ విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా పని చేస్తున్న శ్రవణ్ కుమార్ గారి ద్వారా గోపాలకృష్ణ గారు నాకు పరిచయమయ్యారు. జానపద సాహిత్యానికి సంబంధించి పది వ్యాసాలు నిష్ణాతులైన వారితో రాయించి ఒక మంచి సంచికను తీసుకొని వద్దామని వారు చెప్పారు. నా ఆరోగ్యం అంత బాగా లేకపోయినప్పటికీ వారి ఆసక్తిని చూసిన తర్వాత నేను వారితో కలిసి పని చేయడానికి అంగీకరించాను.

జానపద సాహిత్యం సముద్రం లాంటిది. ఇందులో అనేక శాఖోపశాఖలున్నాయి. జానపద సాహిత్యంలో ప్రధానంగా కవిత్వం, వచనం అనే రెండు శాఖలు ఉన్నాయి. కవిత్వంలో గేయం, కథాగేయం అనే రెండు ఉపశాఖలున్నాయి. గేయంలో శ్రామిక గేయాలు, స్త్రీల గేయాలు, పిల్లల గేయాలు, కౌటుంబికగేయాలు, శృంగార గేయాలు, హాస్య గేయాలు, వేడుక పాటలు, కరుణ రస గేయాలు, పారమార్థిక గేయాలు మొదలైన అనేక ఉప శాఖలుఉన్నాయి. వీటన్నింటిలోనూ మళ్లీ ఉపశాఖలున్నాయి.

కథాగేయంలో చిన్న కథాగేయాలు, పెద్ద కథాగేయాలు, కథాగేయచక్రాలు అనే మూడు శాఖలున్నాయి. చిన్న కథాగేయాల్లో పౌరాణికాలు, మతసంబంధాలు, అద్భుత రస ప్రధానాలు, చారిత్రకాలు, సాంఘికాలు అనే ఐదు శాఖలున్నాయి. ఈ శాఖలన్నింటిలోనూ మళ్లీ ఉపశాఖలున్నాయి. ఉపశాఖలన్నింట్లోనూ మళ్ళీ అనేక ఉప శాఖలున్నాయి. పెద్ద కథ గేయాల్లో గూడా పౌరాణికాలు, మతసంబంధాలు, అద్భుత రస ప్రధానాలు, చారిత్రకాలు, సాంఘికాలు అనే ఐదు శాఖలున్నాయి. ఈ ఐదింటిలోనూ అనేక ఉప శాఖలున్నాయి. ఈ ఉప శాఖల్లో కూడా మళ్ళీ అనేక ఉప శాఖలున్నాయి. కథాగేయచక్రాల్లో పౌరాణికాలు, చారిత్రకాలు, సాంఘికాలు అనే మూడు విభాగాలున్నాయి. ఇలా జానపద కవిత్వం అనేక శాఖోపశాఖలుగా విస్తరించింది.

జానపద వచనంలో కథలు, ఐతిహ్యాలు, పొడుపు కథలు, సామెతలు అనే నాలుగు విభాగాలున్నాయి. కథల్లో అద్భుత కథలు, నీతి కథలు, ప్రాణి కథలు, కారణ కథలు, హాస్య కథలు, స్త్రీల కథలు, పేదరాశి పెద్దమ్మ కథలు, మోసగాండ్రకథలు, పురాణ కథలు, ఐతిహాసిక కథలు, శృంగార కథలు, బూతు కథలు మొదలైన విధంగా అనేక రకాల కథలున్నాయి. వీటన్నింటిలోనూ ఉపవిభాగాలున్నాయి.

పొడుపు కథలను సంస్కృతంలో ప్రహేళికలు అంటారు. ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి గారు పొడుపుకథలను గృహ జీవన ప్రహేళికలు, శ్రామిక జన ప్రహేళికలు, ప్రకృతి సంబంధ ప్రహేళికలు, తిర్యక్ సంబంధి ప్రహేళికలు, క్రీడా వినోద ప్రహేళికలు, తాత్విక ప్రహేళికలు, అస్పష్ట ప్రహేళికలు, ఆత్మాశ్రయ ప్రహేళికలు, శాస్త్ర విజ్ఞాన ప్రహేళికలు, పిల్లల ప్రహేళికలు అని పది రకాలుగా వర్గీకరించారు. వీటన్నింటిలోనూ ఉపవిభాగాలున్నాయి.

సాహిత్య ప్రక్రియల్లో తలమానికమైనది సామెత. అల్పాక్షరాల్లో అనల్పార్థాన్ని తెలిపే

గొప్ప ప్రక్రియ సామెత. సామెతలు జాతి జీవన సర్వస్వాన్ని తెలియజేస్తాయి. సామెతల్లో అనేక రకాల సామెతలున్నాయి. సామెతలను జానపద విజ్ఞాన వేత్తలు వివిధ రకాలుగా వర్గీకరించారు. ఆచార్య జీ.ఎస్. మోహన్ గారు సామెతలను సూత్రపు సామెతలు, ఉపమాన రూపక సామెతలు, నీతి బోధక సామెతలు, పౌరాణిక సామెతలు, ప్రశ్నార్ధక రూప ప్రశ్నోత్తర సామెతలు, సాంఘికాచార వ్యవహారాలు విశ్వాసాలు నమ్మకాలు వున్న సామెతలు, వ్యక్తిగత సామెతలు, హాస్యపు సామెతలు, శబ్దాలంకార సామెతలు, అశ్లీల సామెతలు, న్యాయ సామెతలు, వైద్యపు సామెతలు, స్థలనామాలతో కూడిన సామెతలు, గృహజీవన సంబంధమైన సామెతలు, మాదిరిసామెతలు అని సామెతల్లోని ఇతివృత్తాన్ని ఆధారంగా చేసుకొని వర్గీకరించారు. వీటన్నింటిలోనూ ఉపవిభాగాలున్నాయి.

జానపద సాహిత్యంలో పురాగాథలు అనే ప్రక్రియ ఉంది. ఈ ప్రక్రియ కవిత్వ రూపంలోనూ వచనంలోనూ కూడా ఉంది. ఇందులో కూడా అనేక శాఖలున్నాయి. ఆ శాఖల్లో ఉప శాఖలూ ఉన్నాయి.

ఈ విధంగా జానపద సాహిత్యం అనేక విభాగాలతో, ఉపవిభాగాలతో మహాసముద్రం లాగా విస్తరించింది. ఇలా విస్తరించిన జానపద సాహిత్యాన్ని పది వ్యాసాల్లో చెప్పడం ఎంత కష్టమో విజ్ఞులకు తెలియంది కాదు. అవకాశమున్నంతలో ముఖ్యమైన అంశాలను గురించి ఈ సంచికలో తెచ్చే ప్రయత్నం చేశాం.

జానపద గేయాల్లో 70 శాతం శ్రామిక గేయాలున్నాయి. గ్రామీణులు కష్టజీవులు. గ్రామాల్లో ప్రధాన వృత్తి వ్యవసాయం. వ్యవసాయంలో దుక్కి దున్నడం, కలుపు తీయడం, నాట్లు వేయడం, ఏతాం వేయడం, కోత కోయడం,తూర్పారబోయడం మొదలైన అనేక రకాల పనులున్నాయి. అలాగే రాట్నం తిప్పడం, తిరగలి తిప్పడం, బరువు లాగటం, పడవ వేయడం మొదలైన ఎన్నో రకాల పనులను జానపదులు చేస్తున్నారు. ఈ అన్ని రకాల పనులకు ప్రత్యేకమైన జానపద గేయాలున్నాయి. మొదటి వ్యాసం శ్రామిక గేయాల మీద శ్రవణ్ కుమార్ గారు రాశారు. శ్రవణ్ కుమార్ గారూ జానపద విజ్ఞానం మీద మంచి పరిశోధన చేస్తున్నారు.

మన సమాజంలో సగం జనాభాగా ఉన్న స్త్రీలకు జానపద సాహిత్యంలో సముచిత స్థానముంది. జానపద గేయాల్లో ప్రత్యేకంగా స్త్రీల గేయాలున్నాయి. స్త్రీల గేయాల్లో సంతాన సంబంధమైన గేయాలు, వేడుకలు వినోదాలకు సంబంధించిన గేయాలు, నోములు వ్రతాలకు సంబంధించిన గేయాలు మొదలైనవి ఎన్నో ఉన్నాయి. జానపద సాహిత్యంలో పారమార్థిక గేయాలకు ప్రత్యేకమైన స్థానం ఉంది. పరమార్థం అంటే ముఖ్యమైన ప్రయోజనం. మానవ జీవితానికి పరమార్థం మోక్షాన్ని పొందడం. మానవ జీవితంలో మోక్షం పొందడం ముఖ్యమైనది కాబట్టి పారమార్థిక గేయాలను గురించి ఈ సంచికలో

రాయించాం. స్త్రీల గేయాలు పారమార్థిక గేయాలను గురించి బద్రి కూర్మా రావు గారు రాశారు. బద్రి కూర్మారావు గారు ఉత్తరాంధ్ర ప్రాంతంలోని జానపద విజ్ఞానం మీద మంచి పరిశోధన చేస్తున్నారు.

తంగిరాల వెంకట సుబ్బారావు గారు కథాగేయాల మీద విశేషమైన పరిశోధన చేశారు. వీరు కథాగేయాలను వీరగాథలు అన్నారు. కథాగేయాలను గురించి తంగిరాల సుబ్బారావు గారు రాశారు.

ఐతిహ్యాల మీద ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి గారు మంచి పరిశోధన చేశారు. పురాగాథలు ఐతిహ్యాల మీద శ్రీనివాసులురెడ్డి గారు రాశారు. అద్భుత కథల మీద పులికొండ సుబ్బాచారి గారు మంచి పరిశోధన చేశారు. వారు అద్భుత కథల మీద వ్యాసం రాశారు. కారణ కథల గురించి జయదేవ్ రాశారు.

మహాభారతం తెలుగువారికి చాలా ఇష్టమైనది. భారతంలో జానపద విజ్ఞాన అంశాలు చాలా ఉన్నాయి. ఇందులో అద్భుత కథలు, ప్రాణికథలు, నీతికథలు, కారణ కథలున్నాయి. ఈ కథలన్నింటి మీద జానపద కథల ప్రభావం ఉంది. మహాభారతంలోని ప్రాణి కథల మీద ఉన్న జానపద సాహిత్య ప్రభావం గురించి డాక్టర్ తరపట్ల సత్యనారాయణ గారు రాశారు. వీరు జానపద విజ్ఞానం మీద మంచి పరిశోధన చేస్తున్నారు.

సామెతల మీద ఆచార్య జి. ఎస్. మోహన్ గారు విశేషమైన పరిశోధన చేశారు. వారు సామెతల మీద రాశారు. ఆచార్య పగడాల చంద్రశేఖర్ గారు జానపద విజ్ఞానం మీద మంచి పరిశోధన చేస్తున్నారు. వారుపొడుపు కథల మీద రాశారు.

జానపద సాహిత్య ప్రభావం సినిమా పాటల మీద చాలా ఉంది. పైడిపాల వేణుగోపాల రెడ్డి గారు ఈ అంశం మీద పరిశోధన చేశారు. వారు జానపదం - సినీ పథం అనే పేరుతో సినిమా పాటల మీద జానపద సాహిత్య ప్రభావం గురించి రాశారు.

ఈ సంచికకి "జానపద సాహిత్య సౌరభం" అన్న సముచితమైన పేరు పెట్టాము. సాహిత్య చందనం, జానపద సౌరభం కలగలిపి జ్ఞానానందం కలిగించే ఎన్నో వ్యాసాలు ఈ సంచికలో ఉన్నాయి. ఈ సంచికను తీసుకొని రావడంలో గోపాల కృష్ణ గారితో కలిసి పని చేసినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. ఈ విషయంలో నాకు అవకాశం కలిగించినందుకు గోపాలకృష్ణ గారికి ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ఆచార్య ఎం. జయదేవ్
అతిథి సంపాదకులు

# ముఖచిత్రం

జానపద సాహిత్య సౌరభం




# లోపల

## జానపద సాహిత్య సౌరభం



## ప్రత్యేక వ్యాసాలు

# జానపద కారణ కథలు



ఆచార్య ఎం. జయదేవ్
విశ్రాంతాచార్యులు
✆ 92901 02364



జానపద సాహిత్యంలో కవిత్వం, వచనం అనే రెండు విభాగాలున్నాయి. కవిత్వంలో గేయం, కథా గేయం అనే రెండు అంతశ్శాఖలున్నాయి. వచన విభాగాన్ని గద్యకథనాలు అని కూడా అంటారు. ఈ గద్య కథనాల్లో పురాగాథలు, ఐతిహ్యాలు, కథలు, పొడుపు కథలు, సామెతలు అనే ఐదు అంతశ్శాఖలున్నాయి. జానపద సాహిత్యంలోని ఈ విభాగాలన్నింటిలోనూ అనేక ఉప విభాగాలు ఉన్నాయి. వీటన్నింటిలో జానపద కథలు ప్రత్యేకమైనవి. జానపద కథల మీద మంచి పరిశోధన పాశ్చాత్య దేశాల్లో జరిగింది. గ్రిమ్ సోదరులు Indo European, Broken down Myth సిద్ధాంతాలను, మాక్స్ ముల్లర్ Solar mythology (సూర్యపురాకథా సిద్ధాంతం), సిద్ధాంతాన్ని, థియోడర్ బెన్ఫే Indic origin సిద్ధాంతాన్ని, ఆండ్రూ లాంగ్ Cultural Evolution సిద్ధాంతాన్ని, కార్ల్ క్రోన్ Historical Geographical సిద్ధాంతాన్ని, V.J Propp Structural సిద్ధాంతాన్ని, అలెన్ డండెస్ L-LL సిద్ధాంతాన్ని జానపద కథలను ఆధారంగా చేసుకుని ప్రతిపాదించారు. వీరే గాకుండా ఆంటీ ఆర్నే, స్టిత్ థాంసన్, లెవీస్ట్రాస్ మొదలైన పాశ్చాత్య జానపద విద్వాంసులు అనేక రకాల సిద్ధాంతాలను జానపద కథల ఆధారంగా చేశారు.

భారతదేశం జానపద కథలకు పుట్టినిల్లు లాంటిది. అతి ప్రాచీన కాలం నుంచి కథలు చెప్పడం ఈ దేశంలో ఉంది. గతంలో జానపద కథలు ప్రజలకు

విజ్ఞానాన్ని వినోదాన్ని కలిగించేవి. గ్రామాల్లో పెద్దలు పిల్లలు కూడా జానపద కథలను చెప్పుకునేవారు. పిల్లలు కథలంటే చెవి కోసుకుంటారు. పెద్దవారిని కథలు చెప్పమని బ్రతిమాలుతారు. తాతయ్యలు బామ్మలు తమ మనుమలను మనమరాళ్ళను రాత్రి పూట తమ దగ్గర పడుకోబెట్టుకుని వారికి కథలు చెప్పేవారు. పిల్లలు ఆ కథలు వింటూ ఊ కొడుతూ నిద్రపోయేవారు. పెద్దలు చెప్పే కథల్లో నీతి ధర్మం దైవభక్తి మొదలైన మంచి లక్షణాలుంటాయి. కథలు వినడం వల్ల ఇవన్నీ పిల్లలకు అలవడతాయి. పెద్దలు చెప్పిన ఈ కథలను పిల్లలు తమలో తాము చెప్పుకునేవారు. తద్వారా పిల్లల్లో భాషాభివృద్ధి, కల్పనాశక్తి అలవడేవి. గ్రామాల్లోని ప్రజలు నాట్లు వేయడం కలుపు తీయడం కోత కోయడం మొదలైన పనులు చేసేటప్పుడు కథలు చెప్పుకునేవారు. దీనివల్ల వారికి శ్రమ తెలిసేది కాదు. పొలాలకు కాపలా కాసేవారు వేరే ఊరికి కాలినడకతో ప్రయాణించేవారు ఖాళీ సమయాల్లో నలుగురు కూర్చుని ఉన్నప్పుడు రకరకాల జానపద కథలను చెప్పుకొని ఆనందించేవారు. జానపద కథల్లో పాత్రలకు పేర్లు ఉండవు. ఒక ఊరిలో భార్యాభర్తలు ఉన్నారు, ఒక ఊరిలో ఒక బ్రాహ్మడున్నాడు, ఇలాగా జానపదులు కథలు చెప్పుకుంటూ పోతారు. అంతేగాని కథల్లో పాత్రలకు సాధారణంగా పేర్లు ఉండవు.

కథలు చెప్పడం ఒక కళ. కథలను అందరూ చెప్పలేరు. కథను అందంగా వినేవారికి ఆసక్తికరంగా ఉత్సాహం కలిగే విధంగా చమత్కారంగా చెప్పాలి. ఇందుకోసం కథకుడు నత్తి లాంటి అవలక్షణాలను కలిగి ఉండకూడదు. కంఠస్వరం వినసొంపుగా ఉండాలి. అంతేకాకుండా కథకుడు ధారాళంగా మాట్లాడగలగాలి. అతడు శ్రోతల వయస్సును అనుభవాన్ని గ్రహణ సామర్థ్యాన్ని అభిరుచిని బట్టి కథలు చెప్పాలి. కథకునికి సమయస్ఫూర్తి హాస్య ప్రియత్వం ఉండాలి. కథను చెప్పేటప్పుడు అవసరాన్ని బట్టి సామెతలను జాతీయాలను అలంకారాలను ప్రయోగించాలి. మధ్య మధ్యలో శ్రోతలకు కలిగే సందేహాలకు మంచి వివరణ ఇవ్వగలగాలి. ఇలాంటి లక్షణాలున్నవాడు మంచి కథకుడుగా రానిస్తాడు. అలాగే శ్రోతలకు కూడా కొన్ని లక్షణాలుండాలి. కథకుడు కథను చెప్పేటప్పుడు వినే వారిలో ఒకరు “ఊ” కొట్టాలి. శ్రోతలు ఎంత మంది ఉంటే అంతమంది “ఊ” కొట్టకూడదు. ఒకరు మాత్రమే ఊ కొట్టాలి. అందరూ ఊ కొడితే ఒక్కొక్కరు ఒక్కొక్క రకంగా ఊ కొట్టి కథకునికి చిరాకు కలిగిస్తారు. అందువల్ల ఒకరు మాత్రమే ఊ కొట్టాలి. ఊ కొట్టేవాడు కథను జాగ్రత్తగా వింటూ కథకుడు కథను చెప్పే ధోరణికి తగినట్లుగా ఊ కొట్టాలి. అంటే కథకుడు కథను నెమ్మదిగా చెబుతున్నప్పుడు దానికి తగినట్లుగా నెమ్మదిగా, కథ వేగంగా

ఉత్సాహంగా సాగుతున్నప్పుడు అదే స్థాయిలో ఊ కొడుతూ కథకునికి మంచి ప్రోత్సాహాన్ని ఇవ్వాలి. అలా కాకుండా కథ వేగంగా సాగుతున్నప్పుడు ఊ కొట్టేవాడు నీరసంగా ఊ కొడితే కథకుడు కథను చెప్పలేడు. శ్రోతల్లో మిగిలిన వారు తాము కథను శ్రద్ధగా వింటున్నామని చెప్పడానికి అప్పుడప్పుడు కొన్ని సందేహాలను వివరణలను అడగాలి. ఇలా అడగడంవల్ల అందరూ తను చెబుతున్న కథ పట్ల ఎంతో ఆసక్తిగా ఉన్నారని గ్రహించి కథకుడు మరింత ఉత్సాహంగా ఆసక్తికరంగా కథను చెబుతాడు. జానపద కథను చెప్పేటప్పుడు ఊ కొట్టేవాడు తప్పనిసరిగా ఉండాలి. ఊ కొట్టేవాడు లేకపోతే కథకుడు కథను చెప్పలేడు.

జానపద కథల్లో అద్భుత కథలు, నీతి కథలు, ప్రాణి కథలు, కారణ కథలు, హాస్య కథలు, స్త్రీల కథలు, పేదరాశి పెద్దమ్మ కథలు, మోసగాండ్ర కథలు, పురాణ కథలు, ఐతిహాసిక కథలు, శృంగార కథలు, బూతు కథలు మొదలైన అనేక రకాల కథలు దాదాపుగా అన్ని భాషల్లోనూ ఉన్నాయి. ఈ కథలకు వేరు వేరుగా ప్రత్యేక లక్షణాలున్నాయి. అద్భుత కథల్లో అద్భుత సంఘటనలకు ప్రాధాన్యత ఉంటుంది. నీతి కథల్లో ప్రధానంగా నీతి చెప్పబడుతుంది. ప్రాణి కథల్లో పశు పక్షి క్రిమికీటకాలకు ప్రాధాన్యత ఉంటుంది. హాస్య కథల్లో హాస్య సంఘటనలకు ప్రాధాన్యత ఉంటుంది. స్త్రీల కథల్లో స్త్రీలు ప్రధాన పాత్ర వహిస్తారు. పేదరాశి పెద్దమ్మ కథల్లో పేదరాశి పెద్దమ్మ అనే పాత్ర ప్రధానంగా ఉంటుంది. మోసగాండ్ర కథల్లో మోసగాండ్రు చేసే మోసాలు ప్రధానంగా చెప్పబడతాయి. శృంగార కథల్లో శృంగారానికి ప్రాధాన్యత ఉంటుంది. బూతు కథల్లో ఎక్కువగా బూతు చెప్పబడుతుంది. ఇలా ఒక్కొక్క రకం కథల్లో ఒక్కొక్క అంశానికి ప్రాధాన్యత ఉంటుంది.

## కారణ కథలు:

కారణకథ అంటే కారణానికి సంబంధించిన కథ. మరింత స్పష్టంగా చెప్పాలంటే కారణంగా చెప్పబడిన కథ. లోకంలో కొన్ని విషయాలు వస్తువులు ఆచారాలు నమ్మకాలు సంప్రదాయాలు మొదలైనవి అవి లోకంలో అలా ఉండడానికి గల కారణాన్ని గురించి కారణకథలు ఒక కథను కల్పించి చెబుతాయి. అలా చెప్పబడిన కథను కారణ కథ అంటారు. అలాగే లోకంలో కొన్ని ప్రాణులకు ప్రత్యేకమైన లక్షణాలుంటాయి. ఆ లక్షణాలు అలా ఉండడానికి గల కారణాలను గురించి కూడా కారణ కథలు ఒక కథను కల్పించి చెబుతాయి. ఈ కథల్లో ఋషులు దేవతలు ప్రధాన పాత్ర వహిస్తారు. ఈ కారణ కథల కల్పనకు సునిశితమైన లోక పరిశీలనాశక్తి చాలా అవసరం. అంతేకాకుండా తాను పరిశీలించిన లోకంలోని ప్రత్యేకమైన అంశాలకు తగిన కథను కల్పించగల

కల్పనాశక్తి కూడా కారణ కథా కర్తకు ఉండాలి. ఈకల్పనలో ఎలాంటి హేతుబద్ధత ఉండదు. కల్పన హృదయ రంజకంగా ఉంటుంది. ఈ కల్పన లో జానపదుల అమాయకత్వం కనిపిస్తుంది. ఉదాహరణకు సూర్య చంద్ర గ్రహణాలు ఏర్పడడం గురించి జానపదుల్లో ఒక కథ ప్రచారంలో ఉంది. పూర్వం కొంత మంది బాలురు అడవిలో పశువులను కాస్తూ తమకు కనిపించిన ఒక పెద్ద నాగుపాము గుడ్లను పగలగొడతారు. దానికి నాగుపాము కోపించి వారిని కాటు వేయడానికి వారి వెంట పడుతుంది. బాలురు భయంతో పరుగెత్తుకొని వెళ్లి సూర్యచంద్రుల చాటున దాక్కుంటారు. తనకు వ్యతిరేకంగా బాలురకు ఆశ్రయమిచ్చినందుకు పాము కోపించి సూర్యచంద్రులను కాటు వేస్తుంది. పాము సూర్యుని కాటు వేయడం వల్ల ఏర్పడిన మచ్చ సూర్య గ్రహణమని, చంద్రుని కాటు వేయడం వల్ల ఏర్పడిన మచ్చ చంద్రగ్రహణమని జానపదులు కల్పించారు. ఈ కల్పనలో ఎలాంటి హేతుబద్ధత లేదు. సూర్య చంద్ర గ్రహణాలు ఏర్పడడానికి ఖగోళశాస్త్రవేత్తలు చెప్పే కారణాలు వేరే ఉన్నాయి. ఈ శాస్త్రవిజ్ఞాన కారణాలు తెలియని జానపదులు తమ బుద్ధికి తోచినట్టుగా ఈ కథను కల్పించారు. ఈకథ వారి అమాయకత్వాన్ని తెలియజేస్తుంది. ఇలాగా చాల విషయాలకు జానపదులు కథలను కల్పించారు.

## 1) గ్రామ దేవతల పుట్టుక:



భారతదేశంలో ముఖ్యంగా తెలుగునాట ప్రతి గ్రామంలోనూ గంగమ్మ ఎల్లమ్మ మైసమ్మ అంకాలమ్మ పైడమ్మ పెద్దమ్మ పోచమ్మ అక్కమ్మ ముత్యాలమ్మ నూకాలమ్మ మారెమ్మ గంటాలమ్మ పోలేరమ్మ దుర్గమ్మ చౌడమ్మ మొదలైన అనేక పేర్లతో ఒక గ్రామ దేవత గానీ అంతకంటే ఎక్కువమంది గ్రామ దేవతలు గానీ ఉన్నారు. వీరికి నిర్ణీత కాలంలో అంటే సంవత్సరానికి ఒకసారి గానీ రెండేళ్లకు ఒకసారి గానీ గ్రామ దేవత పండుగ నిర్వహించి ఆ సమయంలో గొర్రెలు మేకలు దున్నలు కోళ్లు మొదలైన ప్రాణులను బలిగా ఇస్తుంటారు. ఆ ప్రాంతంలోని అన్ని కులాల వారు ఈ గ్రామ దేవతల ఉత్సవాల్లో పాల్గొని అనేక రకాల ఆహార పదార్థాలను గ్రామ దేవతకు సమర్పిస్తుంటారు. ఈ గ్రామ దేవతలందరూ ఆదిశక్తి అవతారంగా పరిగణింపబడుతున్నారు. నేను సేకరించిన దశావతార కథల్లోని విష్ణువవతార కథలో విష్ణువు ఈ గ్రామదేవతా వ్యవస్థను ఏర్పాటు చేసినట్లుగా చెప్పబడింది. ఆ కథ ఇది. సృష్టి ప్రారంభంలో ఆదిశక్తి పక్షి రూపంలో ఉద్భవించి పెట్టిన ఒక గుడ్డు నుంచి బ్రహ్మ విష్ణువు

ఈశ్వరుడు ఉద్భవిస్తారు. వారు పెరిగి పెద్దయిన తర్వాత ఆదిశక్తికి వారి మీద మోహం కలిగి మొదట బ్రహ్మను తన కోరిక తీర్చమని అడుగుతుంది. తల్లిని పొందడం మహాపాపమని బ్రహ్మ ఆమె కోరికను తిరస్కరిస్తాడు. కోపంతో ఆమె బ్రహ్మను భస్మం చేస్తుంది. అలాగే ఈశ్వరుడూ ఆమె కోరికను తిరస్కరిస్తాడు. ఈశ్వరుని కూడా ఆమె భస్మం చేస్తుంది. చివరగా ఆమె విష్ణువును తన కోరిక తీర్చమంటుంది. విష్ణువు ఆమె దగ్గర ఉన్న మూడవ నేత్రం, అనేక శక్తులు, తంత్రమంత్రాలు మొదలైనవి తనకిస్తే ఆమె కోరిక తీరుస్తానని చెబుతాడు. ఆదిశక్తి విష్ణు కోరినవన్నీ అతనికి ఇస్తుంది. విష్ణు వెంటనే ఆమెను భస్మం చేస్తాడు. తరువాత విష్ణువు బ్రహ్మను ఈశ్వరుని పునర్జీవితులను చేస్తాడు. ఆ తరువాత విష్ణువు ఆదిశక్తి బూడిదను నాలుగు భాగాలుగా చేసి మూడు భాగాల నుంచి సరస్వతి పార్వతి లక్ష్మలను సృష్టించి బ్రహ్మ కు సరస్వతిని, ఈశ్వరునికి పార్వతిని, తనకు లక్ష్మిని భార్యలుగా చేస్తాడు. నాలుగవ భాగం నుంచి తిరిగి ఆదిశక్తిని పుట్టిస్తాడు. ఆదిశక్తి పుట్టిన వెంటనే ఆకలి ఆకలి అని అలమటిస్తుంది. విష్ణువు కొర్రకూడు వరికూడు సామకూడుతో చేసిన ఆహార పర్వతాలను సృష్టిస్తాడు. ఆదిశక్తి ఆ ఆహార పర్వతాలను మూడు ముద్దలుగా చేసి మింగేస్తుంది. దానితో విష్ణువు ఇలా లాభం లేదని ఆమెతో ముందు ముందు మానవులు జన్మించి గ్రామాలు ఏర్పాటు చేసుకుంటారని, ప్రతి గ్రామంలోనూ ఆదిశక్తి ఒక గ్రామదేవతగా వెలవాలని, ప్రతి సంవత్సరం ఆ గ్రామంలోని అన్ని కులాల వారు ఆదిశక్తికి కోళ్లు గొర్రెలు దున్నలు మొదలైన వాటిని ఆమెకు ఆహారంగా సమర్పిస్తారని, కాబట్టి ఆదిశక్తి వివిధ గ్రామ దేవతల పేర్లతో గ్రామాల్లో వెలిసి ఉండాలని చెబుతాడు. ఆదిశక్తి విష్ణువు చెప్పినట్లుగా గ్రామాల్లో అనేక గ్రామ దేవతల పేర్లతో వెలసి ప్రజలతో పూజలందుకుంటూవుంది.

ఈ కథలో ఎలాంటి హేతుబద్ధత లేదు. గ్రామ దేవతలందరూ ఒక కాలంలో ఒక్కసారిగా ఏర్పడలేదు. కొందరు గ్రామదేవతలు ప్రధానంగా ప్రాచీన కాలంలోని మాతృస్వామ్యం కారణంగా ఏర్పడ్డారు. తరువాత వ్యవసాయం కారణంగా కొందరు, నీరు కారణంగా కొందరు, పేరంటాళ్ళ కారణంగా కొందరు ఇలా వేరు వేరు కారణాల వల్ల వేరు వేరు కాలాల్లో గ్రామ దేవతలు ఏర్పడ్డారు. ఇలాగ గ్రామదేవతలు ఏర్పడ్డానికి అనేక కారణాలు ఉన్నాయి. వాస్తవం ఇది కాగా ఈకథలో విష్ణువు గ్రామదేవతా వ్యవస్థను ఏర్పాటు చేసినట్లుగా కల్పించబడింది. లోకంలో ఉన్న గ్రామదేవత వ్యవస్థను చూసిన జానపద కవి ఆ వ్యవస్థను విష్ణువు ఏర్పాటు చేశాడని పై కథలో చెప్పాడు. అంటే లోకంలో ఉన్న గ్రామదేవతా వ్యవస్థ

అలా ఉండటానికి గల కారణంగా ఈ కథను కల్పించడం చేత ఇది కారణకథ అవుతూవుంది. ఈ కథలో కల్పన చక్కగా ఉంది. ఈ కల్పన లో విష్ణువు ప్రధాన పాత్ర వహించాడు. ఈ కథ పురాగాథ కూడా అవుతుంది.

## 2) కాకి కోకిల గుడ్లను పొదగడం:



కోకిల తన గుడ్లను తన గూటిలో కాకుండా కాకి లేని సమయం చూసి కాకి గూట్లో గుడ్లను పెడుతుందని, కాకి అవి తన గుడ్లుగానే భావించి వాటిని పొదిగి పిల్లలను చేస్తుందని లోకంలో ఒక వాడుక ఉంది. ఆ వాడుకను బట్టి అది అలా ఉండడానికి గల కారణాన్ని గురించి జానపద కవి ఈ కథను కల్పించాడు

ఒక గుడ్లగూబ మీదికి ఆకతాయి కుర్రాడు మట్టిబెడ్డను విసిరాడు. అది గుడ్లగూబ రెక్కల్లో ఇరుక్కుపోయి గుడ్లగూబ ఎగరకుండా ఇబ్బంది కలిగించింది. గుడ్లగూబ తన మిత్రుడైన కాకి దగ్గరకు వెళ్లి తన సమస్యను గురించి చెబుతుంది. కాకి గుడ్లగూబను తీసుకొని వైద్యుడైన కోకిల దగ్గరకు వెళ్తుంది. కోకిల సమస్యను పరిష్కరిస్తానని దానికి కొంత డబ్బు ఇవ్వాలని అయితే గుడ్లగూబ మోసకారి కాబట్టి గుడ్లగూబ తరఫున కాకి తనకు పూచీగా ఉండాలని చెబుతుంది. మిత్రుని కోసం కాకి అంగీకరిస్తుంది. అప్పుడు కోకిల గుడ్లగూబను కొంచెం సేపు నీటిలో నిలబెడుతుంది. మట్టి కరిగిపోయి గుడ్లగూబ బాధ తీరిపోతుంది. వెంటనే గుడ్లగూబ కోకిలకు డబ్బులు ఇవ్వకుండా ఎగిరిపోతుంది. కాకి డబ్బులు ఇవ్వలేక డబ్బుకు బదులుగా కోకిల గుడ్లను పొదుగుతానని చెప్పి అదే విధంగా చేస్తుంది. అప్పటి నుంచి కోకిల గుడ్లను కాకులు పొదుగుతున్నాయి.

లోకంలో ఉన్న ఒక వాడుక అది అలా లోకంలో ఉండడానికి గల కారణాన్ని గురించి పై కథ చెబుతూ ఉండటం చేత ఇది కారణం కథ అయింది. ఈ కథలో చెప్పిన కల్పన బాగుంది. ఈ కల్పన జానపదుల అమాయకత్వాన్ని తెలియజేస్తూవుంది. నిజానికి కాకులకు గుడ్లగూబలకు వైరం ఉన్నట్లుగా ఒక వాడుక ఉంది. ఈ కథను కల్పించిన జానపద కవి ఆ వాడుకను పట్టించుకోకుండా కాకికి గుడ్లగూబకు స్నేహంఉన్నట్లుగా ఈకథలో కల్పించాడు.



## 3) కుందేలు కథ:

ఈ కథ సంతాల్ తెగకు చెందిన జానపద కథ. ఈ కథ ప్రకారం గతంలో కుందేళ్ళు మనుషులను చంపి తినేవి. కుందేళ్ళ పళ్ళు చాలా విషపూరితంగా ఉండేవి. అవి కాటువేయగానే మనుషులు చనిపోయేవారు. దీనితో మనుషులు తమ నాయకుని ద్వారా స్వర్గలోకంలో ఉన్న దేవునితో తమ సమస్యను విన్నవించారు. దేవుడు కుందేళ్ళ నాయకుని పిలిపించాడు. మనుషుల నాయకుడు కుందేళ్ళ నాయకుడు పరస్పరం ఎదుటివారిదే తప్పు అని వాదించారు. దేవుడు ఇలా లాభం లేదని మనుషుల నాయకునికి ఒక చెట్టును, కుందేళ్ళ నాయకునికి ఒక చెట్టును ఇచ్చి ఒక సంవత్సరం లోపు ఎవరి చెట్టు నుంచి ఆకు ముందు రాలితే, రాలిన ఆఆకును దేవునికి తెచ్చి చూపించాలి. ఈ పోటీకి ఇద్దరు నాయకులు అంగీకరించారు. మనుషుల నాయకుని చెట్టు నుంచి ముందుగా ఆకు రాలింది. మనుషుల నాయకుడు ఆకును తీసుకొని వెళ్లి దేవునికి చూపించాడు. కుందేళ్ళ నాయకుడు పంటితో ఆకును కొరికి ఆఆకును దేవునికి చూపించాడు. దేవుడు రెండు ఆకులను పరీక్షించి కుందేలు నాయకుడు తెచ్చిన ఆకు మీద పంటి గాట్లను చూసి మనుషులు గెలిచినట్లుగా ప్రకటించాడు. అప్పుడు దేవుడు కుందేళ్ళ నాయకునితో మీరు ఇప్పటి నుంచి మనుషులను వేటాడకూడదు. మనుషులే మిమ్మల్ని వేటాడి తింటారు. మీ కాళ్ళకు మంచి బలం ఇస్తున్నాను. దానివల్ల మీరు చాలా వేగంగా పరిగెత్తుతారు. మానవులు మీతో పాటు పరిగెత్తలేరు. మీరు దొరికితే వారు మిమ్మల్ని చంపి తింటారు అని చెప్పాడు. అప్పటి నుంచి మనుషులు కుందేళ్ళను వేటాడి చంపి తింటున్నారు. (సంతాల్ జానపద కథలు, సౌభాగ్య, సాహితి ప్రచురణలు - పుటలు -21-22)

అతి ప్రాచీన కాలం నుంచి మానవులు కుందేళ్ళను చంపి తింటున్నారు. కుందేళ్ళు అందంగా ముద్దుగా ఉన్న చిన్న జీవులు. నిజానికి వీటిని చంపకూడదు. ముద్దుగా పెంచుకోవాలి. కుందేళ్లు చిన్నగా ఉన్నప్పటికీ అవి మనుషుల కంటే వేగంగా పరిగెడతాయి. వాటిని పట్టుకోవడానికి మనుషులు చాలా కష్టపడాలి. అతి ప్రాచీన కాలం నుండి మానవులు కష్టపడి వేటాడి వీటిని చంపి తింటున్నారు. ఇలా చంపి తినడానికి దేవుడు ఏర్పాటుచేసిన ఒక కట్టడి కారణంగా సంతాల్ జానపద కవి ఈ కథలో కల్పించాడు. అందువల్ల ఇది కారణకథ అవుతూవుంది.

ఇవే గాకుండా ఇప్పచెట్టు పుట్టుక కథ, ఉసిళ్ళ పుట్టుక కథ. రాత్రింబవళ్ళు ఏర్పడడం, కోడిపుంజు కొక్కొరోకో అని కూయడం, బ్రహ్మదేవుడు మానవుల నుదుట రాత రాయడం మొదలైన వాటి గురించి ఇంకా అనేక విషయాలకు సంబంధించిన జానపద కారణ కథలు లోకంలో ప్రచారంలో ఉన్నాయి.

వేదాల్లో ఇలాంటి కారణ కథలు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత ద్వితీయాష్టకం పంచమ ప్రపాఠకం ప్రథమోనువాకంలో ఉన్న ఈ కథను పరిశీలించుదాం. విశ్వరూపుడు అనే బ్రాహ్మణుడు దేవతలకు పురోహితుడుగా ఉండేవాడు. ఇతడు రాక్షసులకు మేనల్లుడు. ఇతడు యజ్ఞం చేసేటప్పుడు ప్రత్యక్షంగా దేవతలకు హవిర్భాగం చెప్పేవాడు. రహస్యంగా హవిస్సును అసురులకు ఇవ్వండి అని చెప్పేవాడు. లోకంలో ప్రత్యక్షంగా అందరికీ తెలిసేటట్లుగా ఒక విషయాన్ని చెప్పి, రహస్యంగా తద్భిన్నంగా చెప్పినప్పుడు ప్రత్యక్షంగా చెప్పినది హృదయపూర్వకంగా చెప్పినది కాదని దాని పట్ల విశ్వాసం కలుగదు. రహస్యంగా చెప్పినది హృదయపూర్వకంగా చెప్పినది అవుతుంది కాబట్టి దాని పట్ల విశ్వాసం కలుగుతుంది. విశ్వరూపుడు ఈ విధంగా స్వామి ద్రోహం చేసి తన రాజ్యాన్ని అసురులకు లభించేటట్లు చేస్తాడని ఇంద్రుడు భయపడి విశ్వరూపుని శిరస్సును వజ్రాయుధంతో ఖండిస్తాడు. విశ్వరూపుడు బ్రాహ్మణుడు కావడం చేత అతణ్ణి సంహరించడం వల్ల ఇంద్రునికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంటుంది. బ్రహ్మహత్యాపాతకాన్ని ఇంద్రుడు ఒక సంవత్సరం పాటు భరిస్తాడు. అప్పుడు సర్వప్రాణులు ఇంద్రుని బ్రహ్మహంతా అని సంభోదిస్తూ ఆక్రోశించాయి. అప్పుడు ఇంద్రుడు భూమి వద్దకు వెళ్లి తనకు కలిగిన బ్రహ్మ హత్యలో మూడవ భాగాన్ని స్వీకరించుమని భూమిని ప్రార్థిస్తాడు. దానికి భూమి ప్రజలు నన్ను తవ్వి బాధ పెడుతున్నారు, తవ్విన ప్రదేశాలుపూరింప బడాలి అనే వరాన్ని పొంది బ్రహ్మహత్య లో మూడవ భాగాన్ని భూమి స్వీకరిస్తుంది. ఇంద్రుని వరం వల్లనే భూమిలో తవ్విన ప్రదేశం పూరితమవుతూ ఉంది. భూమి స్వీకరించిన బ్రహ్మహత్య వల్ల భూమిలో ఉప్పు, చవిటి నేల ఏర్పడింది. తర్వాత ఇంద్రుడు వృక్షాల వద్దకు వెళ్లి తనకు కలిగిన బ్రహ్మహత్యలో మూడవ భాగాన్ని స్వీకరించవలసిందిగా వాటిని కోరతాడు. వృక్షాలు మా ఛిన్న ప్రదేశం (నరకబడిన ప్రదేశం) వల్ల మేము బాధపడకుండా ఉండేటట్లుగా వరం ఇవ్వాలి అని చెబుతాయి. దానికి ఇంద్రుడు మీ చిన్న ప్రదేశం నుంచి మొలకలు వస్తాయి అనే వరాన్ని ఇస్తాడు. వృక్షాలు మూడవ భాగాన్ని స్వీకరిస్తాయి. వృక్షాలు స్వీకరించిన ఆ బ్రహ్మహత్య వల్ల వృక్షాల ఛిన్న ప్రదేశం నుంచి స్రవించి ఘనీభవించిన ద్రవం జిగురు అవుతూవుంది. ఇది బ్రహ్మహత్యాఫలం కాబట్టి ఇది తినదగినది కాదు.

తర్వాత ఇంద్రుడు స్త్రీలు కూర్చున్న సభ వద్దకు వెళ్లి తన బ్రహ్మహత్యాపాతకంలో మూడవ భాగం తీసుకోవలసిందిగా వారిని కోరతాడు. దానికి వారు మేము ఋతు సంబంధమైన వీర్యం వల్ల సంతానాన్ని పొందుతాము. ప్రసవ పర్యంతం కోరిక ననుసరించి పురుషులతో కలుస్తాం అనే వరాన్ని కోరతారు. ఇంద్రుడు వారికి ఆ వరాన్ని ఇస్తాడు. స్త్రీలు ఇంద్రుని బ్రహ్మహత్యలో మూడవ భాగాన్ని స్వీకరిస్తారు. ఇంద్రుడు ఇచ్చిన వరం వల్లన స్త్రీలు ఋతు సంబంధమైన వీర్యం వల్ల సంతానాన్ని పొంది ప్రసవ పర్యంతం కోరిక ననుసరించి పురుషులతో కలుస్తున్నారు. స్వీకరించిన బ్రహ్మహత్య వారిలో రజస్వల అయింది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది. (కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత, ద్వితీయ కాండ, పంచమ ప్రపాఠకం, ప్రథమోనువాకం, వ్యాఖ్యాన కర్త- శ్రీరామవరపు కృష్ణమూర్తి శాస్త్రి, పుటలు- 266- 272, తిరుమల తిరుపతి దేవస్థానములు ప్రచురణ)

పై కథలో ఇంద్రుడు తనకు సంక్రమించిన బ్రహ్మహత్యాపాతకాన్ని మూడు భాగాలుగా చేసి భూమి, వృక్షాలు, స్త్రీలకు పంచాడు. దానికి ప్రత్యుపకారంగా వారికి మూడు వరాలు ఇచ్చాడు. ఇంద్రుని బ్రహ్మహత్యా పాతకం స్వీకరించడం వల్ల ఆ మూడింటికీ సంక్రమించిన లక్షణాలు, ఇంద్రుడు వాటికి ఇచ్చిన వరాల వల్ల ఆ మూడింటికి సంక్రమించిన లక్షణాలు అంతకు ముందు నుంచి ప్రకృతిలో ఉన్నవే. ఆ లక్షణాలేవి కొత్తవి కావు. భూమిలో గోతిని తవ్వితే గాలి వల్ల వర్షం వల్ల ఆ గొయ్యిలో మట్టి ఆకులు మొదలైనవి చేరి దానంతటదే పూడిపోతూ ఉంటుంది. అలాగే భూమిలో అనేక కారణాల వల్ల సహజంగా ఉప్పు చవిటి నేలలు ఏర్పడుతున్నాయి. చెట్ల కొమ్మలు నరికితే నరికిన ప్రదేశంలో అనేక మొలకలు వస్తాయి. అలాగే నరికిన దగ్గర ద్రవం కారి అది గట్టిపడి జిగురుగా మారుతుంది. స్త్రీ ఋతుమతి అయిన తర్వాత పురుషుడు సంభోగించడం వల్ల సంతానవతి అవుతూవుంది. ప్రసవం తర్వాత స్త్రీలు తమ కోరిక ననుసరించి పురుషులతో కలుస్తున్నారు. అలాగే స్త్రీలు అనాది నుంచి రజస్వలలు అవుతున్నారు. ఈ విధంగా భూమి వృక్షాలు స్త్రీలు ఆదినుంచి ప్రకృతిలో పై లక్షణాలను కలిగి ఉన్నారు. ఈ లక్షణాలన్నీ ఇంద్రుని నుంచి తీసుకున్న బ్రహ్మహత్యాపాతకం వల్ల, అతడు ఇచ్చిన వరాలవల్ల భూమి వృక్షాలు స్త్రీలకు సంక్రమించినట్లుగా ఈ కథలో కల్పించడం చేత ఇది కారణకథ అవుతూవుంది. అంటే లోకంలో ఉన్న కొన్ని విషయాలు అలా లోకంలో ఉండడానికి గల కారణాన్ని గురించి ఈ కథ చెబుతూ ఉండడంచేత ఇది కారణం అయింది.

కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత లోని ఈ కథ సంస్కృత రామాయణం, భారతం, భాగవతాల్లో కొన్ని మార్పులతో చెప్పబడింది. ఈ విషయాలన్నింటినీ

నేను రాసిన మహాభారతంలో జానపద కథాంశ కథలు అనే పుస్తకంలో వివరంగా ఇచ్చాను. ఈ గ్రంథంలో నేను సంస్కృత మహాభారతం లోని ఇరవైనాలుగు కారణ కథలను మహాభారతంలో కట్టు కథాంశ కథలు అనే రెండవ అధ్యాయం లో చర్చించాను. ఉదాహరణకు ఒక కథను క్లుప్తంగా వివరిస్తాను. చెప్పులు గొడుగు మనకు ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. వాటిని మొదటి సూర్యుడు సృష్టించి జమదగ్ని మునికి ఇచ్చాడని అప్పటినుంచి అవి భూలోకంలో అందుబాటులోకి వచ్చాయని సంస్కృత భారతంలో చెప్పబడింది. ఈ పుస్తకంలో నేను కారణకథలను కట్టుకథలు అని పిలిచాను. కట్టు అంటే కల్పించడం అని అర్థం. సాహిత్యంలో ప్రధానంగా కల్పన ఉంటుంది. కట్టు కథలు అంటే కల్పించబడిన కథలు అని అర్థం. సాధారణంగా కథలన్నీ కల్పించబడినవే. అందువల్ల కట్టుకథలు అనే పేరు అన్ని కథలకూ వర్తిస్తుంది. ఈ వ్యాసంలో చర్చిస్తున్న కథలు లోకంలో ఉన్న విషయాలు అలా అవి ఈ లోకంలో ఉండడానికి గల కారణాన్ని గురించి చెబుతూ ఉండటం చేత ఆ కథలకు కారణ కథలు అనే పేరు సముచితంగా ఉందని భావించి నేను వ్యాసంలో ఈ కథలను కారణ కథలు అనే పేరుతో పరిశీలించాను.

> పై కథలో ఇంద్రుడు తనకు సంక్రమించిన బ్రహ్మహత్యాపాతకాన్ని మూడు భాగాలుగా చేసి భూమి, వృక్షాలు, స్త్రీలకు పంచాడు. దానికి ప్రత్యుపకారంగా వారికి మూడు వరాలు ఇచ్చాడు.

## హాస్య కథలు:

జానపద సాహిత్యంలో హాస్యానికి ప్రముఖమైన స్థానం ఉంది. జానపద గేయాలు, కథాగేయాలు, వచన కథలు, పొడుపు కథలు, సామెతలు వీటన్నింటిలోనూ హాస్య సంబంధమైన విభాగం ఉంది. ప్రాచీన సాహిత్యంలో హాస్యానికి పెద్దగా చోటు లభించలేదు. ప్రాచీన కవుల అభిప్రాయంలో నవ్వు నాలుగు విధాల చేటు. గౌరన లాంటివాళ్ళు ఏ



కొద్దిమందో తమ కావ్యాల్లో హాస్యానికి స్థానం కల్పించారు. యక్షగాన సాహిత్యంలో హాస్యం ప్రముఖంగా ఉంది. ఆధునిక సాహిత్యంలో హాస్యానికి సముచితమైన స్థానముంది. హాస్యాన్ని వ్యవహారంలో నవ్వు అని పిలుస్తున్నాం. నేటి యాంత్రిక జీవితంలో నవ్వు చాలా అవసరం. నవ్వడం నవ్వించడం నేర్చుకున్న వాళ్ళు చాలా ఆరోగ్యంగా ఉంటారు. మనసారా హాయిగా నవ్వడం వల్ల ఒత్తిడి లాంటి మానసిక బాధల నుంచి విముక్తి పొందవచ్చు. మానసిక వైద్యులు లాఫింగ్ థెరపీ ద్వారా ఆరోగ్యాన్ని పొందవచ్చునని సూచిస్తున్నారు. ఈ కారణం చేతనే హైదరాబాదు బెంగళూరు చెన్నై ఢిల్లీ లాంటి పెద్ద పెద్ద నగరాల్లో లాఫింగ్ క్లబ్బులు ఏర్పడ్డాయి. ఈ క్లబ్బుల్లోని సభ్యులు ఉదయం సాయంత్రం పబ్లిక్ పార్కుల్లో అందరూ కలిసి చమత్కారమైన మాటలతో (జోక్స్ తో) హాయిగా నవ్వుకుంటూ ఆరోగ్య భాగ్యాన్ని పొందుతున్నారు. మరికొందరు గుండ్రంగా నిలబడి కృత్రిమంగా అనేక రకాలుగా నవ్వుతూ ఆరోగ్య భాగ్యాన్ని పొందడం కోసం ప్రయత్నిస్తున్నారు. దీన్నిబట్టి మానవ జీవితంలో హాస్యం అవసరం ఎంత ఉందో మనకు అర్థం అవుతుంది. ఈ అవసరాన్ని జానపదాలు ఏనాడో గ్రహించారు. జానపదులు నవ్వు నాలుగు విధాలుగా లాభం అని భావిస్తారు. అందువల్లనే వారు సంతోషం సగం బలం అన్నారు. వారు తాము సృష్టించిన సాహిత్యంలో హాస్యానికి ప్రముఖమైన స్థానం కల్పించారు. హాస్య కథల్లో కడుపుబ్బా నవ్వుకునే కథలు ఉన్నాయి. హాస్య కథలను వినోద కథలు అని కూడా అంటారు. హాస్య కథలు జానపదులకు వినోదాన్ని సంతోషాన్ని ఆనందాన్ని కలిగించడమే కాకుండా శ్రమను కూడా తొలగిస్తాయి. హాస్య కథలు వాస్తవానికి దూరంగా ఉంటాయి. కొన్ని హాస్య కథల్లో సోమరిపోతులు మూర్ఖులు పాత్రులుగా ఉంటారు. కొన్ని హాస్య కథలు మొరటుగా కూడా ఉంటాయి. జానపదులు మొరటు హాస్యాన్ని చక్కగా ఆస్వాదిస్తారు. జానపద హాస్య కథల్లో తెనాలి రామలింగని కథలు, మర్యాద రామన్న కథలు, పరమానందయ్య శిష్యుల కథలు ప్రధానంగా చెప్పుకోవచ్చు. ఇవి కాకుండా గ్రామాల్లో జానపదులు అనేక హాస్య కథలను చెప్పుకుంటూ ఉంటారు. ఇలాంటి హాస్య కథలను కొంతమంది పరిశోధకులు సేకరించి ప్రచురించారు. అలాంటి వాటిలో నేదునూరి గంగాధరం గారు సేకరించిన చాదస్తపు బ్రాహ్మడు కథ మంచి హాస్య కథ. ఈ కథను తెలుగు విశ్వ విద్యాలయం వారు “నేదునూరి గంగాధరం జానపద విజ్ఞాన వ్యాసాలు” అనే పుస్తకంలో ప్రచురించారు. ఆ కథ ఇది.

## 1) చాదస్తపు బ్రామ్మడు కథ:

ఒక ఊరిలో ఒక చాదస్తపు బ్రామ్మడు ఉండేవాడు. అతను ఒక రోజున పొరపాటున భార్య ఎంగిలి తిన్నాడు. ఆ ఎంగిలి తిన్న పాపం కాశీకి వెళ్లి గంగలో స్నానం చేస్తే గాని పోదనుకున్నాడు. వెంటనే తూ తూ తూ అని ఊసుకుంటూ కాశీకి బయల్దేరాడు. అలా కొంత దూరం వెళ్ళేటప్పటికి అతనికి దాహం వేసింది. దారి పక్కన ఒక ఊర్లో ఒక ఇంటి ఆవిడను మంచినీళ్లు అడిగితే ఎంగిలి దోషం వస్తుందని వక్క ఇవ్వమని అడిగాడు. ఆమె వక్క ఇచ్చింది. బ్రాహ్మడు దాని నోట్లో వేసుకొని కటుక్కున కొరికాడు. అది చూసి ఆమె “అయ్యో బ్రామ్మడా వక్క కొరికేశావా? ఇంతకు ముందు దాన్ని ఎంతమందికో ఇచ్చాను, వాళ్లు దాన్ని కాసేపు చప్పరించి తిరిగి నాకు ఇచ్చే వాళ్ళు. నువ్వు అలాగే చప్పరించి ఇస్తావనుకున్నాను, ఎంతపని చేశావయ్యా “అని అంది. వెంటనే బ్రాహ్మడు చచ్చాన్రా దేవుడా అనుకుంటూ వక్కను గబుక్కున ఊసేసి తూ తూ అనుకుంటూ మళ్లీ బయలుదేరాడు.

అతను వెళ్తూ వెళ్తూ మరొక ఊరు చేరుకున్నాడు. ఆకలి వేస్తుంటే ఒక ముసలమ్మ ఉన్న ఇంటికి వెళ్లి ఆకలి వేస్తుంది అన్నం పెడతావా అమ్మా అని అడిగాడు. దానికేం భాగ్యం స్నానం చేసి రా నాయనా అని ఆమె చెప్పింది. బ్రామ్మడు స్నానం చేసి వచ్చాడు. విస్తరిలో భోజనం పెట్టింది ముసలమ్మ. అతను భోజనం చేసిన తర్వాత విస్తరి మడిచి ఎక్కడ పారేయాలి అని అడిగాడు. ఆమె” అదేమిటయ్యా అలా అడుగుతావు? తిన్న విస్తరి కడిగి దాచుకుంటారు గానీ, మడిచి పారేస్తారా? నువ్వు తిన్న విస్తరిలో ఇంతకు ముందు నీ బోటి వాళ్ళు ఎందరో తిన్నారు, మళ్లీ ఎవరైనా వస్తే భోజనం ఎందులో పెట్టమంటావూ? విస్తరి కడిగి ఇంట్లో పెట్టు” అంది.



వెనుకటి పాపాలకు తోడు పులిస్తరాకులో అన్నం తిన్న పాపం కూడా చుట్టుకుందిరా దేవుడా అనుకుంటూ బ్రామ్మడు మళ్లీ బయలుదేరాడు. అతను వెళ్తూ వెళ్తూ మరొక ఊరు చేరుకొని ఒక ఇంటి ఆవిడను భోజనం పెట్టమని అడిగాడు. ఆ ఇంటి ఆవిడ అతనికి పాయసంతో భోజనం

> చాదస్త లక్షణానికి బ్రాహ్మణులను పాత్రలుగా చేస్తుంటారు. చాదస్తం పరిశుభ్రత మొదలైనవి మితిమీరి ఉంటే హాస్యానికి పాత్రమవుతూ ఉంటాయి.

పెట్టింది. బ్రామ్మడు భోజనం చేశాక పాయసం చాలా బాగుందన్నాడు. అప్పుడు ఆవిడ "అయ్యో నాయనా పైన మీగడంతా కుక్క నాకేసింది, లేకపోతె పాయసం మరింత బాగుండును" అంది. ఆమె మాటలు వినగానే బ్రామ్మడి ప్రాణాలు పోయినంత పని అయ్యింది. కుక్క ఎంగిలి తినవలసిన గతి పట్టింది రా దేవుడా అనుకుంటూ లబోదిబోమంటూ ఇంక ఎక్కడా భోజనం చేయకూడదని నిశ్చయించుకొని తిన్నగా కాశీకి చేరుకున్నాడు. అప్పటికీ కనుచీకటి పడింది. బ్రామ్మడు గంగా నదిలో దిగి నీళ్లలో మునిగాడు. అదే సమయానికి ఒక పల్లెటూరి అమాయకుడు తండ్రి చనిపోతే దహనం చేసిన బూడిదను చూడకుండా బ్రామ్మడి తల మీద పోశాడు. బ్రామ్మడు ఛి ఛి అనుకుంటూ నీటిలో నుంచి లేచాడు. పల్లెవాడు అతన్ని చూసి తన తండ్రి బతికి వచ్చాడనుకొని నాన్నా అని కౌగిలించుకొని వదలకుండా పట్టుకున్నాడు. నేను నీ తండ్రిని కాదు అని బ్రామ్మడు ఎంత చెప్పినా పల్లెవాడు వినకుండా నువ్వు మా బాబువే అంటూ ఇంటికి లాక్కుపోవడం మొదలుపెట్టాడు. ఇది చూసి దారిలో వెళ్తున్న నలుగురు పోగయ్యారు. వాళ్ళిద్దరి గోల విని కడుపు చెక్కలయ్యే లాగా నవ్వడం మొదలుపెట్టారు. చివరికి వాళ్ల తగవు తీర్చలేక అక్కడి జనం వాళ్ళిద్దరినీ మంత్రి దగ్గరికి తీసుకు వెళ్లారు. మంత్రి వాళ్ళిద్దరూ చెప్పిందంతా విని "చచ్చిపోయిన తండ్రి ఎలా బతికి వచ్చాడనుకున్నావ్ రా పిచ్చోడా!" అని పల్లెవాడినీ, "నీ చాదస్తానికి తగిన శాస్తి జరిగింది లే!" అని బ్రామ్మడినీ మందలించాడు. ఆ తర్వాత ఎవరి ఇంటికి వాళ్ళు వెళ్ళిపోయారు. (నేదునూరి గంగాధరం జానపద విజ్ఞాన వ్యాసాలు-పుటలు-73,74)

చాదస్త లక్షణానికి బ్రాహ్మణులను పాత్రలుగా చేస్తుంటారు. చాదస్తం పరిశుభ్రత మొదలైనవి మితిమీరి ఉంటే హాస్యానికి పాత్రమవుతూ ఉంటాయి. నిజానికి మితిమీరిన చాదస్తం, పరిశుభ్రత ఒక రకమైనమానసిక రోగ లక్షణాలు. ఈ కథలో జానపద కవి మితిమీరిన చాదస్తం కలిగిన బ్రాహ్మణుని ప్రధాన పాత్రగా చేసుకుని చక్కటి హాస్యాన్ని కలిగించాడు. భార్య ఎంగిలి తగలడం పాపం కాదు.

దానికోసం కాశీకి వెళ్లి గంగలో స్నానం చేయనక్కర్లేదు. ఎవరైనా అలా భావిస్తే తప్పనిసరిగా నవ్వు వస్తుంది. ఈ కథలో బ్రాహ్మణుడు అలా భావించి కాశీకి బయలుదేరుతాడు. అలా బయలుదేరిన అతను దారిలో చాలామంది నోట్లో వేసుకొని చప్పరించి వదిలివేసిన వక్కను నోట్లో వేసుకోవడం, పులిస్తరాకులో భోజనం చేయడం, కుక్క నాకిన పాయసం తినడం, మనిషి బూడిదను తలపైన వేసుకోవలసి రావడం జరుగుతుంది. ఇవన్నీ ఒకదాన్ని మించిన దోషాలు మరొకటి. అసహ్యకరమైనవి. అతని దృష్టిలో పాపాన్ని కలిగించేవి. ఈ దోషాలకు అతను గురి అవుతూ బాధపడుతున్నప్పుడు పాఠకునికి నవ్వు వస్తుంది దీనికి కారణం అతనిలో ఉన్న చాదస్తమే. భార్య ఎంగిలి తగలకుండా ఎవరూ కాపురం చేయలేరు. పనిగట్టుకొని అలా కాపురం చేయాలనుకుంటే అది హాస్యాస్పదమే అవుతుంది.

ఈ కథలోని సంఘటనలన్నీ వాస్తవానికి దూరంగా ఉన్నాయి. ఎంత చాదస్తుడైనా భార్య ఎంగిలి తగిలితే పాపమని, ఆ పాపం పోగొట్టుకోవడానికి కాశీకి వెళ్ళి గంగలో స్నానం చేయాలని భావించడు. అలాగే వక్కను నోట్లో వేసుకుని చప్పరించి ఎవరూ దాన్ని తిరిగి ఇవ్వరు. విస్తరాకులో అన్నం తిని దాన్ని కడిగి ఎవరు దాచుకోరు. కుక్క నాకిన పాయసాన్ని బ్రాహ్మణులకు ఎవరూ పెట్టరు. అలాగే ఎంత అమాయకుడైనా చనిపోయిన తండ్రిని బూడిద చేసిన తర్వాత ఆ బూడిద నుంచి తిరిగి తండ్రి బతికి వస్తాడని ఎవరూ భావించడు. ఈ కథలోని సంఘటనలు వాస్తవానికి దూరంగా ఉన్నప్పటికీ శ్రోతలకు లేక పఠితలకు నవ్వు తెప్పిస్తాయి.

## 2) పరమానందయ్య శిష్యుల కథ:

ఒకసారి పరమానందయ్య గారికి కాలిలో ముల్లు విరిగింది. శిష్యులను సూది కొనుక్కొని రావడానికి పంపించారు. శిష్యులందరూ సూది కోసం వెళ్లి సూది కొనుక్కున్నారు. అయితే సూదిని ఎవరు పట్టుకోవాలన్న ది సమస్య వచ్చింది. నేను పట్టుకోవాలంటే నేను పట్టుకోవాలని వాదులాడుకున్నారు. చివరికి అందరూ కలిసి పట్టుకోవాలని నిర్ణయానికి వచ్చారు.



సూదిని ఒక దూలానికి గుచ్చి మోసుకుని వస్తూ ఉన్నప్పుడు వారికి ఒక వేశ్య ఎదురుపడి దండం పెట్టింది. శిష్యులందరూ తనకు దండం పెట్టిందంటే తనకు దండం పెట్టిందని వాదులాడుకోవడం ప్రారంభించారు. చివరకు ఆమె ఎవరికి దండం పెట్టింది తెలుసుకోవడానికి ఆమె దగ్గరికి వెళ్లి అడిగారు. శిష్యులు శుద్ధ వెర్రివాళ్ళనే సంగతి ఆమె గ్రహించి మీలో ఎవరు శుద్ధ వెర్రిముండాకొడుకో వారికి దండం పెట్టాను అని చెప్పింది. శుద్ధ వెర్రి ముండాకొడుకును నేనంటే నేనని వాళ్లు వాదులాడుకుంటూ సిగపట్లకు ప్రారంభించారు. ఈ గడబిడ లో సూది ఎక్కడో పడిపోయింది. దాని కోసం వెతికి వెతికి చివరకు సూది లేకుండానే గురువు గారి దగ్గరకు వచ్చారు.

పరమానందయ్య శిష్యుల కథల్లో ప్రజల్లో బాగా ప్రచారంలో ఉన్న కథ ఇది. పరమానందయ్య శిష్యులు శుద్ధ వెర్రివాళ్లుగా ప్రసిద్ధులు. గురువు గారు ఏ పని చెప్పినా అందరూ కలిసే చేస్తారు. ఒంటరిగా ఏ పని చేయరు. గురువు సూదిని కొనుక్కురమ్మని చెప్పగానే అందరూ కలిసి వెళ్లి సూదిని కొనుక్కున్నారు. శిష్యులందరూ గురువుగారు మెప్పు కోసం ప్రయత్నిస్తూ ఉంటారు. అందుకని సూదిని తాను పట్టుకోవాలంటే తాను పట్టుకోవాలని వాదులాడుకుని చివరకు దాన్ని ఒక దూలానికి గుచ్చి అందరూ కలిసి మోసుకొని వస్తుంటారు. సూదిని దూలానికి గుచ్చి మోసుకొనివచ్చే సన్నివేశం చాలా నవ్వు కలిగిస్తుంది. వేశ్య అందరికీ కలిపి నమస్కారం పెడితే శిష్యులందరూ నాకు పెట్టిందంటే నాకు పెట్టిందందని వాదులాడుకోవడం, చివరకు ఆమె దగ్గరకే వెళ్ళి అడగడం, శుద్ధ వెర్రిముండాకొడుకును నేనంటే నేనని వాదులాడుకోవడం మొదలైన సంఘటనలు కడుపుబ్బా నవ్వు తెప్పిస్తాయి.

## 2) సోమరిపోతు కథ:



ఒక ఊరిలో ఒక ధనవంతుడు ఒక సోమరిపోతును తన ఇంట్లో పనివాడిగా పెట్టుకున్నాడు. ఒకసారి ధనవంతుడికి వాంతులు విరోచనాలు పట్టుకున్నాయి. ధనవంతుడు సోమరిని "నువ్వు వెంటనే పరిగెత్తుకొని వైద్యుని దగ్గరకు వెళ్లి మందు తీసుకొని రా" అని చెప్పాడు. సోమరిపోతు "ఇప్పుడు అంత దూరం పరిగెత్తుకొని వెళ్తే వైద్యుడు ఇంట్లో

ఉంటాడో? ఉండడో ? అని అంటాడు. ధనవంతుడు "వైద్యుడు తప్పనిసరిగా ఉంటాడు నువ్వు వెళ్ళు" అని అంటాడు. సోమరిపోతు "వైద్యుడు ఇంట్లో ఉన్నప్పటికీ మందు ఇస్తాడో ? ఇవ్వడో ? " అని అంటాడు. ధనవంతుడు "నేను చీటీ రాసి ఇస్తాను అది వైద్యునికిస్తే అతడు మందు ఇస్తాడు" అని అంటాడు. "సరే మందు ఇస్తాడు దానివల్ల మీ జబ్బు తగ్గుతుందో ? తగ్గదో ? అని సోమరిపోతు అంటాడు. దానితో ధనవంతుడికి కోపం వచ్చి "ఒరే వెధవా ఎంతగా చెప్పినా వెళ్లకుండా ఇక్కడి ఉండి ఇన్ని ప్రశ్నలు వేస్తావెందుకు తొందరగా వెళ్లి చావు" అని అంటాడు. అయినప్పటికీ సోమరిపోతు అక్కడి నుంచి కదలకుండా "సరే వైద్యుని ఇంటికి వెళ్తాను, ఆయన ఉంటే చీటీ ఇస్తాను, ఆయన మందు ఇస్తే నేను తెస్తాను, మీరు తింటారు, రోగం కుదురుతుంది, అయినప్పటికీ ఎప్పుడైనా ఈ పాడు బొందిలో నుంచి ప్రాణం పోవాల్సిందే కదా, అది ఇప్పుడే ఎందుకు పోకూడదు" అని అంటాడు.

ఈ కథ పూర్తిగా సంభాషణ రూపంలో ఉంది. సోమరిపోతులకు పనిచేయటం చాలా కష్టంగా, ప్రాణసంకటంగా ఉంటుంది. ఈ కథలో యజమాని వాంతులు విరోచనాలతో బాధపడుతూ మందు కోసం తహ తహలాడుతూ వుంటే సోమరిపోతు అయిన సేవకుడు మందు కోసం వెళ్లకుండా చాల తాపీగా అనవసరమైన సందేహాలు వెలిబుచ్చడం చూస్తే నవ్వు వస్తుంది. ఇలాంటి కథలు చాలా ఉన్నాయి.

## సంప్రదించిన గ్రంథాలు


1) కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత, రెండవ సంపుటం, వ్యాఖ్యాన కర్త- శ్రీ రామవరపు కృష్ణమూర్తి శాస్త్రి, తిరుమల తిరుపతి దేవస్థానములు ప్రచురణ

2) జానపద కథలు - గాథలు - నేదునూరి గంగాధరం- తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ

3) జానపద అద్భుతం కథా నిర్మాణం - పులికొండ సుబ్బాచారి

4) తెలుగు జానపద కథలు - డాక్టర్ జి ఎస్ మోహన్

5) నేదునూరి గంగాధరం జానపద విజ్ఞాన వ్యాసాలు- పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ

6) మహాభారతంలో జానపద కథాంశ కథలు - ఆచార్యం ఎం. జయదేవ్

7) సంతాల్ జానపద కథలు - సౌభాగ్య - సాహితి ప్రచురణలు

# పారమార్థిక గేయాలు – స్త్రీల పాటలు



డా. బద్రి కూర్మారావు
97047 98643




జనపదమనగా పల్లె, పల్లెల్లో నివసించే ప్రజలు తాము పొలాల్లోను, ఇతర పనులు చేసుకొనేటప్పుడు తమ శ్రమను మర్చిపోవడానికి ఎన్నో కళలు, పాటలు సృష్టించుకున్నారు. అవే జానపద పాటలు. సినిమా, టి.వి లేని రోజులలో ఈ జానపదకళలు నిరక్షరాస్యులైన ప్రజలకు ఎంతో విజ్ఞానాన్ని, వినోదాన్ని అందించాయి.

జానపదం ప్రపంచమంతా విశాలమైనది. సముద్రమంత లోతైనది. నేటికీ అమెరికా, ఫిన్‌లాండ్ లాంటి దేశాలలో కళాకారులతో జానపద జాతర్లు జరుగుతూనే వున్నాయి. అమెరికా జానపద ప్రజాగాయకుడు బాబుడిలాన్‌కు నోబెల్ బహుమతి రావడమే దీనికి ఉదాహరణ. ఇంకా చైనా, ఆఫ్రికా, ఇరాన్, బంగ్లాదేశ్, బర్మా వంటి దేశాలలో ఈ కళలు సజీవంగానే వున్నాయి. దురదృష్టవశాత్తు నేటి ఆధునిక మాధ్యమంలో ఈ కళలు సాహిత్యం కనుమరుగయ్యే దుస్థితికి చేరుకున్నాయి.

భారతదేశంలో ప్రతి రాష్ట్రంలో జానపద కళలు ఉన్నాయి. దాండియా, గార్బా, బిహు, లావణి, బాంగ్రా, యక్ష గానం, తోలుబొమ్మలాట, పాములాట వంటి వందలాది కళారూపాలున్నాయి.

తెలుగు నేలపై యక్ష గానాలు, తోలుబొమ్మలాట, ఒగ్గుకథ, చెక్కభజన, కోలాటం, తప్పెటగుళ్ళు, జముకులపాట, థింసా చెంచు బాగోతం, గరగలు,

ఉరుములు వంటి 150కి పైగా జానపదకళలున్నాయి.

అలాగే జానపద సాహిత్యానికి వస్తే పారమార్థిక గేయాలు స్త్రీల పాటలు, హాస్యపు పాటలు, సందర్భానుసారంగా వచ్చే వేడుక పాటలు, బతుకమ్మ పాటలు, మంగళహారతులు వంటి పాటలున్నాయి.

పారమార్థిక గేయాలు, స్త్రీల గేయాలు తెలుసుకోవడం ఈ వ్యాసం ప్రధాన ఉద్దేశం.

## పారమార్థిక జానపద గేయములు :

భక్తి, జ్ఞాన, కర్మ మార్గములు మూడు మోక్ష మార్గములని భారతీయుల విశ్వాసం. ఒకరు భక్తికి ప్రాధాన్యత యిస్తే ఇంకొకరు జ్ఞాన మార్గమునకు ప్రాధాన్యమిచ్చారు. ఇందులో భక్తిమార్గం సులభం. అందుకే వీర, శైవ, వైష్ణవవాది భక్తి మతములు ప్రజాబాహుళ్యం నధికవ్యాప్తి గాచించినవి. దీనికి చదువు సంధ్యలతో పనిలేదు.

భక్తి సారస్వతమున దక్షిణం ఆళ్వారులు, నాయిన్మారుల చేతను పెంపొందింది. అటులనే ఉత్తర భారతమునందు రామానందుడు, రవిదాసు, నరసింహమెహతా, కబీరు, మీరాబాయి, తులసీదాసు, వల్లభాచార్యులు, నానక్ మొదలగువారు, మహారాష్ట్ర ప్రాంతమున నామదేవు, తుకారాం, సమర్ధ రామదాసు మున్నగు వారు భక్తి సారస్వతంను ఇతోధికం రచనలు చేశారు. వంగదేశంన చైతన్య ప్రభువులు ప్రసిద్ధుడు.

ఆంధ్ర దేశంన శైవ, వైష్ణవ, భక్తి గేయములు వేలకొద్ది రచింపబడినవి. క్షేత్రయ్య సుమారు నాలుగువేల పదాలు రచించినారు. త్యాగరాజు లెక్కలేనన్ని కీర్తనలు రచించినా మిగిలినవి వందలులో ఉన్నవి.

జానపదమునందు అధిక ఆదరణ పొందిన గేయ కీర్తనలలో అగ్రగణ్యుడు భద్రాచల రాముడు (కంచెర్ల గోపన్న), తూము నరసింహదాసు, పరాంకుశదాసు, నిట్టల ప్రకాశదాసు వంటి వారి భక్తి గేయములు కూడా బహుళ ప్రచారం పొందినవి.

దండం తిరుపతి కొండ
యది దండం సిరిగల కొండ
పరాకు చేయుట పాడిగాదురా

యని పాడుచూ ఊరూరా తిరిగెడు హరిదాసుల కన్నం బెట్టిన వాడు తాటాంకము వెంకటదాసు. ఇంకా మారుమూల ప్రాంతాలలో తెలుగు

దేశమంతటా గ్రామగ్రామమున భజన మందిరాలు, రామమందిరాలులో గానం చేయు భక్తమండలిలు ఇప్పటికీ ఉన్నాయి.

స్థానిక భక్తులు రచించిన గేయములు, సంచార పుస్తకాలు అమ్మే చిన్నపుస్తకాలలోని కీర్తనలు, పాటలు, రాత్రి 7,8 గంటలు కాగానే పసుల కాపరులు, పనిపాటలు ముగించుకొని వచ్చిన ముసలివారు రామ, కృష్ణ అని గేయాలు వల్లి వేస్తూంటారు. అలాగే చిరుతలు, కోలాటం పాటలలో భజన పాటలు ఎక్కువే. కరిమేల హనుమయ్యారామనామము, కంపెనీ వారి భగవన్నామ సంకీర్తనలు, కోల్లా మల్లయ్య రామభజనామృత కీర్తనలు, కాంతం కొండలరావు భజన కీర్తనలు ఇలా 20 మందికి పైగా రచయితల భజన కీర్తనలు ఉన్నాయి.

నేదునూరి గంగాధరమ్ గారు సేకరించిన సెలయేరులో కొన్ని గలవు. అచ్చుకానివి ఎన్నో..... ఆంధ్ర దేశమున పోతరాజు, గోపరాజు, త్యాగరాజు మహాభక్తులు. పోతన్న భక్తి భాగవత కల్పతరువుగా నావతరించింది. త్యాగరాయాల భక్తి కర్ణాటక సంగీతానికి నాంది పలికితే శ్రీరామచంద్రునకు ఆంధ్రత్వం కల్పించిన వాడూ కంచెర్ల గోపన్న, హరిదాసుల చేతను దాసరూల చేతను, భక్తుల చేతను రామదాసు పేరుతో బహుళ ప్రచారం పొందిన కీర్తనలలో రెండు కీర్తనలు.

'తారకమంత్రము కోరిన దొరికెను ధన్యుడనైతిని ఓరన్నా'
మీరిన కాలుని దూతల పాలిట మృత్యువయని నమ్మిక యున్నా....
అని పాడినా

శ్రీరామ నామం మరువాం, మరువాం
సిద్ధము యమునికి వెరువాం, వెరువాం
అని ఆబాలగోపాలం పాడుకొనినా

ఏతీరుగానను దయ జూసితవో యిన వంశోత్తమరామా
నా తరమా భవ సాగర మీదను నళినదలేక్షణ రామా....
అన్నా....

శ్రీ రామ నీ నామమేమి రుచిరా... ఓ రామ నీ నామమెంత రుచిరా.... అన్న గోపన్నకే చెందింది. తెలుగు నేలంతా విస్తరించింది. 'అదిగో గౌతమి, అదిగో భద్రాది' అని పాడుకొనే భజన కీర్తనలు ఉన్నాయి.

పల్లెప్రజలు కోలాటం పాటలు పాడుకునేటప్పుడు గణపతి ప్రార్థన 'శివమూర్తివి గణనాథా, నీవు శివుని కుమారునివి గణనాథతో మొదలుపెడతారు.

అలాగే మంగళహారతులలో 'నీనామ రూపములకు నిత్య జయమంగళము, రామచంద్రయ్య జనకరాజు మనోహరయా'.....మహితమంగళంతో ముగుస్తుంది.

ఇక శ్రీకృష్ణుని గూర్చి కూడా జానపదులలో భజన కీర్తనలు ఎన్నో ఉన్నాయి. తెల్లవారవచ్చె తెలియక నా సామి మళ్ళీ పరుండేవులేరా! అనే మేల్కొలుపు పాటలతో పాటు శ్రీ కృష్ణుని చిలిపి చేష్టలు గూర్చి, శ్రీ కృష్ణుని మహిమల గూర్చి ఎన్నో పాటలున్నాయి.

ఏదిరా నీ మురళీ.... ఊదరా ఒకసారి....

మన్నేల తిన్నావు, నా చిన్ని కృష్ణయ్య

వంటి పాటలతో పాటు జయ కృష్ణముకుంద మురారి.....వంటి పాటలు జగత్ప్రసిద్ధింగాంచినవి.

ఇక శతక పద్యాలలో రామ రామ శతకము మొదలు కృష్ణ శతకము నారాయణ శతకం, శ్రీ కాళహస్తీశ్వర శతకం, నీతి శతకము, వేమన శతకము, నృశింహ శతకం, గోగులపాటి కూర్మనాథ కవి రచించిన సింహాద్రి నారసింహ శతకం..... ఇలా ఎన్నో శతకాల తెలుగు సాహిత్యాన్ని పరిపుష్ట చేయటంతో పాటు ప్రజలకు స్వాంతన చేకూర్చాయి.

వీటితో పాటు వేదాంతపరమైన పాటలు ఉన్నాయి. వీరబ్రహ్మం గారి తత్త్వాలు, ఆత్మబోధనామృతం, తారకామృత సారం వంటి పాటలున్నాయి.

వీరబ్రహ్మంగారి తత్త్వంలో;-

చెప్పలేదనుటను పొయ్యేరు

నరులార / గురుని చేరి మ్రొక్కితే బ్రతుకునేర్చెరు....

అలాగే కులంగూర్చి.....

ఏ కులమని నన్ను వివరమడిగితి

యేమని దెల్పుదు లోకులకు

పలుగాకులకు దుర్మార్గులకు....

అలాగే పల్లెలో 'విన్నారయ మీరు కన్నరయ్యా

వీరబ్రహ్మం గారి వాక్యాలయ

అంటూ పాడుకొనే తత్త్వాలు ఉన్నాయి.

జీవులెనుబది నాల్గులక్షలు చావుపుట్టుకలిక్కడ ఎవరు చేసిన

పాపకర్మములనుభవించేరక్కడా అంటూ అర్థమిచ్చే తత్త్వం. అలాగే/

మానవబండి మహిమకనరండి
ఓ జ్ఞానులారా నరబండి నడక చూడండి
తల్లిదండ్రుల మదముచేతనుతయారైనదీ మేలుబండి
మానవబండి మహిమచూడండి

అంటూ అశాశ్వతమైన మానవ జీవితం గూర్చి పాడుతారు.

గంగాధరం గారు సేకరించిన గేయాలలో....

మోచేటి పెద్దమ్మ నోచేటివేళ
మొగ్గళ్ళ తామరలు పూచేటివేళ
బీరాలు పువ్వులు తెచ్చేటివేళ

గుజ్జుల నారాయణ దాసుగారి తారకామృత సారంలో

కాశీయాత్రకు బోవనేలండి
సూత్రదారుని గానలేక క్షేత్రములకు బోదురేమన్న.....

అలాగే.,.... ఏమిసేతురలింగ, ఏమిసేతురలింగ

గంగ ఉదకం తెచ్చి నీకు, లింగపూజ చేతుమంటే,
గంగనున్నా చేపకప్పలు, ఎంగిలంటు న్నాయి లింగా...
అలగే యావు పాలుదెచ్చి అర్పితం చేత మంటె
అక్షయావుల మంటె లేగదూడల లెంగి లంటున్నాయి లింగ

అని పాడుతూ ఉంటారు.

ఇంకా స్త్రీలు పాడుకొనే కామేశ్వరి వ్రతం పాటలు, ఉత్తరాంధ్రలో గంగావివాహము, హరిహరి నారాయిణాది నారాయిణ లాంటి పాటలు పాడుతూ తన్మయత్వం పొందుతారు.

ఆత్మబోధనామృతం నుండి పాడే

మరో కీర్తన ;-

చచ్చేటందుకు పుట్టియున్నావు
సందులు దూరకురోరన్నా
ఎన్నాళ్ళుండిన యముడు విడువడు ఎందుకు జడిసేవు రోరన్న.....

గ్రామాలలోను, గల భజన మందిరాలు, రామమందిరాలులో రాముని గూర్చి, శివుని గూర్చి, వెంకటేశ్వరుని పాడుకోని పాటలెన్నో. వీటిని కొన్ని ప్రాంతాలలో బైటో భజన్ బృందాలు అంటారు. కొన్ని గ్రామాలలో మహిళ బృందాలు కూడా ఉన్నాయి.

మానవ ఏమున్నదీ దేహం
ఇది రక్త మాంసంల అస్తి పంజరం
మన్నురా, మాయరా ఈ జీవితం (మానవ ఏమున్నదీ)
రామున్నీ నమ్మినానురో, రవికుల సోమ నిన్నే నమ్మినానురా (రామ)

విఠల్, విఠల్.... పాండురంగ విఠల పండరి నాథ విఠల..... హరే రామ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే.... అని పాడుకుంటూ రాత్రంతా శ్రీరామనవమి, ఏకాదశి, శివరాత్రి వంటి రోజులలో ఉపవాసాలు చేస్తూ రాత్రంతా భజనపాటలు పాడుతుంటారు. ఇందులో సామాన్య ప్రజలు, కవులు రచించిన పాటలే ఎక్కువ. అందులో రాముని గూర్చి పాటలే ఎక్కువ.

పల్లెల్లో రామ కీర్తనలు ఎన్నో పామరులు పాడుకుంటారు.
అందులో....
భక్తులారా రండి
రామ భక్తులారా రండి
భజన చేయరండి
పల్లీగవించకండి....      అంటూ ఒకరు పాడితే.....
రామ నిన్నే నమ్మినానురా
సీతారామ నిన్నే నమ్మినానురా
కోదండ రామా నిన్నే నమ్మినానురా
అంటూ ఒకరు.... మరొకరు
ఏమని దెల్పెదు రామకథ
ఎందరో విని తరించు కథ
దానవులను హతమార్చగను
ధర్మంబు కాపాడగను
దానవుడై దశరథ గృహంబున
అభిమానంబున హరిపుట్టె సుమా.....



అని మరికొందరు పాడుతారు. ఇలా ప్రాంతాల బట్టి మరెన్నో స్థానిక గాయకులు, రచనలతో రామాయణ భజన పాటలతో పాటు మరెన్నో భక్తి గీతాలు తెలుగు భాషను సుసంపన్నం చేశాయి. ఆంధ్రదేశమున ఎడ్ల రామదాసు కీర్తనలు కూడా ప్రసిద్ధి గాంచాయి.

## స్త్రీల పాటలు :

జానపద సాహిత్యం సృష్టికర్తలు స్త్రీలు. పిల్లలను నిద్రపుచ్చడానికి పాడే లాలీ, జోలపాటలతో పాటు చావు, పుట్టుక, పెళ్ళి, పేరంటాలు, వేడుకలు, వినోదాలు, పిల్లలను ఊయలలో వేయుట, పిల్లలను బుజ్జగించడం, కాయకష్టం చేసినపుడు, పొలాల్లో వరినాట్లు వేసేటప్పుడు పాడే నాట్లు (ఉడుపుల) పాటలు, కలుపుతీత పాటలు, కోతల పాటలతో పాటు దంపుడు (రోకటి) పాటలు, తిరగలి (విసుర్రాయి) పాటలు, బతుకమ్మ పాటలు, గైరమ్మ పాటలు, రజస్వల పాటలు, పెళ్ళిపాటలు, గొబ్బెమ్మ పాటలు, మంగళి హారతులు, కోలాటం వేసేటప్పుడు పాడే భారత రామాయణం పాటలు మొదలగునవి. పెళ్ళి పాటలలో ప్రధానమైనవి కొట్నాలు పాటలు, ఒడిబాలు (అప్పగింతలు పాటలు), తలుపు దగ్గర పాడే సంవాద పాటలు, శోభనం పాటలు, గర్భధారణ పాటలు, హారతి పాటలు మొదలగునవి... పిల్లలను బుజ్జగించడానికి చందమామ రావే..... జాబిల్లిరావే.... అనే పాట ఎంతో ప్రసిద్ధి గాంచింది.

నేదునూరి గంగాధరం గారి సంకలనాలలో స్త్రీ సారస్వతానికి సంబంధించి అనేక జానపద గేయాలున్నాయి. మచ్చుకు దంపుళ్ళపాటలో

ఆడదానిని నేను అయిపుడితిగాని
గండ్రగొడ్డలి క్రింద కమ్మనయినా చాలు
గొడ్రాలి బ్రతుకేల, కోటి ధనమేల
స్వారాజ్యమిచ్చినా సవతిపోరేల

ఇక్కడ ఆడదై పుట్టటం కంటే అడవిలో మానై పుట్టటం మేలు అనే సామెతకు గుర్తు ఈ పాట.

అలాగే వ్యవసాయి సంబంధ గేయాల్లో
నోమినోమిన్నలారా నోమిన్నలారా
కలలో కొచ్చిన రాజు మరికానరాడె (నో)
మరో పాటలో

దచ్చిదచ్చిణాది తుమ్మీదో
ఓయి నోమిన్నల్ల తుమ్మీదో
దచ్చుడు భార్య తుమ్మీదో
లచ్చిమ్మ శివదేవి తుమ్మీదో
లచ్చమ్మ కన్నది తుమ్మీదో
నూటొక్క కూతుళ్ళను తుమ్మీదో

అంటూ దక్షయజ్ఞంలో పార్వతీదేవి గూర్చిపాడతారు. పెళ్ళిపాటలో ఒడిబాలు లేదా అప్పగింతల పాటలు చాల కరుణరసంతో కూడుకున్నవి...... కొట్నాలు దంచేటప్పుడు

సువ్వి రామచంద్ర సువ్వి
సువ్వి రామాభిరామ సువ్వనాలు
అందమైన పల్లెమున
గాంధమక్షింతాలు పోసి
పేరుపేరున పిలువరమ్మ పేరంటాలను (సువ్వి)
ఒడిబాలు (అప్పగింతలు పాటమ్)

ఆడపిల్లను అత్తవారింటికి పంపించేటప్పుడు పెళ్ళికూతురు ఒడిలో బియ్యం, కొబ్బరి, అరటిపళ్ళు వేసి, మొదటిసారిగా ఇల్లు వదిలివెళ్తున్న కన్నకూతురిని ఉద్దేశించి, వియ్యంకులను అల్లునికి కూతురిని అప్పగించినపుడు....

కడుమంచి కౌసల్య..... గర్భమందు.....
రాముడై జన్మించె...... రఘువంశంను
కాలకాలంనందు కాలంబునారా
జన్మించె సీతమ్మ జానకిముని ఇంట
జన్మించే సీతమ్మ జనకముని ఇంట
అమరంగ అయొజ్జు పట్టణమందు
అతివ సీతకు పెండ్లి .... ఆడే శ్రీరామ....

************

అవి పప్పు బియ్యము....బెల్లపచ్చులు
సీత ఒడిలో పోసే శ్రీలక్ష్మి తల్లి

ముమ్మారు ముద్దాడి ముందు దీవించి
నీవు పుట్టిన మొదలు - నేటివరకైనా
చుట్టమిల్లే తల్లి..... చూడలేదమ్మా
ఈనాడు మము విడిచి వెళ్ళుతున్నావు
మరతునేలాగా.... మా తల్లి సీత

వియ్యంకులను అల్లునకు ఆడపిల్లను అప్పగించినపుడు తల్లి గుండె బరువెక్కిన భారాన్ని ఈ పాటలో చూడవచ్చు.

కౌసల్య చేతిలో సీత చేయివేసి
ఇన్నాళ్ళు మా పట్టె - ఇపుడు మీపట్టె
.....................
తప్పులొచ్చిన యెడల తగుదిద్దుకొనుము
శ్రీరాముని చేతిలో సీత చేయివేసి
దర్మంబు తప్పక దయనేలు కొమ్ము.....
అంటూ కుమార్తెకు కూడా జాగ్రత్తలు చెప్పే పాటలున్నాయి.

## అన్నయ్య – చెల్లెలు – సంవాదపాటలు :

అన్నయ్య కొత్తగా పెళ్ళిచేసుకొని వదినెను తీసుక వస్తాడు. చెల్లెమ్మ ముందుగానే తలుపు వేస్తుంది. పుట్టబోయె కుమార్తెను తన కుమారునికిస్తానని అనిన వెంటనే తలుపు తీస్తుంది.

దానికి సంబంధించిన పాట :-
ముత్యాలు వాకిటిలోను వజ్రాలు వానగురిసె
వనితా మీ వదినె తడిసె తలుపుదీయమ్మ
ముత్యాల వాకిట్లో వజ్రాల వాన గురిస్తే
తడిసెతె తడిసెగాని తలుపెట్లు
తీతునన్నయ్య తగవులున్నాయి

................................

అవి వద్దు ఇవి వద్దు
అతికీ చక్కాన బొమ్మ అందరికీ ముచ్చట సుమ్మా....
అన్నా నీ కూతురు నిచ్చి అరుణమియ్యరా....

అని పాడుతూ తలుపు వేస్తుంది.

వేడుకలు, వ్రతాలు, గౌరీ నోములు, బతుకమ్మ పాటలు.

***********

స్త్రీల వ్రతాలు చేసుకునేటప్పుడు ఎన్నో పాటలు పాడుకుంటారు. అలాగే గౌరీదేవి నోములోను, బతుకమ్మ పండుగలో అనేకపాటలు పాడుకుంటారు.

శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోసునమ్మా గౌరమ్మా
పాలించి ఏలుకొమ్మా
నిరతముగా బంగారు ముద్దుగుమ్మా
అని పాడుకోగా
బతుకమ్మ బతుకమ్మ ఉయ్యాల్లో
బంగారు గౌరమ్మ ఉయ్యాల్లో
కలవారి కోడలు ఉయ్యాల్లో
కలికి మాలక్ష్మి ఉయ్యాల్లో
కడుగుచున్నది పప్పు ఉయ్యాల్లో
అప్పుడే వచ్చెను ఉయ్యాల్లో
ఆమె పెద్దన్నయ్య ఉయ్యాల్లో
కాళ్ళకు నీలిచ్చి ఉయ్యాల్లో
కన్నీళ్ళు దింపింది ఉయ్యాల్లో
.......ఇలా ఎన్నో పాటలున్నాయి.
ఎంత చక్కని తల్లివే గౌరమ్మ
ఎంత చల్లని తల్లివే గౌరమ్మ
ఒక్కొక్క పోకందున గౌరమ్మ
ఒక్కొక్క ఆకందునా గౌరమ్మ
కస్తూరి చలమందునా గౌరమ్మ
రాచబాటలందునా గౌరమ్మ
నినుచూసి మాయన్నలు గౌరమ్మ
ఏడు మేడలెక్కిరి గౌరమ్మ
ఏడు మేడల మీదికి గౌరమ్మ

ఏడాదికొక దీపము గౌరమ్మ

అంటూ ఉత్తరాంధ్రలోను, తెలంగాణలోను స్త్రీల పాటలు పాడుకుంటారో, శ్రావణ శుక్రవారం స్త్రీలు ఏ పూజ చేసినా, వ్రతాలు చేసినా మంగలి హారతుల పాటతో ముగిస్తారు.

ఇంకా జో అచ్యుతానంద.... జోజోముకుంద.... లాలి పరమానంద.... రామగోవిందా.... జో.... అనే పాటలు, తెల్లవార వచ్చె తెలియకనా స్వామి... మళ్ళీపరుండేవులేరా... మారాము చాలింక లేరా....

స్త్రీల రామాయణం, సంక్రాంతిలో గొబ్బెమ్మ పాటలు, సరసమైన పాటలు, హాస్యపు పాటలు, కరుణరస గేయాలు ఇలా ఎన్నో పాటలున్నాయి. స్త్రీల జానపద రామాయణంలో రామ లక్ష్మణుల జననం, సీతా వనవాసం, లవకుశ మొదలగు ఘట్టాలు పాడుతారు.

శ్రీరామ రామయ్య
అయివోద్య రామయ్య
వీధిలో రామయ్య
యిలపరస రామయ్య

...........................

రచ్చలో రాముడు హరివిల్లు విరిసె
దండేసి రచ్చలో సీతమ్మ రామున్ని కలిసింది అని పాడుతారు.

ఇంకా వ్రతాలు పాటలులో కామేశ్వరి పాట, గౌరిదేవి పాటలు, మంగల హారతులు... హాస్యపు పాటలు, వదినె మరదలు సరసాలు, కరుణరస గేయాలు ఇలా ఎన్నో పాటలు గలవు. ఇందులో కొన్ని గ్రంథస్తం కాబడినవి. మరికొన్ని కాలగర్భంలో కలిసిపోయినవి. పరిశోధనలు చేసి మరి కొంతమంది గ్రంథస్తం చేశారు.

## ఆధార గ్రంథములు :


1. తెలుగు జానపదగేయ సాహిత్యము - బి. రామరాజు
2. జానపద వ్యాసాలు - నేదునూరి గంగాధరం
3. కళింగాంధ్ర జానపద గేయాలు - బద్రి కూర్మారావు (2015)
4. స్త్రీల గేయాలలో సంప్రదాయము - డా. చింతపల్లి వసుంధరా రెడ్డి
5. అదిలాబాదు జిలా జానపద గేయాలు మాదాడి నారాయణరెడ్డి

# తెలుగు జానపద కథాగేయాలు



ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు
✆ 99454 22742

'జనపదం' అంటే 'పల్లెటూరు'. జానపదంలో ఉండేవారు 'జానపదులు'. ఈ జానపదులకు సంబంధించిన సమస్త విషయాల సమూహమూ కలిసి 'జానపద విజ్ఞానం' (Folklore) అవుతుంది. అంటే వ్రాతకోతలు లేకుండా, నోటి మాటలుగా కాని, అనుకరణంవల్ల కాని, ఒక తరాన్నుండి మరొక తరానికి వ్యాపించే సమస్త విజ్ఞానమూ జానపద విజ్ఞానమే! దీనినే 'జానపద జీవితం' (Folklife) అనీ, 'జానపద సంస్కృతి' (Folk culture) అని కూడా పిలుస్తారు.

జానపద విజ్ఞానం (Folklore) లో 'జానపద సాహిత్యం (Folk Literature) ఒక భాగం. జానపద సాహిత్యంలో 'జానపద కవిత్వం' (Folk Poetry) ఒక భాగం; జానపద కవిత్వంలో "జానపద కథాగేయాలు" (Namative Folk Songs) ఒక భాగం.

జానపద విజ్ఞానంలో ఐదు ప్రధాన శాఖలున్నాయి. (1) "జానపద సాహిత్యం (Folk Literature) (2) జానపద భాష (Folk Language) (3) సాంఘిక జానపద



ఆచారాలు (Social Folk Customs) (4) భౌతిక సంస్కృతి లేక వస్తు సంస్కృతి (Material Culture) లేక జానపద ఉపకరణములు (Folk Accessories) (5) 'ప్రాయోగిక జానపద కళలు లేక ప్రదర్శనాత్మక జానపద కళలు (Perfoming Folk Arts). Richard M. Dorson అనే అమెరికన్ జానపద విజ్ఞానవేత్త జానపద సాహిత్యం +జానపద భాష - ఈ రెండింటినీ కలిపి "శాబ్దిక కళలు" (Verbal Arts) అన్నాడు.

జానపద విజ్ఞానంలో మొదటి విభాగమైన జానపద సాహిత్యంలో రెండు ఉపశాఖలున్నాయి. 'గద్యాఖ్యానాలు (Pose Narratives) - జానపదకవిత్వం (Folk Poetry). గద్యాఖ్యానాలలో తిరిగి మూడు అంతర్గత శాఖలున్నాయి. (1) పురాగాథలు లేక పుక్కిటి పురాణాలు (Myths) - ఐతిహ్యాలు (Legends) - జానపద కథలు (Folktales). రెండవ ఉపశాఖయైన జానపద కవిత్వంలో రెండు అంతర్భాగాలున్నాయి. (1) భావాత్మక జానపద గేయాలు (Lyrical Folk Songs) (2) కథాత్మక జానపద గేయాలు (Namative Folk Songs). వీటిని 'జానపద గేయకథలు" అనీ "జానపద కథాగేయాలు'' అని కూడా పిలువవచ్చును. వీటినే "జానపద గేయ కథలు" అన్నారు ఆచార్య నాయని కృష్ణకుమారి గారు.

"జానపద భాష" (Folk Language) అంటే సామెతలు (Proverbs), పొడుపు కథలు (Riddles) జాతీయాలు (నుడికారాలు లేక పలుకుబళ్ళు (Idioms), తిట్లు - ఒట్లు, మాండలిక పదాలు, వృత్తిపదాలు మొదలైనవి. వీటిలోని సామెతలు, పొడుపుకథలు, తీసికొని వెళ్ళి జానపద సాహిత్యంతో కలిపి చర్చిస్తూ ఉంటారు పరిశోధకులు. వీటిలో హృదయాన్ని ఆకర్షించే కవితా లక్షణం కొంత ఉండటమే దీనికి కారణం కావచ్చును. అప్పుడు "జానపద సాహిత్యం"లో పురాగాథలు, ఐతిహ్యములు, జానపద కథలు, (భావాత్మకములైన) జానపద గేయాలు, (కథాత్మకములైన) జానపద కథాగేయాలు, సామెతలు, పొడుపు కథలు, అనే ఏడు శాఖలు ఉంటాయని మనం అర్థం చేసుకోవాలి.

భావాత్మకములైన జానపద గేయాలు ఎనిమిది రకాలుగా ఉంటాయి. (1) పనిపాటలు (2) పారమార్థిక గేయాలు (తత్త్వాలు) (3) బాంధవ్య గీతాలు (స్త్రీల పాటలు) (4) పిల్లల పాటలు (5) వేడుక పాటలు లేక పెండ్లి పాటలు (స్త్రీల పాటలు) (6) వలపు పాటలు (7) హాస్యగీతాలు (8) కన్నీటి పాటలు.

కథాత్మకములైన జానపద గేయాలు లేక జానపద కథాగేయాలు రెండు రకాలుగా ఉంటాయి. (1) స్త్రీల కథల పాటలు (లేక స్త్రీల కథాగేయాలు) (2) వృత్తిగాయకుల గేయకథలు (లేక కథాగేయాలు). ఈ రెండింటికి స్పష్టమైన భేదాలున్నాయి.

### (1). స్త్రీల కథల పాటలు లేక స్త్రీల కథాగేయాలు :

ఇండ్లలో ముత్తైదువులు పాడుతారు. వీటికి వాద్యసహాయం ఉండదు. స్త్రీలు తమ సహజసిద్ధమైన మంచి గొంతుతో పాడుతారు. వీటిలో రాగతాళాలు స్పష్టంగా తెలుస్తూ ఉంటాయి. ఇతివృత్తాలు రామాయణ, భారత, భాగవత సంబంధములై

ఉంటాయి. వీటిని 'గృహ సంబంధములైన జానపద కథాగేయాలు" (Domastic Namative Folk Songs) అని పిలువవచ్చును. కథతో కూడిన జానపద గేయమే Ballad కాబట్టి వీటిని Domastic Ballads అని కూడా అనవచ్చును.

## (2). వృత్తిగాయకుల గేయకథలు లేక కథాగేయాలు :

వీటిని వీథులలో వృత్తిగాయకులు వివిధ వాద్య సహాయంతో జనసముదాయాల ముందు గొంతెత్తి పాడుతారు. జముకులవారు, పంబలవారు, వీరవిద్యావంతులు, గొల్లసుద్దులవారు, కొమ్ములవారు, జంగములు, శారదకాండ్రు, దాసరులు, బీరన్నలవారు, పాండవులవారు, ఒగ్గులవారు మొదలైన వృత్తిగాయకులు గానం చేస్తారు. జముకులు, పంబజోడు, వీరణములు, కొమ్ములు, తంబుర, గుమ్మెటలు, తిత్తి, తాళాలు, మొదలైన వాద్యాలు ఉపయోగిస్తారు. ఈ కథాగేయాల ఇతివృత్తాలలో చారిత్రకములు, సాంఘికములు, జానపదములు, పౌరాణికములు, మతసంబంధములు మొదలైన వాటిని గుర్తింపవచ్చును. ఈ వృత్తిగాయకులు వీథులలో వాద్యసహితంగా పాడే జానపద కథాగేయాలకే నేను 'వీరగాథలు' (Heroic Ballads)గా నామకరణం చేసి, వీటిని గురించి కూలంకషంగా పరిశోధన చేశాను (చూ.నా" తెలుగు వీరగాథా కవిత్వము"- 2013)

## 1. స్త్రీల కథా గేయాలు :

వీటిని నాలుగు వర్గాలుగా విడదీయవచ్చును. (i) రామాయణ సంబంధములు - (ii) భారత సంబంధములు- (iii) భాగవత సంబంధములు- (iv) ఇతరములు. వీటిలో స్త్రీలు ఎన్నో అద్భుతమైన కల్పనలు చేశారు.

## 1.1 రామాయణ సంబంధమైన స్త్రీల కథా గేయాలు :

ఇవి చాలా ఎక్కువగా ఉన్నాయి. ఉదా. "ఊర్మిళాదేవి నిద్ర - లక్ష్మణదేవర నవ్వు - కుశలవ కుచ్చుల చరిత్ర - సీతగడియ - సీతాదేవి ఆనవాలు - లక్ష్మణ మూర్ఛ - గుహభరతుల అగ్నిప్రవేశము - లంకాయాగము - కౌసల్య వేవిళ్ళు - సీతసమర్త - శాంత గోవింద నామాలు - శ్రీరాములవారి ఉగ్గుపాట - శ్రీరామ పట్టాభిషేకం" మొదలైనవి ఎన్నో ఉన్నాయి. ఈ వర్గంలోని అత్యద్భుత కల్పనలకు ఉత్తమోత్తమ ఉదాహరణలుగా "ఊర్మిళాదేవి నిద్ర" - "లక్ష్మణదేవర నవ్వు" అనే రెండు కథా గేయాలను చెప్పవచ్చును. ఇవి నా చిన్నతనంలో ఆంధ్రదేశమంతటా ఇంటింటా పాడబడుతూ ఉండేవి. ఈ పాటలను గురించి ఆచార్య బి. రామరాజుగారు తమ "తెలుఁగు జానపద గేయసాహిత్యము" అనే గ్రంథంలో చాలా వివరంగా ఇచ్చారు. (చూ. పుటలు ౧౦౩ - ౧౧౩).

### 1.1.1 ఊర్మిళాదేవి నిద్ర :



రామాయణంలోని పాత్రలన్నింటిలోను ఊర్మిళాదేవి - లక్ష్మణుడు ఎక్కువ త్యాగమూర్తులుగా కనబడుతారు. ఊర్మిళ తన భర్త తనతో రావద్దని ఆజ్ఞాపిస్తే మానివేసింది. పద్నాలుగు సంవత్సరాలు తన శయ్యా గృహంలో నిద్రపోయిందని జానపదుల కల్పన. (సీతాదేవి భర్తమాట వినకుండా కూడా వెళ్ళి కష్టాలు కొనితెచ్చుకొన్నది!)

రావణ సంహారం చేసి రాముడు అయోధ్యకు వచ్చాడు. పట్టభిషిక్తుడై కొలువుతీరి ఉన్నాడు. అన్నగారి సేవలో మునిగిపోయిన్ లక్ష్మణునికి పద్నాలుగు ఏండ్ల ఎడబాటుతో నున్న తన భార్య ఊర్మిళను చూడాలనే జ్ఞానం కూడా కలుగలేదు. ఈ విషయం సీత రామునితో చెప్పింది. అన్న అనుమతించగా లక్ష్మణుడు ఊర్మిళా దేవి శయ్యాగృహానికి వెళ్ళాడు. ఆమె పాన్పుపై కూర్చున్నాడు. నిద్రిస్తున్న ఆమెను లేపి తానెవరో ఎరుకపరుచుకొనలేదు. ఉన్నట్టుండి ఒక్కసారిగా "కొమ్మ! నీ ముద్దుముఖమూ సేవింపగోరినాడే చంద్రుడూ" అంటూ తన విరహాన్ని వెళ్ళబోయడం ప్రారంభించాడు. పద్నాలుగు సంవత్సరాలనుండి మూసిన కన్ను తెరవకుండా పడివున్న ఊర్మిళకు ఎవరో పరపురుషుడు తన అంతఃపురంలో ప్రవేశించాడనే భ్రాంతి కలిగి, అతనిని ఇలా మందలించింది.

"అయ్య! మీరెవ్వరయ్యా? మీరింత ఆగడమ్మున కొస్తిరీ
సందుగొందులు వెదకుచూ మీరింత తప్పుశాయగ వస్తిరీ
యెవ్వరూ లేనివేళా మీరిపుడు యేకాంతమున కొస్తిరీ
మా తండ్రి జనకరాజు వింటె మిము ఆజ్ఞ సేయక మానరూ
మా యక్కబావ విన్నా మీకిపుడు ప్రాణముకు హానివచ్చూ
మాయక్క మరిది విన్నా మిమ్మిపుడు బ్రతుకనివ్వరు జగతిలో"

(భార్య, భర్తపేరు ఉచ్ఛరించరాదు కాబట్టి "మా యక్క మరది" అని భంగ్యంతరంగా చెప్పింది)

లక్ష్మణునికి ఏమి చేయాలో తోచలేదు. ఉక్రోషంతో ఒరనుండి కత్తిదూసి, తన్ను తాను పొడుచుకోబోయాడు. ఊర్మిళ భయపడి భర్త పాదాలపై వాలిపోయింది. తల్లులైన కౌసల్య సుమిత్రలు వచ్చి వారిని ఓదార్చి, తలంట్లు పోసి, భోజనాలు

పెట్టి, శయ్యాగృహాన్ని చక్కగా అలంకరించి ఆ సతీపతులను లోనికి పంపించారు. లక్ష్మణుడు ఊర్మిళను స్వయంగా అలంకరించాడట:

"కీలుకొప్పమర విడిచి లక్ష్మణుడు నేర్పుతో జడలల్లెనూ
బొండుమల్లెలు జాజులూ జడపయిని శృంగారముగ జుట్టెనూ
తాంబూలములు వేయుచూ దంపతులు కలసి ముచ్చటలాడిరీ"

శృంగార రస తరంగిణిలో ఓలలాడవలసిన ఆ ఏకాంత సమయంలో ఊర్మిళ మనస్సు అక్కగారి విషాధ గాథవైపు మరలింది. ఆమె సోదరీప్రేమకు ఇది గొప్ప తార్కాణం :

"సింహవిక్రములు మీరు ఉండగా సీతెట్లు చెరబోయెనూ
రాజ్యాధిపతులు మీరు ఉండగా రమణెట్లు చెరబోయెనూ"

అని అడిగింది. లక్ష్మణుడు సీతాపహరణగాథ అంతా వినిపించాడు. "ఆ కథ విని దుఃఖించినది ఊర్మిళయే కాదు, తెలుగుస్త్రీలందరును. ఊర్మిళ, సీత కష్టములను చెల్లెండ్రకు వినిపించినది. వారడవులబడిన కష్టముల కేడ్చి, తిరిగి సుఖముగ వచ్చినందుల కుప్పొంగినది. ఇది సుఖదుఃఖముల మధుర సన్నివేశము. రసికజనైకవేద్యము. తెలుగువారి ప్రత్యేకత" (ఆచార్య బి. రామరాజుగారు)

ఈ ఊర్మిళాదేవి నిద్ర పాటను దేవేంద్ర సత్యార్థి అనే ఉత్తరాది పండితుడు సేకరించి ఉత్తర హిందుస్థానమంతటా ప్రచారం చేశాడు. ఇది తెలుగులో తప్ప ఇతర భారతీయ భాషలలో ఎక్కడా లేదు.

### 1.1.2.లక్ష్మణదేవర నవ్వు :

రావణవధానంతర రాముడు అయోధ్యకు వచ్చాడు. సకలదేవతా సమక్షంలో శ్రీరామ పట్టాభిషేకం జరిగింది. ఆ నిండు కొలువులో ఉన్నట్టుండి లక్ష్మణుడు కలకలా నవ్వాడు.

"కలకల నవ్వే - లక్ష్మణ దేవరపుడూ - కలతలు పుట్టెను కపులందరికినీ
కిలకిల నవ్వే లక్ష్మణదేవరపుడూ - కిలకిల నవ్వగా ఖిన్నుడయెరాజూ"

లక్ష్మణుడు అకారణంగా నవ్వినందులకు సభలోని వారందరూ గుమ్మడికాయల దొంగల్లా భుజాలు తడుముకున్నారు. జాలరి పడుచును నెత్తినెక్కించుకున్నందుకు నవ్వాడని శివుడు అనుకొన్నాడు. అన్నగారిని చంపించి తాను రాజైనందుకు నవ్వాడని సుగ్రీవుడు విభీషణుడు అనుకొన్నారు. ఆడరాని

మాటలాడిన ఆడువారిని నమ్మరాదని నవ్వాడని సీతాదేవి సిగ్గుపడిందట. ఏడాదిపాటు రావణుని చెరలో నున్న భార్యను తొడపై కూర్చుండబెట్టుకొన్నందుకు నవ్వాడని శ్రీరామచంద్రుడు అనుకొన్నాడట! నిండుసభలోని వారిని ఈ విధంగా అవమానపరచినందుకు రామునికి కోపం మిన్నుముట్టింది. ఒరలోనున్న కత్తిదూసి లక్ష్మణుని తల తెగనరకాలని నిశ్చయించుకొని "ఎందుకు నవ్వావు? కారణం చెప్పు?" అని తమ్ముని ప్రశ్నించాడు. అతడు అన్నగారి పాదములపై వ్రాలి, తాను నవ్విన కారణాన్ని ఈ క్రింది విధంగా చెప్పాడు:-

"అన్నా! మనం అడవులలో ఉండగా నేను నిద్రాహారాలు మాని ధనుర్బాణాలతో అహోరాత్రులు మీకు కాపలా కాస్తూ ఉన్నాను. ఒక రాత్రివేళ



చీమ మొదలు సింహం వరకూ అన్నీ నిద్రలో మునిగి ఉన్నాయి. నేనొక్కడనే మీ సేవకోసం మేల్కొని ఉన్నాను. నన్ను సమీపించడానికి ధైర్యంచాలని నిద్రాదేవి ఏడుస్తూ, గోదావరి ఒడ్డున కూర్చుంది. నేను వెళ్ళి కారణమేమిటని అడిగాను "సృష్టిలోని సమస్త ప్రాణులూ నా ప్రభావానికి లోనై నిద్రిస్తున్నాయి. నువ్వు మాత్రం నిద్రపోవటం లేదు. ఇది సృష్టికి విరుద్ధం. నాకు తలవంపులు" అన్నది. అప్పుడు నేనామెకు సాష్టాంగ నమస్కారం చేసి-

"మా యన్న రఘుపతికి మా వదినకూనూ
ఈ పర్ణశాలకు తాను కావలనెనూ
పోపొమ్మయోధ్యాపురీ నగరునకు వేగా
ధవుని బాసినట్టు సతియుండ తగదూ
రాత్రియును పవలునూ లేవకుండగనూ
తను విడిచి పొందుమీ ధవళాక్షి నిద్రా"

అని బ్రతిమాలాను. ఆమె సరే అని వెళ్ళిపోయింది. మళ్ళీ ఈనాడు నిండు సభలో నన్ను ఆవహించడానికి వచ్చింది. అందుకే నేను నవ్వాను!"

ఇది ఊర్మిళాదేవి నిద్రకూ, లక్ష్మణుని నిద్రరాహిత్యానికి జానపదులు కవ్వించిన అద్భుతమైన కల్పన!

లక్ష్మణుడు చెప్పిన ఈ కారణం వినగానే రాముని గుండెలు జారిపోయాయి. తమ్ముడు చేసిన గొప్పత్యాగము, అతని నిస్వార్థసేవ, నిష్కళంకమైన అతని

సోదరప్రేమ - ఒక ప్రక్క; తన కృతఘ్నత, తొందరపాటు, అతనిని వధించాలనే కోపం - ఇంకొక్క పక్క రాముని నిలువునా దహించి వేశాయి. తానెత్తిన కత్తితో తన తల నరుక్కోబోయాడు. వశిష్ట వామదేవాదులు అడ్డుపడ్డారు. రాముడు చేసిన పాపానికి ప్రాయశ్చిత్తంగా - లక్ష్మణుడు నిద్రిస్తూండగా అతని పాదాలను ఒత్తమని చెప్పారు. ఒకనాటి రాత్రి తమ్ముడు నిద్రపోతూ ఉంటే, అతనికి నిద్రాభంగం కలుగకుండా రాముడు అతని పాదాలు మెత్తగా వత్తుతున్నాడు. అప్పుడు లక్ష్మణుడు -



ఒకమారు ఒత్తితే ఊరుకొని యుండే
రెండవమాటికి కలగంటి ననెనూ
మూడవమాటికి కనువిప్పి చూచీ
కలగాదు నిజమనీ కడుభీతి నొందీ
ధరణీశు తాజూచి ధరణిపై వ్రాలె

"అహల్య పావనమైన అడుగు మీ అడుగూ
బలి శిరస్సున నున్న అడుగు మీయడుగూ
మీ యడుగు లొత్తెదరు సకలదేవతలు

మా యడుగులొత్త శ్రీ జగన్నాథ తగదు" అని వారించి అన్నగారి కాళ్లమీద పడెను. రాముడు తమ్ముని లేవదీసి "చంద్రుడు లేని రాత్రి యెట్టి దటు బోలు తమ్ముడా! నీవు లేని సభ యట్లె బోలు" అని గౌరవించెను.

ఆనాడు శ్రీరామచంద్రుడు మనసులో ఎన్నో మధురభావాలతో, తమ్ములను మరదండ్రను చక్కగా అలంకరింపజేసి, శోభన ముహూర్తములు పెట్టించెను. శత్రుఘ్నుని చాటుగా చేసికొని మదరండ్ర సౌందర్యమును చూచి ఎంతో సంతోషించెను. సీతారాములు, ఇతర దంపతులు, పాలు - పంచదార; పాలు - బెల్లము; జీలకర్ర-బెల్లము కలిసిపోయినట్లుగా కలిసిపోయారట! తెల్లవారుజాము పొద్దెక్కిన తరువాత భేరీలు మ్రోగిస్తేనే కాని ఆ దంపతులు లేవలేదట!

భరతుని పైనుంచి పసుపు డాగూలు
సౌమిత్రి లలాటమున కుంకుమా బొట్టూ
శత్రుఘ్నుని చెక్కిటా కాటుకరేఖా
ఆ కుంకుమా బొట్టు అమరయుండేను

బావగారు ఋష్యశృంగుడు చూచి వెక్కిరిస్తాడేమో అని వారు సిగ్గుపడి

ఆ గుర్తులన్నీ తుడిచి వేసుకున్నారట! ఇక్కడ సంభోగ శృంగారాన్ని స్త్రీలు ఎంత సున్నితంగా వర్ణించారో మనం గమనించవచ్చును.

### 1.1.3 శాంత గోవిందనామాలు :

ఈ స్త్రీల కథాగేయంలో బాలురైన రామలక్ష్మణ భరత శత్రుఘ్నులకు ఋష్యశృంగుని ఆశ్రమంలో అన్నప్రాశన వేడుక జరుగుతుంది. ఆ వేడుకలో ఎదురుగా ఉంచిన కొన్ని వస్తువులను ఆ బాలురు తీసుకుంటారు. ఇక్కడ గొప్ప ధ్వనిని సూచించింది ఈ గేయ రచయిత్రి:-

"బంగారు తబుకులో క్షీరాన్నమూను
దెచ్చి - పసిడి గిన్నెలోనుంచ
ఆయుధంబులు, పండ్లు, ఆభరణంబులు
ఛత్రచామరములు, చక్క యెదుటను వుంచ
పట్టాభిషేక వుంగ్రం - భరతుడు తీసెను
వజ్రాయుధంబును - శత్రుఘ్నుడు పట్టె
చామరంబొక్కటి - లక్ష్మణుడు తాదీసె
రత్నకవచం బొకటి - రామచంద్రుడు దీసె!"

భవిష్యత్తులో భరతుడు రాజ్యాభిషిక్తుడవుతాడని; శత్రుఘ్నుడు అతనికి బాసటగా ఉంటాడని; లక్ష్మణుడు అన్నగారికి సేవలు చేస్తాడని, రాముడు రావణునితో యుద్ధం చేస్తాడని గొప్ప ధ్వని ఈ పాటలో సూచింపబడింది.

### 1.1.4 "శ్రీరామ పట్టాభిషేకం" :

ఈ కథాగేయంలో కూడా మంచి ధ్వని ఉంది. యుద్ధంలో తనకు సహకరించిన వానర వీరులకు, విభీషణునికి మంచి మంచి బహుమతులు ఇస్తున్నాడు శ్రీరామచంద్రుడు. ఆ సమయంలో సుమిత్రాదేవి ఆంజనేయునకు ఒక ప్రత్యేకమైన బహుమతి ఇచ్చిందట!

"సంజీవి పర్వతం బెత్తిన హస్తములా
సుమిత్ర పచ్చలా కడియాలు పెట్టె!"

యుద్ధంలో మూర్ఛపోయిన తన కుమారుడు లక్ష్మణుని బ్రతికించడంకోసం సంజీవి పర్వతాన్ని ఎత్తికొని వచ్చాడు హనుమంతుడు. అతనికి (అతని చేతులకు) కృతజ్ఞతాపూర్వకమైన బహుమతి యిది!

## 1.2. మహాభారత సంబంధమైన స్త్రీల కథాగేయాలు :



ఇవి చాలా తక్కువగా ఉన్నాయి. "సుభద్రా కళ్యాణము - సుభద్రసారె - ధర్మరాజు జూదము - శశిరేఖా పరిణయము - పండుపాట - భగవద్గీత" మొదలైనవి. "ధర్మరాజు జూదము" అనే ప్రసిద్ధమైన పాటలోని ఒక అద్భుతమైన కల్పన తెలియజేస్తాను. ధర్మరాజు ఓడిపోయిన తరువాత, ద్రౌపదీ వస్త్రాపహరణము ప్రయత్నము, శ్రీకృష్ణుని అక్షయ వలువల ప్రదానము అయిన తరువాత, ద్రౌపది తనతో జూదమాడమని దుర్యోధనునికి సవాలు విసురుతుంది. అతడు అంగీకరిస్తాడు. ద్రౌపది "ఈ పాపిష్ఠి వాడి ముఖం నేను చూడను! ఇద్దరికీ మధ్యన తెరకట్టించండి" అంటుంది. అలాగే తెర కట్టిస్తారు. తెరకు ఒకవైపున ఉన్న దుర్యోధనుడు చేతితో పాచికలు వేస్తే, మరొకవైపున నున్న ద్రౌపది తన కాళ్ళతో పాచికలు తోసి, అతనిని ఓడిస్తూ ఉంటుంది. ధర్మరాజు ఓడిపోయిన వస్తువులన్నీ ద్రౌపది గెలుస్తూ ఉంటుంది. ఇంతలో శకుని అడ్డుపడి "స్త్రీలు మాయావులు. వారితో జూదం ఆడవద్దు" అని వారిస్తాడు. ధృతరాష్ట్రుడు కలుగజేసుకొని, రాజరాజును మందలించి, ద్రౌపదిని వరాలు కోరుకోమంటాడు. వారి రాజ్యం వారికి ఇవ్వబోతాడు. కాని ద్రౌపది :-

"ఆడువారు రాజ్యములు ఏలంగ దగున  
పతిగూడి వనములకు పోయెద"ననుచు  
పాంచాలి గోరెనే పతుల నేవురిని  
తప్పక ధృతరాష్ట్రుడు తా ధారబోసె"

మహాభారతంలో ధర్మరాజు రెండవమారు జూదమాడి మరల ఓడిపోయి అరణ్యావాసానికి వెళ్ళినట్లుగా ఉంది. కాని ఈ స్త్రీలపాటలో ధృతరాష్ట్రుడు ద్రౌపదికిచ్చిన రాజ్యాన్ని వదలి, రణమున గెల్చిపొందెదమని పాండవులు వనవాసానికి వెళ్ళిపోతారు. పునర్ద్యూత ప్రసక్తి లేదు. ఈ పాటలో ద్రౌపది పాత్రను స్త్రీలు అత్యద్భుతంగా చిత్రించారు.

### ఈ పాటలోని మరికొన్ని కల్పనలు :

(1) ధర్మరాజు శకునితో కాకుండా దుర్యోధనుని తోనే జూదమాడుతాడు. ధర్మరాజు గెలుస్తూ ఉంటాడు. దుర్యోధనుడు ఓడిపోతూ ఉంటాడు. రారాజు

భయపడి లోపలికి వెళ్ళి జ్యేష్ఠాదేవిని (దరిద్రదేవతను) ప్రార్థిస్తాడు. పూర్వం రాజసూయయాగ సమయంలో భీముడు తనను అవమానించాడనే కోపంతో ఆ జ్యేష్ఠాదేవి తన చెల్లెలు లక్ష్మీదేవి దగ్గరకు వెళ్ళి, ధర్మరాజును విడిచి దుర్యోధనుని చేరుకుని బలవంతం చేస్తుంది. అమె అలా చేయగా ధర్మరాజు ఓడిపోయాడట!

(2) దుర్యోధన దుశ్శాసనుల్ని చంపుతానని భీముడు ప్రతిజ్ఞ చేయడు, వారిని చంపిస్తానని ద్రౌపదియే ప్రతిజ్ఞ చేస్తుంది.

(3) ద్రౌపది సభకు ఈడ్చుకొని రావడానికి దుశ్శాసనుడు వెడతాడు. ఆమె తాను రజస్వలను తనను ముట్టరాదని అంటుంది. దుశ్శాసనుడు ఆమె తలపై నీళ్ళుపోసి, శుద్ధిచేసి ఆమెను జుట్టుపట్టి సభకు ఈడ్చుకొని వచ్చాడట.

## 1.3 భాగవత సంబంధమైన స్త్రీల కథాగేయాలు :

రామాయణ గేయాలలాగే ఇవి కూడా చాలా ఎక్కువగా ఉన్నాయి. భాగవతం భక్తి ప్రధానం కాబట్టి ఈ పాటలు ఎక్కువగా ఉండటం సహజం. “వామన చరిత్రము - గజేంద్ర మోక్షము - శ్రీకృష్ణ జననము - కాళింగ మడుగుపాట - శ్రీకృష్ణుని చల్దులు - గుమ్మడు పాట - గోపికాస్త్రీల జలక్రీడలు - రుక్మిణీ దేవి ముచ్చట - ఉషా స్వప్నము - రుక్మిణీ కళ్యాణము - సత్యభామ సరసము - రుక్మిణీదేవి సీమంతము - కుచేలోపాఖ్యానం మొదలైనవి.

## ‘‘రుక్మిణీదేవి సీమంతం’’ :



ఈ పాటలో శ్రీకృష్ణుని దక్షిణ నాయకత్వం స్త్రీలచే ప్రశంసింపబడింది. కృష్ణుని పట్టమహిషి రుక్మిణి ఆరునెలల గర్భవతి. ఆమెకు సీమంతం చేయాలని దేవకీ వసుదేవులు నిశ్చయించారు. కాని కృష్ణుడు అప్పటికి నాలుగైదు నెలల నుండి రుక్మిణీ భవనానికి రావడం లేదని వసుదేవునికి తెలిసి కోపించాడు. వసుదేవుని కోపాన్ని చూచిన అచ్చటి పరిచారికలు, ఈ విషయాన్ని కృష్ణునికి చెప్పి అతనిని తీసుకొని రావడానికి సత్యభామ భవనానికి వెళ్ళారు. కాని వాళ్ళు సత్యభామకు భయపడి - “స్తంభాల చాటె నిలిచి కనుసంజ్ఞలు చేయుచు” కృష్ణుని పిలిచిరి. కృష్ణుడది కనిపెట్టి, సత్యకు భయపడి -

“భామామణిరో! సత్యభామా మణిరో! వినవే!

మన భక్తుడు అక్రూరుడు మనకు విందు లమరించె
ఆరగించి నే నతిశీఘ్రంబున వత్తూ" అని అబద్ధమాడి వెళ్ళిపోయాడు.

రాకరాక వచ్చిన కొడుకును చూచి తల్లిదండ్రులు "బాలుడవై తిరిగేవు గోపాలకుల గూడీ" అని నర్మగర్భంగా మందలించారు.

కృష్ణుడు రుక్మిణి మేడకు పోయెను. గర్భభారంతో అలసిపోయిన రుక్మిణి నిద్రిస్తూ ఉంది. ఆమె ముఖం మీద చిరుచెమట ముత్యాలుండెను. వాటిని చూచి కృష్ణుడు నిజమైన ముత్యాలుగా భావించి -

"మా స్త్రీలకు ముఖ శృంగారము యెడ ముత్యమ్ములు గలవూ?
భూషణములు గల వింకా భర్మసరములు గలవా?

స్త్రీలకు ముఖశృంగారము చూడను తానెన్నడునూ" అని ఆశ్చర్యపోతూ దగ్గరకు పోయి చూచి, చెమట బిందువులు అని తెలిసికొని "తా గప్పిన బంగారూ శాలువ చెంగున తుడిచే"

ఇంతలో సత్యభామ తన చెలులను - కృష్ణుడు నిజంగా అక్రూరుని ఇంటికి వెళ్ళాడో! లేక మరెక్కడికైనా పోయాడో చూచి రమ్మని పంపించింది. వారు రుక్మిణి మేడకు వచ్చి రుక్మిణీ కృష్ణుల సరసాలను చూస్తున్నారు. రుక్మిణికి కస్తూరీ కలపం రాస్తున్న కృష్ణుడు "నీ చేతుల యెరుపేమే?" అని ప్రశ్నించగా, రుక్మిణి "కస్తూరి కన్న యెరుపు కమలనాభా! మీ కరములు!" అని పరిహసించింది (కస్తూరి నల్లగా ఉంటుంది). కృష్ణుడు తన పుట్టు పూర్వోత్తరాలు రుక్మిణికి తెలియజేసి, "కోరికలేమైనా ఉంటే కోరుకో!" అంటాడు. రామావతారంలో గర్భిణియైన సీతను ఇలాగే అడిగాడు రాముడు. ఆమె అడవులలో ఋషి వాటికలను చూడాలని కోరింది. దానిని సాకుగా చేసికొని లక్ష్మణుని చేత ఆమెను అడవులకు పంపివేశాడు. ఈ విషయాన్ని జ్ఞాపకంచేస్తూ రుక్మిణి దెప్పిపొడువుగా "ముందు రామావతారములో మునుపడిగిన కోరికలూ - తమ్ముని కిచ్చి యడవుల చంపబంపితిరి మీరనెనూ!"

రుక్మిణీ కృష్ణుల ఈ సరసాలను చాటుగా చూచిన సత్యభామ చెలికత్తెలు పోయి ఆమెకు విన్నవించారు. ఆమె దుఃఖించి "మైలవస్త్రము గట్టి మత్సరముతో - పూరింటిలో - నొక్క కీలడుగు మంచమున పవళించెను"

రుక్మిణీ సీమంతానికి అందరు సవతులూ, గోపికలూ వచ్చి వెళ్ళారు కాని సత్యభామ మాత్రం రాలేదు. సత్యభామ అలుక తీర్చి రమ్మని కృష్ణుని బతిమాలింది రుక్మిణి. "సత్రాజిత్తుని పత్రిక సత్యాంగన యలిగినదీ - పచ్చల పతకము నిచ్చెద

పరమాత్మా! తోడ్కొని రండూ" అంది. దానికి కృష్ణుడు

"భామామణిరో! సత్యభామ అలుకలు దీరవు
పాషాణము ఆ సత్యభామామణి కోపము" అంటాడు.

శ్రీకృష్ణుడు సత్యమేడకు వెళ్ళాడు. కాని ఆమె కోపగృహం లోపల తలుపులు గట్టిగా మూసుకొని పడుకొంది. కృష్ణుడు పాముగా మారి, ఆ గదిలోకి దూరి వెళ్ళి, మరల కృష్ణుడై సత్యభామ వీవనసేవ చేశాడు. అప్పుడామె-

"ఇందాక లేని వింతా ఈ వింతా వాసనలూ
వింత వాసనలకు తా ముసుసు తొలగించీ తా చూజే
హరియని తెలిసీ భామా మళ్ళీ ముసుగులు బెట్టే"

కృష్ణుడు బతిమాలగా -

"అక్రూరుని నగరికి విందులు ఆరగింతుమని వెళ్ళీ
మము బొంకించి వేగ వనజాక్షా! మీరు వెళ్ళీ
అక్రూరుడె సతియాయెన అతివేగంబున మీకు!" అని దెప్పి పొడిచింది.

కృష్ణుడు మనసులోపల నొచ్చుకొని : "ముందుగ చెలులకు లంచమివ్వక నే మోసపోతి!" అనుకొన్నాడు. రుక్మిణి ఇచ్చి పంపిన పచ్చల పతకాన్ని సత్యకు బహూకరించాడు. దానిని చూచిన సత్య ప్రసన్నమయింది!

కృష్ణుడు వచ్చిన పని మరిచిపోయి (సత్యను రుక్మిణీ సీమంతానికి తీసికొని వెళ్ళవలసిన పని మరిచిపోయి) సత్యభామ మేడలో ఉండిపోయాడు. రుక్మిణి ప్రసవించి మన్మథుని కన్నది. మళ్ళీ పిలుపు వచ్చేవరకూ కృష్ణుడు ఇక్కడే నిలిచిపోయాడు.

ఎంత తియ్యటి కథ కల్పించారు. మన ఆంధ్ర జానపద గృహిణీమణులు!
(ఆధారం : ఆచార్య బి. రామరాజుగారి 'తెలుగు జానపద గేయ సాహిత్యము", పుటలు ౧౬౦ - ౧౬౧)

### 1.4 ఇతరములైన స్త్రీల కథాగేయాలు :

"సత్యహరిశ్చంద్ర (బతుకమ్మ పాట) - చంద్రమతీదేవి (బతుకమ్మ పాట) - అనసూయాదేవి (బతుకమ్మ పాట) - దత్తాత్రేయ జననము - గోవుపాట - పారుజాత పల్లవి మొదలైనవి.

**పారిజాత పల్లవి :**

ఇది మిక్కిలి ప్రసిద్ధమైన స్త్రీల కథాగేయాలలో ఒకటి. దీని రచయిత (రచయిత్రి) హరివంశకథను, నంది (ముక్కు) తిమ్మన్నగారి పారిజాతాపహరణ కథను అనుసరిస్తూ, చక్కని సొంత కల్పనలతో ఈ పాటను రచించాడు (రచించింది). స్త్రీల సహజ మనోభావాలు ఇందులో మృదువుగా పొదగబడ్డాయి. నారదుని కలహ ప్రియత్వంవలన శ్రీకృష్ణుని ఇంటిలో కూడా జగడములు పుట్టి చివరకు స్వర్గమునుండి పారిజాత వృక్షము భూలోకానికి దిగిరావలసి వచ్చింది. నారదుడు స్వర్గలోకంనుండి వస్తూ వస్తూ ఒక పారిజాత పుష్పాన్ని తెచ్చి, రుక్మిణీ మందిరంలో ఉన్న శ్రీకృష్ణునికి బహూకరిస్తాడు. కృష్ణుడు దానిని రుక్మిణికి ఇస్తాడు. ఆమె ఆ పూవును సిగలో ముడుచుకొనగా ఆమె సౌందర్యం ద్విగుణీకృతమవుతుంది. దీనిని చూచిన సత్యభామ చెలికత్తెలు పోయి, సత్యభామతో చెపుతారు. ఆమె మిక్కిలి కోపించి "పూరింటిలో నొక్క కీలడుగు మంచముపై - చీరొక్కటి పరుచుక్ పవళించెను - శ్రీహరులను దలచీ" ఇది జానపదుల చిత్తవృత్తికి సహజమైన వర్ణన. పూరింటిలో నులకమంచం మీద చీర పరచుకొని నిద్రించడం జానపదులకు సహజం. ముక్కు తిమ్మనగారు రాజాంతఃపురాలతో పరిచయం ఉన్నవాడు కాబట్టి ఆయన సత్యభామ కోపగృహంలో ప్రవేశించి, "మాసిన చీర కట్టుకొని, మౌనముతోడ, నిరస్తభూషయై / వాసెనకట్టు గట్టి, నిడువాలిక కస్తూరి పట్టు వెట్టి" చీకటింట్లో మంచంమీద, నల్లని మేఘమధ్యంలో ఉన్న చంద్రవంకలా విరహంతో పొర్లుతోంది - అని వర్ణించాడు. ఈ పాటలో శ్రీకృష్ణుడు వచ్చి, సత్యభామ పరిస్థితిని చూచి -

"పన్నుగ ముని తెచ్చిన యా పారిజాతపు మాట

విన్నపములు చేసిరి కాబోలు మా వెన్నెల మొలకకు" అని మనసులో భావించాడు.

సత్యభామను సమీపించి, వీవనలు వీచి, బతిమాలి, చివరకు ఆమె కాళ్ళకు మొక్కాడు. ఇక్కడ సత్యభామ శ్రీకృష్ణుని శిరస్సును వామపాదంతో "తొలగంద్రోయుట" లేదు. భర్త నమస్కరించగానే ఆమె కోపం పోయింది - (ఈ పాటలో అతిలోక సుందరియైన సత్యభామను 'వెన్నెల మొలక' అనడం ఎంతో బాగుంది)

కృష్ణుడు స్వర్గానికి వెళ్ళి, ఇంద్రుని నందనవనంలోని పారిజాత వృక్షాన్ని పెకలించి తెచ్చి, సత్యభామ పెరట్లో నాటాడు. ఆమె ఎంతో గర్వించి, గొప్పగా ఆ

పారిజాత వృక్షం క్రింద మంచం వేయించుకొని రోజూ పడుకొంటూ ఉండేదట. కాని ఏం లాభం? ఆ చెట్టుకు పూచిన పూవులన్నీ తుమ్మెదలుగా మారిపోయి, రుక్మిణీ భవనానికి ఎగిరివెళ్ళి, తిరిగి పూలుగామారి ఆమెపై పడుతున్నాయట!

"పూచిన పూవులన్నీ - రుక్మిణీకడ కపుడే వెళ్ళే - తుమ్మెదలై పూలన్నీ రుక్మిణిపై వ్రాలె". సత్యభామ అవమానంతో బాధపడుతూ ఉంటుంది. ఇది మూలంలో లేని హాస్యరసపూరితమైన జానపదుల కల్పన.

ఇప్పటికి నూట ఇరవై ఏళ్ల క్రిందట - అంటే 1900 - 1903 మధ్య, పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరుకు చెందిన నందిరాజు చలపతిరావుగారు వందలకొలదీ స్త్రీలపాటలను సేకరించి, మూడు సంపుటాలుగా ప్రచురించారు. తరువాత 1960 ప్రాంతంలో ఆంధ్ర సారస్వతపరిషత్తువారు శ్రీ పాద గోపాలకృష్ణమూర్తిగారి సంపాదాత్వంలో "స్త్రీల రామాయణపు పాటలు", స్త్రీల పౌరాణికపు పాటలు" అనే పేర్లతో రెండు పెద్ద పెద్ద బైండ్ పుస్తకాలు ముద్రించారు.

**II వృత్తిగాయకుల జానపద కథాగేయాలు (Namative folksongs of the Ministrels) లేక వీరగాథలు (Heroic Ballods):-**

వీటిని "సాంప్రదాయక వీరగాథలు" (Traditional Ballads) అనీ, వీధి వీరగాథలు (Street Ballads) అనీ, జనప్రియ వీరగాథలు" (Popular Ballads) అని కూడా పిలువవచ్చును.

## వీరగాథా నిర్వచనము :

'వీరగాథ' అంటే 'వీరుణ్ణి గురించిన గాథ'. 'గాథ' అనే పదానికి మూడు అర్థాలున్నాయి: 'చరిత్ర - గానము - పాట- ఈ మూడు అర్థాలు కలిపితే వీరగాథా నిర్వచనం అవుతుంది. 'వీరుని చరిత్రను గానం చేసే పాట - వీరగాథ' అని నిర్వచనం చెప్పాలి. అయితే 'వీరుడు' అంటే ఎవరు? అనే ప్రశ్న వస్తుంది. సంక్షిప్తంగా చెప్పాలంటే "అన్యాయాన్ని అధర్మాన్ని ఎదిరించి, తన జాతి జనుల మేలుకోసం యుద్ధంచేసి, ప్రాణత్యాగం చేసేవాడు వీరుడు". వివరంగా చెప్పాలంటే "తనకోసం కాకుండా, తన సమాజంకోసం, తన జాతికోసం, తన దేశంకోసం, సత్యాన్ని స్థాపించడంకోసం, ధర్మాన్ని రక్షించడంకోసం, న్యాయాన్ని నిలబెట్టడంకోసం, దిక్కులేని నిరుపేదలకోసం, మానవహక్కుల్ని కాపాడటంకోసం, తన ప్రాణాలను లెక్కచేయకుండా పోరాడే వ్యక్తి, అవసరమైతే ఆత్మత్యాగానికి కూడా సిద్ధపడే వ్యక్తి వీరుడు!" నీతిశాస్త్రంలో భీముడు చెప్పినట్టుగా

"ప్రాణంవాపి పరిత్యజ్య - మానమేనాభి రక్షతు

అనిత్యో భవతి ప్రాణో - మానమాచంద్రతారకమ్"

తా||. తన మానానికి అంటే గౌరవానికి హానికరమైన ఆపద వచ్చినప్పుడు, ప్రాణాన్ని విడిచిపెట్టైనా సరే, మానాన్ని రక్షించుకోవాలి. ఎందుకంటే, ప్రాణం అనిత్యం, క్షణభంగురం (నశించేది); మానం ఆచంద్ర తారకంగా ఉండేది. 'బొబ్బిలీయుద్ధం' వంటి అనేక వీరగాథలకు ఇదే మూలసూత్రం. శత్రువు బలవంతుడని తెలిసినప్పటికీ కూడా, ఈ వీరుడు తన మానాన్ని ఆత్మగౌరవాన్ని కాపాడుకోవడకోసం యుద్ధంచేసి ప్రాణాలు బలిపెడతాడు.

పై శ్లోక భావమే వీరగాథలలో కూడా పదేపదే శ్రోతలకు జ్ఞాపకం చేయబడుతూ ఉంటుంది. భీముడు చెప్పిన నీతినే వీరగాథ కవులు కూడా చెప్పారు. 'బొబ్బిలికథ'లో రాణీమల్లదేవి వీరులను యుద్ధానికి పురికొల్పుతూ భీముడులాగే మాట్లాడుతుంది.

> ఇప్పటికి నూట ఇరవై ఏళ్ల క్రిందట – అంటే 1900– 1903 మధ్య, పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరుకు చెందిన నందిరాజు చలపతిరావుగారు వందలకొలదీ స్త్రీల పాటలను సేకరించి, మూడు సంపుటాలుగా ప్రచురించారు.

"రామ రామ రామనంతకాలము రాజ్యము యేలేర?
యుగములు జగములు గలంతకాలము భూములు యేలేర?
తిరిగిపోయి మీ తల్లికడుపునా మళ్ళా పుట్టేర?
చస్తేను మన పేరుండును, బ్రతికితేను లేదు!
చస్తేను మన కోటలోపలా మనమే చావవలె!"

"ఉయ్యాలవాడ నరసింహారెడ్డి కథ'లో వీరుల వీరాలాపాలు కూడా ఇలాగే ఉంటాయి.

"ఈ పొద్దిదియా రేపు తదియా నరుని ప్రాణమోయి!
నీటి మీదనూ బుగ్గతోడిదీ నరాశరీరమ్ము
ఏలబోయి యీ ప్రాపంచంలో మరల ఏలబోము!

పుట్టబోయి మన తల్లికడుపునా మళ్ళీ పుట్టేమా?"

వీరుని తల్లి 'వీరమాత' వీరుని భార్య 'వీరపత్ని'. వీరుని జ్ఞాపకార్థం అతని మూర్తిని చెక్కిన శిలను 'వీరగల్లు' (Hero Stone) అంటారు. ఇది మూడు అంతస్తులుగా లేదా మూడు భాగాలుగా ఉంటుంది. మొదటిభాగంలో శత్రువులతో యుద్ధంచేస్తున్న వీరుని శిల్పం ఉంటుంది. దానిపైన ఉండే రెండవ భాగంలో యుద్ధంలో మరణించిన వీరుణ్ణి అప్సరసలు స్వర్గానికి లేదా కైలాసానికి తీసికొనిపోవడం ఉంటుంది. దానిపైన ఉండే మూడవ భాగంలో కైలాసంలో వీరుడు శివునిలో ఐక్యం కావడం చూపబడుతుంది. ఈ మూడుభాగాలకూ మధ్య మధ్యలో ఉండే చట్రం వంటి ఖాళీభాగం మీద (అంటే Frame మీద) వీరశాసనం చెక్కబడుతుంది.

వీరుడు మరణించగానే వీరపత్ని సహగమనం (జానపద పరిభాషలో 'సాగుమానం') చేస్తుంది. ఆమె 'పేరంటాలు'గా పూజింపబడుతుంది. సహగమనం చేసిన వీరపత్ని రూపం చెక్కబడిన శిల్పాన్ని 'సతీకల్లు' అంటారు (కన్నడంలో 'మాస్తికల్లు' < 'మహాసతికల్లు' అంటారు)

తరతరాలుగా వస్తున్న 'సాంప్రదాయక వీరగాథ' (Traditional Ballad) కు మిక్కిలి సరళమైన నిర్వచనం: "ఒక కథను చెప్పే జానపదగేయం" (A Traditional ballad is a folk - song that tells a story). అయితే "ఆ కథ ఎటువంటిది?" అంటే-

"Ballad is a short poem that tells a story of some heroic deed, romance or event of history or legend'

జానపద గేయరూపంలో ఉండే వీరగాథలోని కథ - ఒక వీరకృత్యంగా ఉంటుంది - (సర్వాయి పాపడు కథ, దేసింగు రాజుకథ, బొబ్బిలికథ ఉయ్యాలవాడ నరసింహారెడ్డి కథ, చిన్నపరెడ్డి కథ మొదలైనవి); లేదా ఒక ప్రేమకథగా ఉంటుంది- (ఉదా. కమ్మవారి పణతి - పసల బాలరాజు కథ); లేదా ఒక చారిత్రక సంఘటనగా ఉంటుంది - (ఉదా. పల్నాటి వీరచరిత్ర క్రీ.శ. 1178 - 1182 మధ్య జరిగినది. కాటమరాజు చరిత్ర క్రీ.శ. 1280 - 1297 మధ్య జరిగినది. సర్వాయి పాపడు కథ - క్రీ.శ. 1708; దేసింగురాజు కథ క్రీ.శ. 1714; బొబ్బిలి కథ క్రీ.శ. 1757; ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కథ క్రీ.శ 1846 - 1847; చిన్నపరెడ్డి కథ క్రీ.శ. 1909); లేదా ఒక స్థానికమైన ఐతిహ్యంగా ఉంటుంది - (ఉదా. కామమ్మకథ, లక్ష్మమ్మకథ, చిన్నమ్మకథ మొ.). ఈ వీరగాథలను జముకులవారు, పంబలవారు,

వీరవిద్యావంతులు, కొమ్ములవారు, గొల్లసుద్దులవారు, పిచ్చుగుంట్లు, జంగములు, దాసరులు మొదలైన సంచారజీవులైన వృత్తిగాయకులు పాడుతారు.

"Ballad" అనేది బాహ్యస్వరూపంలో "Lyric"నూ, ఆంతరస్వరూపంలో "Epic"నూ పోలి ఉంటుందని పాశ్చాత్య విమర్శకులు నిర్ణయించారు. కాబట్టి వీరగాథ అంటే గేయరూపంలో ఉన్న చిన్న ఇతిహాసం, లేదా కథాత్మకమైన పెద్దగేయం. (Ballad is a short epic in lyrical form, or a long lyric with epic narration).

Ballad అనే ఆంగ్లపదానికి సరియైన తెలుగుపదం 'వీరగాథ' అని నేను నిర్ణయించాను. ఇప్పుడు వీరగాథను ఇలా నిర్వచించవచ్చును.

"జానపద గేయరూపంలో ఉండి, వీరరస ప్రధానమైన కథను చెపుతూ, సంచార గాయక భిక్షువుల (Wandering Minstrels) చేత పాడబడే సరళ కథా గేయమే వీరగాథ!"

## ప్రపంచ దేశాలలో వీరగాథలు :

ప్రపంచంలో వీరులు లేని దేశం లేదు. అలాగే వీరగాథలు లేని సాహిత్యం కూడా లేదు. డెన్మార్కు దేశంలోను, దానికి సంబంధించిన 'ఫేరో ద్వీపాల' (Faeroe Islands) లోను కవిత్వమంతా వీరగాథలతోనే నిండిపోయింది. పోర్చుగీసు సాహిత్యంలో వీరగాథలు తప్ప వేరొక ప్రక్రియ కానరాదు. ఇటలీ దేశానికి చెందిన 'సిసిలీ' (Sicily) ద్వీపంలో ఏడువేల వీరగాథలున్నాయని 'పిట్రే' (Pitre) అనే పరిశోధకుడు తెలియజేస్తున్నాడు. స్పెయిన్, స్కాట్లెండ్ దేశాల వీరగాథాసంపద ప్రత్యేకంగా ఎన్నదగినది. డెన్మార్కులో క్రీ.శ. 12వ శతాబ్దమనుండి, రష్యాలో క్రీ.శ. 13వ శతాబ్దంనుండి, స్పెయిన్, స్కాట్లెండ్, ఇంగ్లండ్‌లలో క్రీ.శ. 14వ శతాబ్దంనుండి వీరగాథలు ఉద్భవించి వ్యాపించాయి. అంటే ప్రపంచంలో డెన్మార్కు - పోర్చుగల్లు - స్పెయిన్ - స్కాట్లండ్- అనే ఐదుదేశాలలో వీరగాథలు చాలా ఎక్కువగా ఉన్నాయని తెలుస్తోంది. ప్రపంచంలో అన్ని దేశాలలోనూ వీరగాథలున్నాయి. కాని ఈ ఐదు దేశాలలోను వాటికన్నా ఎక్కువగా ఉన్నాయని అర్థం.

## భారతదేశంలో వీరగాథలు :

మన భారతదేశంలో శూరకుల నిలయమైన రాజస్థాన్ వీరగాథల పురిటిగడ్డ! అక్కడ వివాహ సందర్భాలలో కూడా పెండ్లి పాటలు పాడరు; వీరగాథలే పాడతారు. రాజస్థానీ భాషలో వీరగాథను 'రాసో' అంటారు క్రీ.శ. 12వ శతాబ్దంనాటి 'పృథ్వీరాజ రాసో' అతి ప్రసిద్ధమైన, అతి ప్రాచీనమైన రాజస్థానీ వీరగాథ. హిందీ

సాహిత్య చరిత్ర ఈ 'రాసోల యుగం' తోనే ప్రారంభమయింది. క్రీ.పూ. రెండవ శతాబ్దంనుండి రాజస్థాన్‌లో వీరగాథలున్నాయని తెలుస్తోంది.

రాజస్థాన్ తరువాత ఆంధ్రప్రదేశ్, పంజాబు, మహారాష్ట్రలు వీరగాథలకు ఆటపట్టులు! ఏ జాతిలో అయితే శౌర్యసాహసాలు ఎక్కువగా ఉంటాయో, ఏ జాతిలో అయితే పౌరుషం, పట్టింపులు ఎక్కువగా ఉంటాయో, ఏ జాతిలో అయితే ఆత్మాభిమానం ఎక్కువగా ఉంటుందో, ఆ జాతిలో వీరగాథలు ఎక్కువగా ఉంటాయి. ఉదా. రాజపుత్రులు, ఆంధ్రులు, శిక్కులు, మహారాష్ట్రులు. భారతదేశంలో అన్ని రాష్ట్రాలలోను, అన్ని భాషలలోను వీరగాథలున్నాయి. ఈ నాలుగు రాష్ట్రాల్లోనూ మిగిలిన వానికన్నా ఎక్కువగా ఉన్నాయి.

క్రీ.శ. పన్నెండవ శతాబ్దిలో జరిగిన పల్నాటి వీరకథలు, క్రీ.శ. 12,13 శతాబ్దాలకు చెందిన కాటమరాజు కథలు ప్రపంచంలోనే మిక్కిలి ప్రాచీనములైన, మిక్కిలి దీర్ఘములైన 'వీరగాథా చక్రములు' (Ballad - cycles) లేదా 'జానపదేతిహాసములు' (Folk Epics). రాజస్థానీ భాషలోని 'పృథ్వీరాజ రాసో' కూడా వీటితో సమానమైన ప్రాచీనత కలిగిన వీరగాథాచక్రమే! మన పల్నాటి వీరచరిత్రను శ్రీనాథుడు రచించినట్లుగా 'పృథ్వీరాజ్ రాసో'ను ఆ రాజు ఆస్థాన కవియైన 'చాంద్ వరదాయీ' రచించాడు.

## తెలుగు వీరగాథల వర్గీకరణం :

వృత్తిగాయకుల జానపద గేయకథలు మూడు ప్రధాన వర్గాలుగా కనబడతాయి. (1) వీరగాథలు (Heroic Ballads) (2) పదములు (Mythological Ballads) (3) జంగం కథలు (Religious Ballads). ఈ మూడింటిని అనుకరిస్తూ ఆధునిక కాలంలో - 1942 ప్రాంతంలో బుఱ్ఱకథలు పుట్టాయి. వీటిని Imitations of ballads" లేదా "Modern Ballads" అని పిలువవచ్చును. ("వీరగాథానుకరణములు" లేదా "ఆధునిక వీరగాథలు")

జానపద గేయకథలలో మొదటి వర్గమైన 'వీరగాథలు' కాలప్రమాణాన్నిబట్టి మూడురకాలుగా ఉంటాయి.

(i) వీరగాథాచక్రములు (Ballad - cycles) లేక జానపదేతిహాసాలు (Folk Epics)- వీటిని నెలల తరబడి పాడుతారు. వీటి చివర 'చరిత్ర' అని వుంటుంది. ఉదా. పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు చరిత్ర. నా పరిశోధన ప్రకారం పల్నాటి వీరచరిత్రలో 25వీరగాథలు; కాటమరాజు చరిత్రలో 32 వీరగాథలు ఉన్నాయి.

(ii) బొబ్బిలికథ వంటి వీరగాథలు - వీటిని రెండు మూడు రాత్రులు పాడతారు. వీటిచివర 'కథ' అని వుంటుంది. ఉదా. బొబ్బిలికథ, దేసింగురాజుకథ, సర్వాయి పాపడుకథ, బంగారు తిమ్మరాజు కథ, ఆరె మరాటీలకథ, సదాశివరెడ్డికథ, జగపతిరాజుకథ, చిన్నపరెడ్డికథ, కాంభోజరాజుకథ, బాలనాగమ్మకథ మొదలైనవి. ఈ వీరగాథలలో 'పేరంటాండ్ర కథలు' ఒక విశిష్టమైన శాఖ. ఉదా. కామమ్మకథ, లక్ష్మమ్మకథ, సాసువుల చిన్నమ్మకథ, సన్యాసమ్మకథ, మండపేట పాపమ్మకథ, గొల్లల వీరమ్మకథ మొదలైనవి.

(iii) వీరగాథానికలు లేక లఘువీరగాథలు (Balladlings):- ఒక అరగంట లోపులో పాడబడేవి. వీటి చివర 'పాట' అని ఉంటుంది. ఉదా. గుజ్జాల గోపిరెడ్డిపాట, మానందిరెడ్డిపాట, బుడ్డా వెంగళరెడ్డిపాట మొదలైనవి.

## కాటమరాజు కథలు – వీరరసపోషణ :

వీరగాథలలో వీరరసం ప్రధానమని వేరుగా చెప్పనవసరం లేదు. ఆ రసానికి అనుగుణంగా కొన్ని సందర్భాలలో రౌద్రరసం, అద్భుతరసం, కరుణరసం, బీభత్సరసం పోషింపబడతాయి. వీరగాథలలోని వీరరసానికి రెండు ఉదహరణాలు ఇస్తాను.

## కాటమరాజు కథ, ఖడ్గతిక్కన శౌర్యం :

ఖడ్గతిక్కన మొదటిసారి చల్లవారి మీదికి యుద్ధానికి వెడతాడు. బ్రాహ్మణుడు కథా అని చల్ల పిన్నమనీడు చంపకుండా వదిలివేస్తాడు. రణంలో ఓడివచ్చిన తిక్కనను ఊరిలోని ప్రజలు, తల్లిదండ్రులు, భార్య జానమ్మ అవమానిస్తారు. అతనిలో పౌరుషం ప్రజ్వరిల్లుతుంది. మర్నాడు తిరిగి యుద్ధానికి వెడుతూ తండ్రి సిద్ధనామాత్యునితో ఇలా అంటాడు: "ఓ తండ్రీ! నేను యాదవుల మీదికి యుద్ధానికి వెడుతున్నాను. వారిని చంపి వస్తే సరేసరి. లేక పోరాడి చనిపోతే, నీవు యుద్ధభూమికి రా. పగవారు నా కండలు నరికివేసినా సరే, నా శరీరంలో ఎముకలు ఉంటే చాలు, వారిని చంపివేస్తా. నేను రణరంగంలో వీరవిహారం చేస్తాను కాబట్టి, నా బొంది ఒకచోట పడి ఉండదు. బొంది కనపడకపోయినా అక్కడ తెగిపడిన నా కండలు ఉంటాయి. అయితే, కదనరంగంలో ఎందరో వీరుల కండలు ఉంటాయి. ఆ కండలలో నా కండల్ని ఎలా గుర్తిస్తావంటే, ఏ కండలయితే నా శరీరంనుండి విడిపోయినా సరే, పౌరుషంతో ఎగిరెగిరి పడుతూ ఉంటాయో, ఆ కండలు తిక్కన్న కండలని తెలుసుకో!"

"ఓ తండ్రి! వినవయ్య ఒక విన్నపంబు

నా యొక్క కీర్తి ఆనందంబు నొంద
యదుబలంబుల మీది కరుగుచున్నాడ
వారిని దునుమాడి వస్తినా మేలు,
పోరాడి వారిచే పొలిసితినైన
నీవట కావార్త నిజమని తెలిసి
వేవేగ రణభూమి వెదకంగ రమ్ము
ఆముకొని పగవారి హతము సేయంగ
కవగొని పగఱు నా కండలు నఱుక
పరగ నెమ్ములె యున్న పగతుర ద్రుంతు
ఒకచోటె నుండబో దొనరగా బొంది
కదనంబులో బొంది కానకుంటేను
అచ్చట నిచ్చట నా యుద్ధభూమి
పరగ కండలు ఎగిరి పడుచుండెనైన
తిక్కన్న కండలని తెలియంగ జూడు!"

తరువాత తల్లిని, భార్యను పిలుస్తాడు. "పూర్వం ఒక భట్రాజు వచ్చి నన్ను గురించి ఒక సీసపద్యం చెబుతూ నాలుగు పాదాలే చెప్పాడు. ఎత్తిగీతి చెప్పలేదు. నేను అతనికి ఎనిమిదివేల వరహాలు ఇచ్చాను. అతడు మళ్ళీ వచ్చి ఎత్తుగీతి చెబుతాడు. అతనికి మరో నాలుగువేల వరహాలు ఇవ్వండి" అని చెబుతాడు. సైన్యంతో కదలి రణతిక్కన కదనరంగానికి వెడతాడు. మళ్ళీ అతని సైన్యమంతా నశించిపోతుంది. ఒక్కడితో పలువురు పోరాడరాదని యాదవుల యుద్ధాన్ని నిలిపివేస్తారు. బ్రాహ్మణునితో యుద్ధం చేయడం ఎలాగ అని చింతిస్తూ ఉంటారు. అప్పుడు చల్ల పిన్నమనీడి మంత్రి, శివబ్రహ్మణుడు అయిన బ్రహ్మరుద్రయ్య ముందుకు వస్తాడు. ఖఢతిక్కన ఆ బ్రహ్మరుద్రయ్యతో ద్వంద్వయుద్ధం చేస్తాడు. ఈ యిద్దరు బ్రాహ్మణుల ద్వంద్వ యుద్ధాన్ని జానపదకవి గంగుల పినయెల్లయ 'నభూతో నభవిష్యతి'గా వర్ణించాడు:-

"అప్పుడు తిక్కన్న అగ్నిచందమున
కదిసెను కోపాగ్ని కన్నుల నురల
అదలించి రుద్రుని అడ్డాన వైచె
వడి రుద్రుడంత నా వాటు దప్పుకొనె

కరవాలు గొకొని కదిసె రుద్రుండు
విడిబడి రిద్దఱు వీరయుద్ధమున
ధరణిపై నొండొరుం దప్పించుకొనుచు
లఘించి వెనుకకు రాగడిల్లుచును
ప్రాకుచు, దూకుచు, పైకి రేగుచును,
తాటించి నఱుకుచు, తాకి పొడ్చుచును,
ఉరవడితో వచ్చి పరువడి సేసి
కటపెట ఖంఖంగు ఘల్లు ఘల్లనుచు
మెఱపులవలె మీఱి మెఱయుచు, పిడుగు
చఱపులవలె గొప్ప సడిని వ్రేయుచును
ఇర్వురు పోరిరి దుర్వారు లగుచు
తిక్కడుద్రిక్తుడై తెగవ్రేయ, రుద్రు
డక్కడ చెక్కలై అవనిపై బడియె,
పడుచునే రుద్రుడాపక ఖడ్గధార
తడయక ఆ మంత్రితల ద్రుంచిపైచె!"

కొడుకు వీరమరణవార్త విని, తండ్రి సిద్ధనామాత్యుడు రణభూమికి వస్తాడు. కొడుకు చెప్పినట్లుగానే అతని బొంది ఎక్కడా కనబడదు; పౌరుషంతో ఎగిరిపడుతున్న తిక్కన్న కండలు మాత్రమే కనబడతాయి. అవి ఎలా ఉన్నాయో చూడండి:-

"జలధిలో మీనముల్ చలియించునట్లు
నెత్తుటి వఱ్ఱులో తుత్తునియలుగ
తిక్కన్న కండలు తేలాడుచుండె!
ఎగిసెగిసి పడుచుండె నీవలావలకు!!
కనుగొని అవిచూచి కన్నీరు కార్చి
కావిధోవతిని ఆ కండలు పొదివి
అతడు నెల్లూరి కప్పుడేతేర...."

ఖడ్గతిక్కన భార్య జానమ్మ ఆ కండలతో సహగమనం చేస్తుంది.

క్రీ.శ. 1270 - 1275 ప్రాంతమున నెల్లూరును 'నల్లసిద్ధిరాజు' పరిపాలించెను. అతనికి మంత్రియు, దండనాథుడును అయినవాడు 'ఖడ్గ తిక్కన' లేక 'రణ తిక్కన'. ఇతని దగ్గరకు ఒక భట్రాజు వచ్చి, ఖడ్గ తిక్కన ధైర్యమును, గాంభీర్యమును, సిరిసంపదలను, మన్మథుని వంటి అతని సౌందర్యమును ప్రశంసిస్తూ ఒక సీసపద్యం ప్రారంభించి నాలుగు పాదాలు మాత్రమే చెప్పాడు :-

సీ. ధైర్యంబు నీమేనఁ దగిలియుండుటఁ జేసి -
చలియించి మందరా చలము దిరిగె;
గాంభీర్యమెల్ల నీకడనె యుండుటఁజేసి -
కాకుత్ స్థుచే వార్ధి కట్టువడియె;
అల లక్ష్మి నీయందు నలరియుండుటఁ జేసి -
హరిపోయి బలి దాన మడుగుకొనియె:
ఆ కారమెల్ల నీయందు నుండుటఁ జేసి
మరుఁడు ధూర్జటి కంటిమంటఁ గ్రాగె."

> ఔరంగజేబు కొడుకు కాంబక్ష్ కాలంలో, అంటే క్రీ.శ 1708- 1710 మధ్య తెలంగాణలో జరిగిన వీరగాథ సర్వాయి పాపడు కథ.

ఇంతవరకే పద్యం చెప్పాడు. దీనికి మెచ్చుకొని ఖడ్గతిక్కన అతనికి ఎనిమిదివేల వరహాలు బహుకరించాడు. ఎత్తుగీతి (తేటగీతి పద్యం కాని, ఆటవెలది పద్యం కాని) చెప్పకుండా ఆ కవి వెళ్ళిపోయాడు. ఖడ్గతిక్కన యాదవుల మంత్రి బ్రహ్మరుద్రయ్యతో ద్వంద్వయుద్ధం చేసి, వీరస్వర్గమలంకరించిన తరువాత ఆ భట్రాజు తిరిగి వచ్చాడు. తాను పూర్వం చెప్పిన సీసపద్యానికి ఎత్తుగీతి (ఆటవెలది) ఈ క్రింది విధంగా చెప్పాడు.

ఆ.వె."తిక్కదండనాథ! దేవేంద్ర పురము నీ
వరుగుటెఱిఁగి, నగము తిరుగుటుడిగె,
అబ్ధి కట్టువాసె, అచ్యుతక్కఱ తీఱె,
మరుఁడు మఱలఁ బుట్టె మగలరాజు!"

ఈ పద్యాన్ని వినిన ఖడ్గతిక్కన తల్లి "ప్రోలమ్మ"- తండ్రి "సిద్ధనామార్యుడు" తిక్కన చెప్పిన ప్రకారము ఆ కవికి నాలుగువేల వరహాలు ఇచ్చి, ఘనంగా సత్కరించి పంపించారు.

సర్వాయిపాపడు కథ - ఉత్తమకవిత్వ లక్షణాలు :

మన లాక్షణికులు ఉత్తమ కవిత్వానికి కొన్ని ముఖ్యలక్షణాలు చెప్పారు :-

(1) కవిత్వం అలంకారయుతంగా ఉండాలి. అసలు అలంకారంవల్లనే మనం కవిత్వాన్ని గుర్తించగలుగుతాం. -"(కావ్యం గ్రాహ్య మలంకారాత్)"

(2) కవిత్వం రసవంతంగా ఉండాలి ("వాక్యం రసాత్మకం కావ్యమ్"). నవరసాలలో అంటే శృంగార - వీర - కరుణ - అద్భుత - హాస్య - బీభత్స- భయానక - రౌద్ర - శాంత రసాలలో ఏదైనా ఒక రసం ఉండాలి.

(3) కవిత్వం రమణీయార్థాన్ని ప్రతిపాదించే శబ్దాలతో కూడి ఉండాలి -(రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్").అలా ఉంటేనే అది కవిత్వమవుతుంది.

(4) కవిత్వం గొప్ప భావనాశక్తితో కూడి ఉండాలి. "Poetry is,in a general sense,may be explined as the expression of imagination" - P.B. Shelly. కవి ఒక దృశ్యాన్ని చూస్తాడు. తన మనసులో ఒక కల్పన చేస్తాడు. ఆ కల్పనను మనకు అందంగా, చమత్కారంగా చెపుతాడు. అదే కవిత్వం.

(5) కవిత్వం ధ్వనిగర్భితంగా ఉండాలి. వాచ్యంగా ఉండకూడదు.

ఈ ఉత్తమకవిత్వ లక్షణాలన్నీ అంటే అలంకారం, రసం (వీరరసం), రమణీయార్థం, భావనాశక్తి, ధ్వని - అనేవి "సర్వాయి పాపడుకథ" అనే వీరగాథలో ఎలా ఉన్నాయో తెలియజేస్తాను.

ఔరంగజేబు కొడుకు కాంబక్షు కాలంలో, అంటే క్రీ.శ 1708- 1710 మధ్య తెలంగాణలో జరిగిన వీరగాథ సర్వాయి పాపడు కథ. సర్వాయిపాపడు ఈడిగ కులంలో పుట్టిన యువకుడు. ఇతని తల్లిపేరు 'సర్వమ్మ'. అందుచేత ఇతనికి 'సర్వాయి పాపడు' అనే పేరు వచ్చింది ("కౌంతేయుడు - రాధేయుడు"లాగ) చిన్నతనంలో ఇతడు ఆవుల్ని మేపుకొంటూ, కల్లు గీసుకొంటూ, దానిని అమ్ముకుంటూ బ్రతుకుతున్నాడు. ఒకనాడు ఆవుల్ని మేపుతూ చెట్టుకింద నిద్రపోతున్నాడు. సాయంకాలం నీరెండ ముఖంమీద పడుతూ ఉంటే, పన్నెండు శిరసుల నాగుబాము పడగవిప్పి, అతనికి ఎండపొడ తగలకుండా

గొడుగుపట్టిందట. ఆ దారిలో కాశీనుండి రామేశ్వరం పోతున్న బ్రాహ్మణులు ఆ దృశ్యాన్ని చూచి, పాపణ్ణి లేపి, నీకు గడియలు గోలుకొండ సింహాసనాన్ని ఏలే పంతముందని జోస్యం చెప్పారట. అంతే అతడు ఆవుల్ని మేపడం మానేశాడు, కల్లు గీయడం కట్టిపెట్టాడు. తల్లిని పీడించి ధనం తీసికొని, సైన్యాన్ని సమకూర్చుకొని, భువనగిరి, ఓరుగల్లు దుర్గాలను పట్టుకున్నాడు. చివరికి గోల్కొండ మీదికి కూడా, దండెత్తి వెళ్ళి దానిని కూడా జయించాడు. కొన్నాళ్ళకు ఢిల్లీ సుల్తాన్ పంపించిన 'యూసఫ్ ఖాన్' వచ్చి పాపణ్ణి చంపినట్లుగా చరిత్ర చెపుతోంది. ఈ వీరగాథలోని అద్భుత కవిత్వం:-

### 1. అలంకారం :

(a) రాయుడే! సర్వాయిపాపడే! మొగలాయి పాపా! ||రాయుడే||

ఈడిగోళ్ళా సిన్నవాడేరా - సర్వాయిపాప

ఈదులు గీసే ఈడిగోడమ్మ - సర్వాయిపాప

ఈడిగోళ్ళా సిన్నవాడు - ఇప్పాపువ్వంటివాడు

మల్లెలా మొగ్గంటి వాడేరా - ఆ రాయుడు

మఘలీరేకంటి వాడేరా!

(b) వాడుపట్టే బల్లెమున్నది - పాపిష్టి బల్లెం

అక్కడిక్కడ ఎండికట్టూ

నడుమా బంగారి కట్టూ

మంచసేలా మల్లకొచ్చూ

మొంచుఏలా ముంచుకొస్తాది

(మంచపేల =మంచపువేళ =రాత్రి - మంచాలు వాల్చుకొని పడుకొనేవేళ.

మొంచుఏల +మంచువేళ =చలికాలం)

### 2. వీరరసం : స్థాయిభావం ఉత్సాహం :

కళలు, విద్యలు ఎన్ని అయినా కులవిద్యకు సాటిరావని చెపుతూ పాపని తల్లి సర్వమ్మ కుమారుణ్ణి కులవృత్తి చేసుకొని బ్రతకమని, ఈతకల్లు తాటికల్లు గీసుకొని అమ్మమని బతిమాలుతుంది. దానికి వీరుడు కాదలచిన పాపడు ఉత్సాహభరితమైన సమాధానం చెపుతాడు :

**సర్వమ్మ :**

"వినరా! సరదారి పాపా!
కళావిద్యలు ఎన్ని అయినా - కులావిద్యకు సాటిరావు
ఇంటి ఆవులు మేపమంటాదీ - సర్వమ్మతల్లి
ఈతచెట్లే గీయమంటాది!
ఈతచెట్లే గీయమంటాది - సర్వమ్మతల్లి
ఈతకల్లే అమ్మమంటాది!
తాటిచెట్లే గీయమంటాదీ - సర్వమ్మతల్లి
తాటికల్లే అమ్మమంటాది!

**పాపడు :**

అరెధూత్! భాంచేత్!
ఈదులుగీస్తే ఈండ్రవాడు - కల్లుగట్టితే గవండ్లవాడు
కత్తిపట్టితే మేదరవాడు - కుండబట్టితే కుమ్మరవాడు
మొనగాడీ చట్టమొచ్చానా? - సర్వమ్మతల్లీ!
పాళేగాడీ చట్టమొచ్చునా?
వూరుకొడితే ఏమిఫలము ?
పల్లెకొడితే ఏమిఫలము?
కొడితే గోల్కొండ కొట్టాలే - సర్వమ్మతల్లీ!
పడితే బందారు పట్టాలే!
కడపాజిల్లాల్ కొట్టాలే - సర్వమ్మతల్లీ!
కందనూలు నూలు కొట్టాలే!-
అరె - మైసూర్ జిల్లాల్ కొట్టాలే - సర్వమ్మతల్లీ!
చెన్నాపట్నం కొట్టాలె!"

## ౩. పాపని శౌర్యవర్ణన :

1. అతిశయోక్తి అలంకారం 2. రమణీయార్థం 3. ధ్వని +4. ప్రతీకలు

"సర్వాయి పాపని పేరు చెప్పితే చరాచర జగత్తు అంతా గడగడ వణికిపోతోంది" అనే విషయాన్ని జానపద కవి రమణీయార్థ ప్రతిపాదకంగా, ధ్వని గర్భితంగా, ప్రతీకలతో, అతిశయోక్తి అలంకారంతో చెపుతున్నాడు చూడండి:-

(a) "పాపని యొక్కా పేరు జెప్పితే

ఊరబిచ్చుకా ఊరుచేరదు

పొట్టిపిచ్చుకా పొలము చేరదు

కౌజులూ కారాడుచుండు

నక్కలూ నాట్యాలు దొక్కు

పందికొక్కూ డోలుకడతాదో - వాడేటంటే

దొంతికుండలు గంతులేస్తాయి! - వాడేటంటే

పసిబిడ్డలు పాలు తాగరురా! - వాడేటంటే

గుర్రాలు గుగ్గిళ్ళు తినవూరా - వాడేంటంటే

ఏనుగులూ మేత అందావు - వాడేటంటే"

(b) నేను సేకరించిన మరొక వీరగాథలో సర్వాయి పాపని శౌర్యవర్ణన :

"అదిగో వచ్చే పాపడంటేను - భూలోకమంతా

నక్కలే నట్టావు దొక్కేది - పాపన్న దెబ్బ!

నక్కలే నట్టావు దొక్కు - జింకలే జిడిగుడూ కూసు

కొంగలే కోలాటమేసు - పాములే పల్లాయిదొక్కు

పూరేళ్ళే వూడిపోవు - లేవకలే లేసిపొయ్యేది! - పాపన్న దెబ్బ!"

(లేవకలు = లావుక పిట్టలు)

(4) సర్వాయి పాపని 'వీరపాణం' - 'అద్భుతరసం' - 'రమణీయార్థం' - 'భావనాశక్తి' - 'అతిశయోక్తి' అలంకారం -

వీరులు యుద్ధానికి వెళ్ళేముందు కాని, యుద్ధం ముగించి వచ్చిన తరువాత కాని మద్యపానం చేస్తారు. దీనిని 'వీరపాణం' అంటారు. సర్వాయిపాపడు భువనగిరి, ఓరుగల్లు మొదలైన దుర్గాలను పట్టుకొనిన తర్వాత గోల్కొండ మీదికి యుద్ధానికి బయలుదేరుతూ 'వీరపాణం' చేయాలనుకున్నాడు. అతని మేనమామ కొడుకు ఒకడు కులవృత్తిలో కొనసాగుతున్నాడు. అతని దగ్గరకు వెళ్ళాడు. "నీ దగ్గర ఏయే రకాల కల్లు ఉంది?" అని అడిగాడు. వాడు కల్లు రకాల పేర్లు చెప్పకుండా - నేటి పరిభాషలో 'బ్రాందీ, విస్కీ, జిన్, రం, వైన్' అని చెప్పకుండా - వాటి శక్తి (ఎఫెక్ట్) చెపుతున్నాడు:-

(1) "మాట్లాడే కల్లు వుంది - మైకమెత్తే కల్లు వుంది
నిద్రబొయ్యే కల్లువుంది - దోవనడిచే కల్లువుంది
జూదమాడే కల్లువుంది - జగడమాడే కల్లువుంది
ఏలుపెడితే ఏలుమండు - కాలుపెడితే కాలుమండు
కత్తిపెడితే కత్తిరించాలె - ఆ కల్లూ
కత్తిపెడితే కత్తిరించాలే!" అని చెప్పాడు.

ఇక్కడ రమణీయార్థం ఉంది. సర్వాయి పాపడికి ఈ రకాలేమీ నచ్చలేదు. 'నేను గోలకొండ మీదికి యుద్ధానికి వెడుతున్నాను. నాకు "నరుకులాడే కల్లు కావాలి!?" అన్నాడు. వాడి మేనమామ కొడుకు "ఆ రకం నా దగ్గర" లేదన్నాడు. పాపడికి కోపం వచ్చి, వాణ్ణి ఎగిరి ఒక్క తన్ను తన్నాడు. వాడు "తన్నితే తన్నావులే! నా మేనత్త కొడుకువే కదా!" అన్నాడట.

అప్పుడు పాపడు ఆ తాటితోపులో ఉన్న చెట్లన్నీ వెదికాడట. నాగసర్పంలాగ మెలికలు తిరిగిన ఒక పొడుగాటి తాడిచెట్టు దగ్గరకు వెళ్ళి "నేను గోలుకొండమీదికి యుద్ధానికి వెడుతున్నాను. నాకు నరుకులాడే కల్లు పొయ్యి!" అని ఆజ్ఞాపించాడట. ఆ పొడవైన తాడిచెట్టు గడగడ వణికి, వంగి పాపడి నోట్లో నరుకులాడే కల్లు పోసిందట! ఇక్కడ అద్భుత రసం ఉంది.

ఈ సందర్భంగా జానపదకవి "పాపడు మిక్కిలి శక్తిమంతమైన కల్లు తాగాడు" అని చెప్పడానికి తన అత్యద్భుతమైన భావనాశక్తిని చూపించాడు.

ఈ సర్వాయి పాపడు కథను మొట్టమొదట సేకరించిన మహానుభావుడు ఒక తెల్లదొరగారు. ఆయన పేరు J.A. Boyle గారు. ఈయన క్రీ.శ. 1874లో (అంటే ఇప్పటికి 150 సంవత్సరాల క్రిందట బళ్ళారి వాస్తవ్యుడైన ఒక బోయవాడి దగ్గర సేకరించాడు. ఆ పాటలో సర్వాయి పాపడు తాగిన "నరుకులాడే కల్లు" వర్ణన ఈ క్రింది విధంగా ఉంది:-

"పాపడు తాగేటి కల్లు - ఏ తాటి తాటికల్లు?
వేలుపెడితే వేలుతెగును
దివిటీపెట్టితే భగ్గున మండును
తాగేటప్పుడు తియ్యగ వుండును
తాగినవాణ్ణి లేవనివ్వదు
లేచినవాణ్ణి పోవనివ్వదు!"

నేను సేకరించిన పాటలో ఈ నరుకులాడే కల్లు వర్ణన ఇంకా బాగుంది:-

“పాపడు తాగేటి కల్లు
ఏ తాటి తాటి కల్లు?
ఏలుపెడితే ఏలుతెగును!
కాలుపెడితే కాలు తెగును!
కత్తిపెడితే కత్తిరించాలె - ఆ కల్లు
కత్తిపెడితే కత్తిరించాలె!

పాపడు తాగేటి కల్లు
ఏ తాటి తాటికల్లు
ఏలుపెడితే ఏలుతెగును!
కాలుపెడితే కాలు తెగును!
కల్లుమిందా బొరుగుతీసి
పచ్చగడ్డి పైన్ యేస్తే
అగ్గిలేకా ధగ్గున మండూర! ఆ కల్లూ
అగ్గిలేకా ధగ్గున మండూర!!

ఈ విధంగా వీరగాథాకవిత్వంలో ఉత్తమ కవితా లక్షణాలు మనకు కొట్టవచ్చినట్టు కనబడతాయి!

## వీరగాథల వైశిష్ట్యం (ఉపసంహారం) :

వీరరస ప్రధానమైన స్థానిక ఐతిహ్యాలలోనుండి వీరగాథలు (Baliads) పుడతాయి. కాలక్రమంలో ఒక వీరుని చుట్టూ అనేక వీరగాథలు పుట్టి, అవి అన్నీ కలిసి ఒక వీరగాథాచక్రంగా (Ballad - cycleగా)ఏర్పడతాయి. దీనిని 'జానపద ఇతిహాసం' (Folk Epic) అంటారు. కురుక్షేత్రంలో క్రీ.పూ 3100లో మహాభారత యుద్ధం జరిగింది. ఆ సంఘటననుండి 'జయము' అనే వీరగాథ పుట్టింది. అది కొంచెం పెరిగి “భారతం” అయింది. ఇంకా దీనికి అనేక ఉపాఖ్యానాలు కలిసి “మహాభారతం” అయింది - అని పెద్దలు చెపుతారు. అంటే వీరగాథలనుండి వీరగాథాచక్రాలు రేక జానపద ఇతిహాసాలు, వాటినుండి శిష్టుల ఇతిహాసాలు పుడతాయి. దీనిని 'ఐతిహాసిక క్రమం' (Epic Process) అంటారు.

**Ballads > Ballad - cycles (Folk Epics) > Classical Epics =Epic Process**

వీరగాథల వైశిష్ట్యాన్ని అనేక విధాలుగా చెప్పవచ్చును. వీరగాథాప్రక్రియ ప్రపంచంలో ప్రతి సాహిత్యంలోనూ స్వతంత్రంగా పుట్టిన ప్రక్రియ. ఇది ఇతిహాస కవిత్వానికి మూలకందం. వీరగాథలు నిసర్గ మనోహరంగా ఉంటాయి. సహజత్వమే వీటికి ప్రాణం. ఒకదేశంలోని వీరగాథలన్నీ ఆ దేశ సంస్కృతిని పట్టి యిచ్చే జాతీయతా చిహ్నాలుగా ఉంటాయి. యుద్ధసమయాలలో దేశస్వాతంత్ర్యాన్ని కాపాడుకోవటానికి ప్రజలలో వీరగాధాగానం అత్యవసరం. వీరగాథలు దేశానికి గర్వకారణం. ఇవి ప్రజాజీవితాన్ని మణిదర్పణములవలె ప్రతిబింబిస్తాయి.

నవరసాలలో విశిష్టమైన వీరరసంచేత వీరగాథలు నిండి ఉంటాయి. ఏనాడో చనిపోయిన వీరులు గాథాగానంచేత మళ్ళీ పునరుజ్జీవితులవుతారు. శ్రోతల మనోనేత్రాలకు ప్రత్యక్షమవుతారు. "తెలుగు సాహిత్యమంతా సంస్కృత సాహిత్య పరివర్తనమే!" అనే నిందను పోగొట్టగల ఒకే ఒక సాధనం వీరగాథా కవిత్వం.

వీరగాథలకు మూడు మహత్తర శక్తులున్నాయి. (1) సర్వజనాకర్షణశక్తి. ఇవి సరళంగా ఉండి సర్వజనులను ఆకర్షిస్తాయి. (2) సంఘసంచాలకశక్తి. వీరగాథలు సంఘాన్ని సంచలింపజేసి, మహావిప్లవాలను సృష్టించగలవు. (3) విచిత్రానుభూతిదాయికశక్తి. ఇవి శ్రోతలకు విచిత్రమైన ఆత్మీయానుభూతిని కలిగిస్తాయి.

దేశదేశాలలో వీరగాథల వలన శిష్టకవులు ప్రభావితులయ్యారు క్రీ.శ. పన్నెండవ శతాబ్దంలో రాజస్థానీ భాషలో 'చాంద్ వరదాయి' అనే పృథ్వీరాజు ఆస్థానకవి 'పృధ్వీరాజ్ రాసో' అనే వీరగాథను రచించాడు. క్రీ.శ. 15వ శతాబ్దం నాటి శ్రీనాథ మహాకవి "పలనాటి వీరచరిత్ర" "కాటమరాజు చరిత్ర" అనే వీరగాథా చక్రాలను (జానపద ఇతిహాసాలను) రచించాడు. ఆంగ్లంలో గోల్డ్ స్మిత్ అనే మహాకవి అనేక వీరగాథలు రచించాడు. రాజస్థానీ కవులు ఈనాటికీ "రాసో" పద్ధతి (వీరగాథా చందస్సు)లోనే కవిత్వం రాసి, మహోద్రేకంగా పాడుతారు (నేను విన్నాను).

వీరగాథలవలన భాషకు సహజత్వమూ, జీవమూ కలుగుతాయి. కొన్ని సాంఘిక ప్రయోజనాలు కూడా నెరవేరుతాయి. వీరగాథలు 'విధి బలీయము. మానవుడు నిమిత్తమాత్రుడు" అనే నీతిని నిశ్శబ్దంగా ధ్వనింపజేస్తాయి!

# తెలుక్కి సామెత, అతిథికి, ఆమెత



ఆచార్య జి.ఎస్.మోహన్
✆ 94484 05110

భాష సజీవమైంది. భాషా వైశిష్ట్యానికి మచ్చుతునక సామెత. 'సామెత లేనిమాట చచ్చుమాట' 'సామెత లేని మాట ఆమెత లేని ఇల్లు' అని లోకోక్తులు. సామెతకు శాస్త్రం లోకువ అన్న నానుడి కూడ ఉంది.

అక్షర జ్ఞానం ఉన్నవాడు కానీ, లేనివాడు కానీ తన మాటల్లో ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక విధంగా చమత్కారయుతమైన నానుడిని ప్రవేశపెడ్తూనే ఉంటాడు. అలాగే ఉన్నవాడు కానీ, లేనివాడు కానీ కనీసం పండుగ పబ్బాల్లో అయినా సరే ఇంట్లో విందు (ఆమెత) చేసుకొని తీరుతాడు. అందుకనే మన పెద్దలు సామెతకు ఆమెతకు సామ్యం చూపించారు.

'Proverb' అనే ఆంగ్లపదానికి తెలుగులో సమానార్థక పదం సామెత. 'A general or common saying' అని దీని అర్థం. హిందీలో 'కహావత్' అని అంటారు. అలాగే కన్నడంలో గాదె, నాణ్ణుడి, లోకోక్తి, శాస్త్ర, సామతి అనేవి సామెతకు పర్యాయపదాలు. తమిళంలో సామెతెను 'పళమొళి', 'ముదురె' 'ముదుసొల్' అనీ, మలయాళంలో 'పళించొల్' అనీ, తుళుభాషలో 'గాదె' అనీ, కొడవ భాషలో 'గాది' అంటారు.

ఒక అరబిక్ సామెత Proverbs are lamps towords అని పేర్కొంటే 'The edged tools of speech' అని Becon అభిప్రాయపడ్డాడు. అలాగే మొల్ల రామాయణాన్ని రచించిన మన మొల్ల కవయిత్రి కూడా సామెతను గురించి ఇలా అంటుంది.

కందువమాటలు సామెత
లందముగాఁ గూర్చి, చెప్పనది, తెనుగునకుం
బొందై, రుచియై, వీనుల్
విందై మఱి కానిపించు విబుధులమదికిన్'

ఈ మాటలు సామెతలు తెలుగుభాషకెలా అలంకార ప్రాయాలుగా ఉన్నాయో చెప్తున్నాయి. ఏమైనా భావ ప్రకటనకు దోహదం చేసే ప్రక్రియల్లో సామెతకు ప్రత్యేక స్థానం ఉంది. సరళసుందరమైన భాష, భావావేశం, లయ సామెతకు పెట్టని అలంకారాలు.

సామెత అనే పదానికి సమానమైన పదం కన్నడంలో 'సామతి'. ఈ సామతి 'సామ్యతె' నుండి ఆవిర్భవించినట్టుగా, తెలుగులో సామ్యం నుంచి సామెత ఆవిర్భవించి ఉంటుంది. 'సామ్య' శబ్దానికే 'సామ్యత' అనే ఆసాధురూపం ఏర్పడి సామెతగా ప్రచారంలో ఉందని డా. చిలుకూరి నారాయణరావుగారి అభిప్రాయం. ఈ పదం 15వ శతాబ్దంలోని వరాహపురాణంలో తొలిసారిగా ప్రయోగింపబడిందన్న అభిప్రాయం ఉంది.

'నానుడి', 'లోకోక్తి', 'ఆర్యోక్తి', 'శాస్త్రం, 'జనశ్రుతి' అన్నపదాలు సామెతకు పర్యాయపదాలు. శాస్త్రమనే పదం రాయలసీమ ప్రాంతంలోను, ఉత్తర కర్ణాటక ప్రాంతంలోను వ్యవహారంలో ఉంది. రాయలసీమ ప్రజలు ముఖ్యంగా అనంతపురం జిల్లావాళ్ళు 'అదేమో శాస్త్రం చెప్పినట్లు' అనీ, కన్నడిగులు 'అదేనో శాస్త్రా హేళ్తారల్లా హంగే' అనీ ప్రయోగిస్తారు. 'అదేమో కథ చెప్పినట్లుగా ఉందే నీ వ్యవహారం' అని కూడ అనంతపురం జిల్లావాసుల వ్యవహారం. ఈ కథ కూడ సామెతకు దగ్గరిదే. శాస్త్రం అనేమాటకు సంస్కృతంలో విధివాక్యం, నియమం అనే అర్థాలు ఉన్నాయి. సాటువ, సాటవ, చాటువ, చాటవ అని నెల్లూరు సీమవాసుల వ్యవహారంలో ఉంది. కర్ణాటకలోని కోలారు జిల్లా మాలూరు ప్రాంతంలో కొన్నిచోట్ల సామెతల్ని 'సాకులు' అని పిలవడం ఉంది.

> సామెత అనే పదానికి సమానమైన పదం కన్నడంలో 'సామతి'. ఈ సామతి 'సామ్యతె' నుండి ఆవిర్భవించినట్టుగా, తెలుగులో సామ్యం నుంచి సామెత ఆవిర్భవించి ఉంటుంది.

కన్నడంలో కూడ తెలుగులో ఉన్నట్టుగానే నాణ్ణుడి (నాడు+నుడి) లోకోక్తి, శాస్త్ర, సామతి, గాదె అనేవి సామెతకు పర్యాయపదాలు. 'గాదె వేదక్కె సమాన' - అంటే సామెత వేదానికి సమానమనీ, 'వేదసుళ్ళాదరూ గాదె సుళ్ళల్ల' అంటే వేదం అసత్యమయినా

సామెత అసత్యం కాదు అనీ, కన్నడిగుల అభిప్రాయం. అలాగే 'మాతిగె ముంచెగాడె, ఊటక్కె మొదలు ఉప్పినకాయి అంటే మాటకు ముందు సామెత భోజనానికి ముందు ఊరగాయ అని అంటుంది కన్నడ సామెత. భోజనానికి ఊరగాయ ఎలా రుచిగా ఉంటుందో, సంభాషణలో సామెత అంత ఆకర్షణీయంగా ఉంటుందని ఈ సామెత పోల్చి చూపిస్తోంది.

అనుభవం నేర్పిన పాఠమే సామెత. ఎంచేతనంటే మన జీవితంలో సుఖదుఃఖాలు రెండూ సమపాళ్ళలో ఇమిడి ఉన్నాయి. సుఖం వచ్చినప్పుడు గంతులు వేయడం, ఆనందించడం, కష్టం వచ్చినప్పుడు కన్నీరు కార్చడం, దుఃఖించడం మన అనుభవంలో ఉన్నవే. ఈ అనుభవాలను వృథా నివ్వపోలేదు మన పూర్వీకులు. తమ అనుభవాలకు అక్షరరూపం ఇచ్చి అల్పాక్షరాలలో అనల్ప భావాన్ని అందించారు. 'సూక్ష్మంలో మోక్షం' చూపించే ఈ సామెతలు మన ప్రాచీనుల విజ్ఞాన సంపదకు తార్కాణం. దీని 'మూర్తి చిన్నదైనా కీర్తి దొడ్డది' మరి. Thomas fuller దీన్నే "much matter decocted in a few words" అంటాడు.

జీవితం నేర్పిన గుణపాఠం అనుభవం. అనుభవం అందించిన సందేశం సామెత. 'అనుభవమే శాస్త్రం. మాటలే మంత్రాలు' అన్ననానుడి సామెతకు బాగా వర్తిస్తుంది. 'The wit of one and the wisdom of many' అని అంటాడు Earl russe. 'proverbs are the daughters of daily experiences' అని అంటుంది. డచ్ సామెత. It is a shot sentence found on long ecperience' అని అంటాడు Cervantes ఇవన్నీ సామెతల ప్రాశస్త్యాన్ని వెల్లడిచేస్తాయి.

సామెతలు అనుభవాలనుంచి పుట్టాయనుకొన్నప్పుడు, ఆ అనుభవం కేవలం ఒక్కనిదే కాదు, జనసామాన్యులందరిది కూడా. సామెత కూర్పు మాత్రం ఒక్కడిదే కావచ్చు కాని అది పలువురి అనుభవాల మీద ఆధారపడి ఉంటుందనడానికి ఒక నానుడిని విశ్లేషిస్తాను.

'నరం లేని నాలుక నాలుగువిధాలు'
'ఎముకలేని నాలుక ఎట్లైనా తిరుగుతుంది'
'నాలుకకు ఎముక ఉన్నదా'

మన శరీరంలో ప్రధానమైన అంగం నాలుక. మాట్లాడాఅనికి, అభిప్రయాలు తెలుపుకోవడానికి ఉపకరించే చిన్న పరికరం లాంటిది నాలుక. అందువల్లనే మాతృభాష అనడానికి ఇంగ్లీషులో 'మదర్ టంగ్' అంటారు. నాలుకే లేకపోతే జీవితాంతం మూగవాడుగానే ఉండిపోతాడు. అయితే ఈ నాలుకకు ఎముక ఉండదు, నరం ఉండదు. ఎలా కావాలన్నా, ఎటు కావాలన్నా తిరుగుతుంది. అందువల్లనే ఈ సామెత నాలుకను అదుపుపెట్టుకోవాలని సూచిస్తుంది.

కొంతమంది తామేమి మాట్లాడుతున్నామో తెలియక మాట్లాడుతుంటారు. మరికొంతమంది ఎప్పుడేమి మాట్లాడుతామో తెలియక మాట్లాడుతుంటారు. మరికొంతమంది ఇతరుల్ని ఆడిపోసుకొంటారు, వ్యంగ్యంగా మాట్లాడుతుంటారు. మరికొంతమంది ఇతరుల్ని బాధించేటట్లు మాట్లాడుతుంటారు. ఇంకా కొంతమంది అదే నాలుకతో చాడీలు చెప్పడం, తంటా తగాదాలు పెట్టడం, నోరు విప్పితే అబద్ధాలు చెప్పడం చేస్తుంటారు. వినోదం పొందుతారు. తమకు వచ్చిన ఆపదలను తొలగించుకోవడానికి, అక్రమ మార్గంలో డబ్బు సంపాదించడానికి అబద్ధపు సాక్ష్యాలు చెప్తుంటారు. ఇవన్నీ కొంతమందికి పుట్టుకతో వచ్చిన సహజగుణాలు, వృత్తి ప్రవృత్తులకు సంబంధించిన మనస్తత్వ గుణాలు. ఇలాంటివాళ్ళను గమనించే మన పెద్దలు "నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుంద'ని అనుభవపూర్వకంగా చెప్పారు. మనస్సాక్షి, అంతఃకరణ, వివేకం దెబ్బతిన్నప్పుడు నైతిక విలువలు, కట్టుబాట్లు అంతరించిపోతాయనడానికి ఈ నానుడి చక్కని ఉదాహరణ.

> అనుభవం నేర్పిన పాఠమే సామెత. ఎంచేతనంటే మన జీవితంలో సుఖదుఃఖాలు రెండూ సమపాళ్ళలో ఇమిడి ఉన్నాయి. సుఖం వచ్చినప్పుడు గంతులు వేయడం, ఆనందించడం, కష్టం వచ్చినప్పుడు కన్నీరు కార్చడం, దుఃఖించడం మన అనుభవంలో ఉన్నవే.

లాంటి నానుడులు అనేక భాషల్లో ఉన్నాయి. చూడండి.

కన్నడం : 1. ఎలుబిల్లద నాలిగె హేగాద్రూ తిరుగుత్తె
2. మూళె యిల్లద నాలిగె యావెడెగూ మగుచీతు

తుళు : ఎలుఇద్యంది నాలయి ఒంచిల మగురు

తమిళం : నాక్కిర్కు నరంబిల్లై

మళయాళం : నాక్కిను ఎల్లిల్ల

అందువల్లనే నాలుకను అదుపులో పెట్టుకోమంటారు. తిరువళ్ళువర్ తన 'తిరుక్కురళ్'లో

1. పలుకునదుపు చేయుట పరమధర్మమందురు
పలుకు చెడిన త్రోయును అధఃకూపమందున |

2. పలుకదిములుకై ఎవరి ఎద గ్రుచ్చుకొనినను
బలుపదిలముగ కాచిన గుణనిధి పలుచనగు|
(జానపదాలు - జ్ఞానపదాలు, పుట 17)

అనుసృజన : యల్లాప్రగడ ప్రభాకరరావు
కన్నడ కీర్తనకారుడు పురందరదాసుల వారు కూడా తమ ఒక కీర్తనలో
'ఆచారము లేని నాలుకా, నీ నీచబుద్ధిని విడువుము నాలుకా,
వివేచన లేక పరుల దూషింపను చాచుకొన్నట్టి నాలుకా,
అని తన నీచబుద్ధిని వదలుకోమని నాలుకను గురించి ప్రస్తావిస్తారు.
అందుకనే మరో తెలుగు సామెత కూడా

'నాలికా, నాలికా వీపుకు దెబ్బలు లేక' అని హెచ్చరిస్తుంది. ప్రపంచంలోని ఏ మారుమూల ప్రదేశానికి వెళ్ళినా ప్రజల మనస్తత్వం ఒక్కటీగా ఉంటుందని చెప్పడానికి ఇలాంటి సామెతలు నిదర్శనాలుగా ఉన్నాయి.

సామెతల ఆంతర్యాన్ని బాగా గమనించినప్పుడు ఇవి వేదాలలాగా ప్రజలకు మార్గదర్శకాలుగా, సత్య స్వరూపాలుగా సాక్షాత్కరిస్తాయి. "The genius, wit and spirit of a nation is discovered in its proverbs' అంటాడు Lord bacon. ఆయా దేశాల మేధస్సు, బుద్ధి చాతుర్యం, ఆత్మస్థైర్యం, ఆ దేశపు సామెతల వల్ల తెలుసుకోవచ్చు. Anon పేర్కొన్నట్టుగా Proverbs are the cream of nation's thought.

'తొల్కాప్పియమ్' వ్రాసిన తొల్కాప్పియర్ సామెతను గురించి చెప్తూ 'A proverb is a sentence meant for carrying particular idea. It should be based on reason. It must have characteristics of point, brevity, wisdom and simplicity' అని పేర్కొన్నాడు. ఇది ద్రావిడ భాషలలో సామెతను గురించిన ప్రాచీనమైన అభిప్రాయంగా ఉంది.

సామెతలోని వస్తువు సమాజం, ప్రజా జీవనం మాత్రమే. ప్రతి సామెత మీద పరిసర ప్రభావం, సన్నివేశాల కాంతి ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. సత్య ప్రాధాన్యం, వాస్తవికత దీని లక్ష్యం. అస్వాభావికత మచ్చుకైనా కన్పించదు.

## విషయ ప్రాధన్యాన్ని బట్టి సామెతల్ని

1. సూత్రపు సామెతలు
2. ఉపమాన రూపక సామెతలు
3. నీతిబోధక సామెతలు
4. పౌరాణిక సామెతలు
5. ప్రశ్నార్థక, ప్రశ్నోత్తర సామెతలు
6. సాంఘికాచార వ్యవహారాలు, విశ్వాసాలు, నమ్మకాలు
7. వ్యక్తిగత సామెతలు
8. హాస్యపు సామెతలు
9. వ్యవసాయ సంబంధపు సామెతలు
10. శబ్దాలంకార సామెతలు
11. అశ్లీలపు సామెతలు
12. న్యాయం సామెతలు
13. వైద్యపు సామెతలు
14. గృహజీవన సంబంధి సామెతలు

అని వింశడించవచ్చు. అలాగే సామెతలలో మాదిరి సామెతల్ని, పదబంధపు సామెతల్ని గుర్తించవచ్చు. అన్యభాషా సంపర్కం వల్ల కూడ ఎన్నో కొత్త సామెతలు బయలుదేరుతాయి. వేరువేరుదేశాలవారి వేషభాషలు వేరయినా, అనుభవాలు మాత్రం అందరివీ సమానమే.

పైన పేర్కొన్న వివిధ రకాలైన సామెతలలో హాస్యానికి సంబంధించిన కొన్ని సామెతలను మాత్రం ఉటంకిస్తాను.

1. తాతా! పెండ్లాడుతావా? అంటే నాకెవరిస్తారురా అబ్బాయి! అన్నాడట.
2. సాయబు గడ్డం కాలి ఏడుస్తుంటే, బీడీ అంటించుకొంటా తాలు అన్నాడట.
3. ముక్కు కారుతోంది అంటే తుడిచిపెట్టరాదా అన్నట్టు

4. అగ్రహారం పోయింది కాని యాక్టు బాగా తెలిసింది అన్నాడట.

5. ఆలూలేదు చూలూ లేదు కొడుకు పేరు సోమలింగం

6. గుడిలోని దేవుడు బెత్తల్లో ఉంటే, వాకిట్లో దేవుడు వన్నెచీర అడిగినంట

7. గడార్లు గాలికి కొట్టుకుపోతుంటే ఏకులు పట్టుకొని యాలాడినంట

8. తిత్తీబోడీ, నెత్తీబోడీ

9. మా ఇంటాయన కెంత మతిమరుపు అంటే ఏటనుబడి ఈద మరిచాడు.

10. పెండ్లి సందడిలో పుస్తెకట్ట మరచాడట!

11. జగడమెట్లా వస్తది దాసరయ్య అంటే బిచ్చం పెట్టవే బొచ్చుముండ అన్నాడట.

12. ముడుపులు వెంకటేశ్వరుడికి, కేకలు గోవిందుడికి.

13. లంకలో పుట్టేటివన్నీ రాక్షసులే!

14. అవ్వను పట్టుకొని వసంతాలాడినట్లు

15. ఆకులు ఎత్తరా అంటే తిన్నవాళ్లెంతమంది అన్నట్టు

సామెతల విలువని దృష్టిలో పెట్టుకొని సామెతలలో సాంఘిక జీవితం ఎలా ప్రతిబింబిస్తోందో తెలుసుకోవచ్చును. సాంఘిక జీవితం మారినా సామెత మారదు. తరతరాలుగా మనకు అందించబడ్డ ప్రాచీన విజ్ఞానం సామెత. ఒక జాతి విజ్ఞానమంతా ఇందులో ఇమిడిఉంది. చారిత్రక జీవన సత్యాన్ని ఇంత చక్కగా అందించే ప్రక్రియ బహుశా మరొకటి ఉండదేమో! సాంఘిక జీవితంలోని పలు సన్నివేశాలు, సంఘటనలు, అనుభవాలు సామెతకు వస్తువులయ్యాయి. సాంఘిక జీవితంలోనే కాదు మనమాటలో, నడకతీరులో, సంస్కృతిలో, సంప్రదాయంలో ఒక్క చోటేమిటిది? వేలకొద్దీ సామెతలు సర్వత్రా వ్యాపించాయి. ఒక సామెత పుట్టిందంటే దాని వెనుక ఎంతో భాగోతం ఉండనే ఉంటుంది. దాన్ని విడమరిచి చెప్పుకొంటేనే కాని దాని సొబగు మనకు తెలిసిరాదు.

'Man is a Social animal' అనీ, 'A Social instinct is implanted in all men by nature' అనీ 'Artistotle అభిప్రాయపడ్డాడు. 'A man's life is often built on a proveb' అన్న అభిప్రాయమూ ఉంది. సామెతలు సాంఘిక చరిత్ర నిర్మాణానికీ, సాంఘిక జీవిత నిరూపణకు ఆధారాలు. ప్రాచీన సంస్కృతికి నిలువుటద్దాలు. సామెతలను ఒక విజ్ఞానఖనితో పోల్చవచ్చు. ప్రజలను

విజ్ఞానవంతులుగా చేసే సామర్థ్యం సామెతలలో దాగి ఉంది.

తెలుగు సామెతలలో సాంఘిక జీవితం ఈ క్రింది విషయాలలో స్పష్టంగా గోచరిస్తుంది.

1. కుటుంబ జీవితం
2. వ్యావసాయిక జీవితం
3. వ్యక్తుల మనస్తత్త్వం
4. జాతులు / వృత్తులు
5. ఆచారాలు, వ్యవహారాలు
6. పండుగలు పబ్బాలు
7. ఆహారం
8. వైద్యం
9. నీతులు / ఉపదేశాలు
10. కర్మసంబంధమైన విషయాలు

సంఘ వ్యవస్థకు కుటుంబాలే ఆధారం. ఆలూమగల సంబంధం వివాహ వ్యవస్థకు దారితీసింది. ఇదే సామాజిక సంబంధం అనిపించుకొంది. 'పడుగుపేకా కలిస్తే బట్ట, ఆలూమగలు కలిస్తే ఇల్లు' సాంసారిక జీవితం పెళ్ళితో మొదలవుతుంది. పురుషార్థాలకు మూలం భార్య. ఆలూమగల ప్రేమానురాగాలు సంసార సుస్థిరతకు ఆలవాలమవుతాయి. ఆడపిల్ల అదృష్టం పండితే మంచిభర్త, అత్తమామలు, ఆడుబిడ్డలు లభిస్తారు. లేకపోతే ఆమె జీవితం నరకయాతనమవుతుంది. అందుకనే అన్నారు. 'పూజకొద్దీ పురుషుడు, దానంకొద్దీ బిడ్డలు' అని. భర్త మంచివాడయితే అది తన పూర్వజన్మ సుకృతమనుకుంటుంది. లేకపోతే త్రన ప్రారబ్ధకర్మమని విలపిస్తుంది. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి శరీయసీ' అన్నారు. 'అమ్మ' అన్న రెండక్షరాలు అమృతపు గుళికలు, అమ్మ విలువ తల్లిలేని పిల్లలకే తెలుస్తుంది. 'తల్లి దైవము, తండ్రి ధనం' తల్లిని నమ్మినవాడు ధరణిని నమ్మినవాడు చెడడు'. 'తల్లిచేస్తే నాలుక చచ్చినట్లు, తండ్రి చస్తే కళ్ళు పోయినట్లు'. అందుకనే 'కన్నతల్లి నీడ, కానుగనీడ' అన్నారు.

పిల్లలు ఇంటి మణిదీపాలు. అలాంటి 'పిల్లలులేని ఇల్లు కందులు గొట్టిన కళ్ళం'. మాతృత్వమనేది స్త్రీకి వరంలాంటిది. సంతానం కోసం ఎందరో దేవుళ్ళను పూజిస్తుంది. 'అశ్వత్థకట్ట ప్రదక్షిణం చేసి కడుపుపట్టుకొని చూచుకొన్నదట' ఒక ఇల్లాలు. సంతానాపేక్ష అటువంటిది మరి. 'పిల్లలు లేని వాళ్ళు రోజూ అశ్వత్థ

వృక్షం చుట్టివస్తే పిల్లలవుతారని మనవాళ్ల విశ్వాసం. ఇది కేవలం మనకు దేవుడి మీదున్న నమ్మకం. ఏ దేవుడు వరమిచ్చినా పెనిమిటి లేందే పిల్లలు పుట్టరు కదా. 'బొమ్మకు మొక్కినా నమ్మకం ఉండాలి' మరి

మన సాంఘిక జీవితంలో వ్యవసాయానికి సంబంధించిన సామెతలు అనేకం. నాగలి ఉన్న ఊళ్ళో ఆకలి చేరదు, రైతు దున్నితే రాజులకు అన్నం', 'చదువుకొన్నవాడికీ సేద్యగాడే అన్నం పెట్టాలి', 'కోటి విద్యలకంటె, కోరుకొని పొలం దున్నడం మంచిది', 'దొరలు ఇచ్చిన పాలుకన్న ధరణి ఇచ్చిన ధాన్యం మేలు' అంటారు వ్యవసాయదారులు.

రైతులు వర్షం మీద ఆధారపడి వ్యవసాయం చేస్తారు. వాళ్ళ నోళ్ళలో వర్షానికి సంబంధించిన సామెతలు అనేకం చోటు చేసుకొన్నాయి. 'వానవుంటే కరువు, పెనిమిటి ఉంటే బీదతనం రాదు' అంటారు. అయితే 'వానరాకడ ప్రాణం పోకడ తెలియవు' అని వాపోతారు. 'ఆరుద్రకురిస్తే దారిద్యం లేద' నీ, 'ఆరికకు చిత్తగండం, ఆడదానికి పిల్లగండం', అనూరాధలో తడిస్తే మనోరోగాలు పోతాయట' అని అనుభవపూర్వకంగా విశ్వసిస్తారు.

'లోకోభిన్నరుచిః' అని ఆర్యోక్తి. 'జిహ్వాకొకరుచి, పుర్రెకొక బుద్ధి' అంటుంది మన తెలుగు సామెత. ఎన్ని నాలుకలున్నాయో అన్ని రుచులు ఉన్నాయి. ఎన్ని పుర్రెలున్నాయో అన్ని బుద్ధులూ ఉన్నాయి. మనిషి మనిషికి శారీరకంగానే కాకుండా మనిషి బుద్ధుల్లోనూ, నడవడికల్లోనూ వ్యత్యాసం కన్పిస్తుంది. భిన్నవ్యక్తులు, వ్యక్తిత్వాలు, మనస్తత్వాలకు సంబంధించిన సామెతలు మన సామాజిక జీవితంలో చోటుచేసుకొన్నాయి.

'నడమంత్రపు సిరికి నెత్తిమీద కళ్ళు'. ఉన్నట్టుండి డబ్బు వస్తే కళ్ళు కనబడవు. చింతకాయలమ్మేదానికి సిరివారమొస్తే టంకిరి బింకిరికాయి ఇదేమికాయి' అన్నదట. 'కలవారింటి ఆడబడుచుకు కాకరకాయ కానరాదు' అంటారు.

'లోభి తాను తినడు, మరొకరికి పెట్టడు'. అందువల్లే 'లోభి బీదకంటె బీడు'గా పరిగణింపబడ్డాడు. 'కలిమిగల లోభికన్నా పేదమేలు'. పేదవాడు

> రైతులు వర్షం మీద ఆధారపడి వ్యవసాయం చేస్తారు. వాళ్ళ నోళ్ళలో వర్షానికి సంబంధించిన సామెతలు అనేకం చోటు చేసుకొన్నాయి.

తనకు లేకపోయినా ఉన్నదాంట్లోనే ఇతరులకు ఇస్తాడు. 'లోభికి ఖర్చెక్కువ, ఏబ్రాసికి పనెక్కువ'. సాధారణంగా లోభి ఖర్చుపెట్టడు. పైసా పైసా పోగు చేస్తాడు. 'Penny wise and pound foolish' అన్నట్టుగా చివరికి ఒకేసారి పెద్దమొత్తాన్ని ఖర్చుపెడ్తాడు. అలాగే ఏబ్రాసి కూడా. సోమరితనంతో ఏబ్రాసి పని చేయడానికి బద్ధకిస్తాడు. ఒకవేళ చేసినా కొంచెం కొంచెం చేస్తాడు. చివరికి పనిపూర్తి చేయడానికి ఎక్కువ శ్రమిస్తాడు. లోభి, ఏబ్రాసుల స్వభావం ఇందులో వ్యక్తమవుతుంది.

పొదుపు ఉంటే సంసారం అదుపులో ఉంటుంది. 'ఎంత చెట్టుకంత గాలి' ఉండాలి. 'ఎంత వెలుగుకు అంత చీకటి' ఉంటుంది కదా! 'మంచమున్నంతవరకు కాళ్ళు చాచుకో' అనడం అందుకే.

'ఉత్తకుండకు ఊపులెక్కువ', 'నిండుకుండ తొణకదు', 'ఏమీలేని ఆకు ఎగసెగసి పడితే, అన్నీ వున్న ఆకు అణిగిమణిగి ఉంటుంది'. ఇవి బడాయి పడేవాళ్ళను గురించే చెప్పే సామెతలు. అందువల్లనే 'బడాయి బచ్చా, కూడులేక సచ్చా' అన్నారు. 'డొలు చూపితే దరిద్రం తీరుతుందా' మరి.

'గురువులేని విద్య గుడ్డివిద్య' అన్నారు. గుడ్డిగా చదివితే అది చదువనిపించుకోదు. బోధించే గురువుండాలి. అలా చదివితేనే 'గురువును మించిన శిష్యుడు' అవడానికి కూడా వీలవుతుంది.

'అల్పవిద్యా మహాగర్వి'. 'Half knowlegde is dangerows' అన్నారు. 'అపండితుని కంటె అర్థపండితుడే అపాయకరం'. 'అల్ప విద్వాంసుడు ఆక్షేపణకు మాత్రమే'

'ఉంటే అమీరు, లేకపోతే ఫకీరు'. వీళ్ళు డబ్బును దుబారా చేసే మనుష్యులు. వీళ్ళకు 'ఉంటే ఉగాది, లేకపోతే ఏకాసి', 'ఉన్ననాడు ఉట్లపండగ, లేనినాడు లొట్ల పండుగ' ఉన్నదంతా ఖర్చుపెట్టి ఉపవాసం ఉండడానికైనా వీళ్ళు సిద్ధమే.

'సాక్షి కాళ్ళు పట్టుకోవడం కన్నా వాది కాళ్ళు పట్టుకోవడం మేలు'. ఇది సాక్షుల మీద సమాజంలో ఉన్న అవిశ్వాసాన్ని తెలియజేస్తుంది. వ్యాజ్యాలలో సాక్షిని నమ్మడానికి వీల్లేదు. సాక్షి ఏనాటికైనా 'గోడమీది పిల్లివాటం'

'బాలజ్యోతిష్యం, వృద్ధవైద్యం' అంటారు. శాస్త్రాన్ని ఆధారంగా చేసుకొని చెప్పే జ్యోతిష్యం, అనుభవాన్ని ఆధారంగా చేసుకొని చేసే వైద్యం రాణిస్తాయి. చిన్నతనం నుంచి జ్యోతిష్యం చెప్పేవాళ్ళు శాస్త్రాన్ని అనుసరించి, అధ్యయనం చేసి చెప్తారు. అలాగే వయస్సు మళ్ళినవాళ్ళు తమ అనుభవసారంతో వైద్యం చేస్తారు.

ఇది ఉన్న విషయం. అలాగే 'బాపన సేద్యం బాలవైద్యం' అన్న సామెత కూడ. బ్రాహ్మణులు వ్యవసాయం చేయడానికి పనికిరారని ప్రతితి. అలాగే చిన్నపిల్లలు వైద్యం చేయడానికి పనికిరారు రెండింటికీ అనుభవం చాలా కావాలి. అనుభవం మీదనే వైద్యం చేయడానికి వీలవుతుంది. అలాగే వ్యవసాయం కూడ.

> వధువుతో పాటు వరుడు ఏడడుగులు నడవడాన్ని 'సప్తపది' అంటారు. నూతన దంపతుల మధ్య విడదీయరాని సంబంధాన్ని ఏర్పరచడమే దీని ప్రధాన లక్ష్యం.

'కొత్త వైద్యునికంటే పాతరోగి మేలు' పాతరోగికి మందూ మాకుల విషయం బాగా తెలిసే ఉంటుంది. అవసరమైతే కొత్త వైద్యునికే నేర్పగలడు. 'వైద్యుని పేరు చెప్తే రోగాలు పోతాయా?' మందూ మాకు తింటే గాని విష జ్వరాలు నయం కావు. వైద్యం చేయడానికి వైద్యుడెంత అవసరమో రోగాలు నయం కావడానికి ఔషధాలు అంతే అవసరం. కొంతమంది నాటువైద్యులు అన్నిరోగాలకు వాతలు పెడతారు. అందుకనే ఒక సామెత 'అన్ని రోగాలకూ వాతలు వేసే వైద్యుణ్ణి అవతల ఉంచు' అని సలహా ఇస్తున్నది.

ఆచారాలు, సంప్రదాయాలు, ఒక్కో కులానికి ప్రత్యేకంగా ఉంటాయి. కొన్ని సామూహికంగా ఉంటాయి. నమ్మకాలు, విశ్వాసాలు సాధారణంగా మన సమాజంలో అందరికీ వర్తిస్తాయి. సమానంగా ఉంటాయి. వివాహ సమయాలలో ఆచారాలకు, సంప్రదాయాలకు అంతులేదు, అంతం లేదు. కూర్చుంటే ఒక ఆచారం, లేస్తే మరో ఆచారం.

వధువుతో పాటు వరుడు ఏడడుగులు నడవడాన్ని 'సప్తపది' అంటారు. నూతన దంపతుల మధ్య విడదీయరాని సంబంధాన్ని ఏర్పరచడమే దీని ప్రధాన లక్ష్యం. సప్తపది సమయంలో వధువు 'సన్నెకల్లు' మీద కాలుపెట్టి త్రొక్కుతుంది. సన్నెకల్లు మీద కాలుపెట్టడం ఒక ఆచారం. ఇది దీర్ఘ సుమంగళీత్వాన్ని ఆశించడానికోసం చేసే ఆచారం. వధువు రాయిలాగా తన్ను ఎదుర్కొనేవాళ్ళను ఎదుర్కొనాలనీ, వరుడు కూడా రాయిలాగానే పటిష్టంగా ఉండాలని దీని అంతరార్థం. "సన్నెకల్లు దాచితే పెండ్లికాదా?" అన్న సామెత సన్నెకల్లు మీద ఉన్న విశ్వాసాన్ని తెలియజేస్తుంది. సన్నెకల్లు దాచినంతమాత్రానికే వివాహం నిలిచిపోదన్న విషయాన్ని చెప్పక చెప్తోంది.

'పాపిట వంకరైతే బ్రతుకువంకర'. సీమంత సంస్కారాన్ని పురస్కరించుకొని ఈ సామెత బయల్దేరింది. సీమంత సమయంలో గర్భిణి తలదువ్వి పాపిట తీయడం ఒక ఆచారం. పాపిట వంకరగా తీస్తే బ్రతుకుకూడ వంకరవుతుందని చెప్పడం ఒక విశ్వాసం.

తీతువు కూస్తే ఉపద్రవం సంభవిస్తుందన్న నమ్మకం మనలో ఉంది. 'హేతువు లేకుండా తీతువు కూయదు'. కారణం లేక కార్యం పుట్టదు కదా! అలాగే ఏదో చెప్పరాని ఆపద సంభవిస్తున్నప్పుడు ప్రకృతిలోని వస్తువులు, జంతుజాలాలు వాటిని సూచిస్తాయని మన విశ్వాసం.

'పిల్లి ఎదురైతే తల్లి అయినా శత్రువవుతుంది'. ఏదైనా కార్యార్థమై బయల్దేరినప్పుడు పిల్లి అడ్డంగా రాకూడదంటారు. అది రాబోయే అనర్థాన్ని సూచిస్తుంది. 'తల్లి మించిన దైవము లేదంటాము. అలాంటి తల్లికూడా పిల్లి ఎదురుగా వస్తే శత్రువవుతుందన్న విశ్వాసం ఉంది. అందుకనే సాధారణంగా పిల్లి అడ్డం వస్తే కాసేపు కూర్చుని బయల్దేరుతాము. లేదా ఆ పూటకు ఆ ప్రయాణం మానుకొంటాము.

అనుభవాల్లోంచి ఊడిపడ్డవే నీతులు, ఉపదేశాలూ. కథల్లోని నీతులు, అనుభవాల్లోంచి వచ్చిన నీతులు, ఉపదేశాలుసామెతల్లాగా రూపొంది హెచ్చరికలుగా పనికి వస్తున్నాయి.

'దుష్టుడికి దూరంగా ఉండు'. 'దుష్టుడు కలహించడమంతా శిష్టులకే మేలు' ఇవి నగ్నసత్యాలను బయటపెడ్తున్నాయి. 'ఇద్దరూ పోట్లాడితే మూడోవాడికి లాభం', 'పులిని చూచి నక్క వాతపెట్టుకొన్నట్లు', 'పోరునష్టి, పొందులాభం' - ఇలాంటి సామెతలన్నీ, సంఘ జీవనంలో, మన నిజ జీవితంలో పాతుకుపోయిన నీతులు, ఉపదేశాలు.

'బుద్ధిః కర్మానుసారిణీ' కర్మను అనుసరించి బుద్ధి ఉంటుంది. అందువల్లనే తానొకటి కలిస్తే దైవమొకటి తలుస్తుంది' అంటారు.

> 'పిల్లి ఎదురైతే తల్లి అయినా శత్రువవుతుంది'. ఏదైనా కార్యార్థమై బయల్దేరినప్పుడు పిల్లి అడ్డంగా రాకూడదంటారు. అది రాబోయే అనర్థాన్ని సూచిస్తుంది.

'జాతస్యమరణం ధ్రువమ్' 'తలవ్రాలు తప్పించుకోరానిది', 'నొసటి మీద వ్రాసిన వ్రాత నులిమితే పోతుందా', 'నూరేండ్లు చింతించినా నొసటివ్రాతే గతి', 'నుదుట వ్రాయనిదే నోట పలుకదు', 'నాడు వ్రాసినవాడు నేడు చెరిపి మళ్ళీ వ్రాస్తాడా' - ఇవన్నీ అనుభవసత్యాలు. ఏది ఎలా జరగాలో అలా జరగాల్సిందే, దానికి అడ్డులేదు. తప్పదు.

'కర్మకంతం లేదు, కాలానికి నిశ్చయం లేదు', 'నర్మదలో మునిగినా కర్మం తప్పదు', 'కాశికి పోయినా కర్మ తప్పలేదు', 'పాపి సముద్రానికిపోయినా అరికాలు తేమకాలేదు', 'రామేశ్వరానికి పోయినా శనేశ్వరం తప్పలేదు' - ఇవన్నీ కర్మకు సంబంధించినవే. క్రిందటి జన్మలో చేసుకొన్న పాప పుణ్యాలను బట్టి ఈ జన్మలో మంచి చెడ్డలుంటాయి. మోక్షమే కర్మకు అంతం. అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మశుభాశుభమ్'

ఇలా చెప్తూపోతే మన సాంఘిక జీవితంలో ఎన్నో సామెతలు నిలద్రొక్కుకున్నాయి. సామెతలలో సాంఘిక జీవితం, సాంఘిక జీవితంలో సామెతలు ఒకదానికొకటి పెనవేసికొన్నాయి. సామెతలు సమాజాన్ని ప్రతిబింబించే నిలువుటద్దాలంటే అతిశయోక్తి ఏమాత్రం లేదు. అంతులేని భావాలను, అనుభవాలను, సామెత మనకు అందిస్తుంది. అనుభవసారాన్ని తెలిపే సామెతలు కూడా సమాజాధ్యయనానికి, అభ్యుదయానికి ఒక సాధనమనే విషయాన్ని మనం గ్రహించాలి. ఏమైనా 'తెలుక్కి సామెత, అతిథికి ఆమెత' అన్న నానుడి మన జాతి సంస్కృతిలో విడదీయరాని అంశంగా ఉందనడంలో సందేహం లేదు.

## ఉపయుక్త గ్రంథ సూచి:


**మోహన్, డాక్టర్ జి.ఎస్**

1. జానపద విజ్ఞానవ్యాసావళి, 1981
2. కన్నడ తెలుగుగాదెగళు-సమానార్థకళు (కన్నడం), 1977
3. సామెతలలో సాంఘిక జీవితం, 1983
4. జానపద విజ్ఞానాధ్యయనం, 2001, 2010

# జానపద శ్రామిక గేయాలు



ఆచార్య డి.వి. శ్రవణ్ కుమార్
94926 34686

తరతరాలుగా మౌఖిక సంప్రదాయంలో లభించే సాంప్రదాయిక విజ్ఞానమే జానపద విజ్ఞానం. ప్రాచీన మానవ సంస్కృతిని పరిశీలించడానికి జానపద విజ్ఞానాధ్యయనం దోహదపడుతుంది. ఈ జానపద విజ్ఞానాన్నే ఆంగ్లంలో Folk Lore అని అంటారు. ఈ పద సమాసాన్ని మొట్టమొదటిసారిగా విలియం జాన్ థామ్స్ ప్రయోగించారు. రిచర్డ్ ఎం డార్సన్ జానపద విజ్ఞానాన్ని నాలుగు శీర్షికలుగా విభజించాడు. అవి:

1. మౌఖిక జానపద విజ్ఞానం : ఇందులో జానపద గేయాలు, కథా గేయాలు, జానపద పురణాలు, ఐతిహ్యాలు, గద్య కథలు, సామెతలు, పొడుపు కథలు, మాండలికాలు, నుడికారాలు, తిట్లు, ఒట్లు మొదలైనవన్నీ చేరుతాయి.

2. సాంఘిక జానపద ఆచారాలు : పుట్టుక, వివాహం, మరణం మొదలైన వాటికి చెందిన ఆచార వ్యవహారాలు, కుటుంబ సంబంధ బాంధవ్యాలు, పండుగలు, వినోదాలు, ఆటలు, జానపద వైద్యం, మతం, నమ్మకాలు వంటివన్నీ ఇందులో చేరతాయి.

3. వస్తు సంస్కృతి : భౌతిక జీవితానికి సంబంధించిన అన్ని వస్తువులు ఈ విభాగంలో చేరతాయి. చిత్రకళ, శిల్ప, వాస్తుకళ, వివిధ వృత్తులకు సంబంధించిన పరికరాలు, దుస్తులు, అలంకరణలు, ఆభరణాలు, ఆహార సామాగ్రి, పూజా సామగ్రి, శిలా విగ్రహాలు, దారు విగ్రహాలు వంటివన్నీ ఇందులోనే చేరతాయి.

4. జానపద కళలు : సంగీతం, నృత్యం, అభినయం ఉండే ప్రదర్శన కళలన్నీ ఈ విభాగంలో చేరతాయి. గాత్ర సంగీతం, వాద్య సంగీతం, తోలుబొమ్మలాటలు, కొయ్య బొమ్మలాటలు, యక్షగానం, వీధి భాగోతం, కోలాటం, పగటి వేషాలు, బహురూపులు, గారడీ విద్యలు వంటివన్నీ ఇందులో చేరతాయి.

> నిరక్షరాస్యులైన జానపదులు అప్రయత్నంగా తమ సహజ భావాలను కవిత్వ రూపంలో వెలువరించే ఆశుకవిత్వమే జానపద కవిత్వం.

1. సుందరం. ఆర్వీయస్, ఆంధ్రుల జానపద విజ్ఞానం, పుట: 5, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్, 1992

ఈ విభజనలో మొదటిదైన మౌఖిక జానపద సాహిత్య శాఖలో జానపద కవిత్వం, గద్యకథనాలు, సామెతలు, పొడుపుకథలు వస్తాయి. జానపద సాహిత్యంలో విస్తృతంగా లభించిన, అధిక జనాదరణ పొందింది జానపద కవిత్వం. ఈ జానపద కవిత్వ శాఖలోనే జానపద గేయాలు, కథా గేయాలుగా విభజించవచ్చు. జానపద కవిత్వంలో ప్రధానంగం జానపద గేయాలు. జానపద గేయాలు కూడా జానపద సాహిత్య ప్రధాన లక్షణమైన ఆశు రచనలే. ఇవి మౌఖిక సంప్రదాయంలో జీవిస్తాయి.

మనిషి నోట మొదటగా వెలువడిన పాట ఎటువంటిదో చెప్పడం కష్టతరమే. పనికి, పాటకు ఉన్న సంబంధాన్ని బట్టి మొట్టమొదటగా పనిపాటలే వెలువడి ఉండవచ్చని ఆచార్య ఆర్వీయస్ సుందరం గారు తన 'ఆంధ్రుల జానపద విజ్ఞానం'లో తెలిపారు. ఆదిమ మానవుడి ప్రధాన వృత్తి వేట. వేటాడిన తర్వాత, వేట వలన కలిగిన భావోద్వేగంతో నృత్యాలు చేస్తూ మాట్లాడిన భాష లయబద్ధంగా ఉండి ఉండొచ్చని ఊహించారు. గేయాలు ప్రధానంగా లయబద్ధమైనవి. ఒకే పరిమాణం గల కొన్ని అక్షర సమూహాలను ఒక క్రమంలో వాడటం వల్ల, మాటల్లో కొన్ని అక్షరాల మీద ఉనికి వల్ల, మాటకీ మాటకీ మధ్య ఉన్న విరామం వల్ల లయ ఏర్పడుతుంది.

నిరక్షరాస్యులైన జానపదులు అప్రయత్నంగా తమ సహజ భావాలను కవిత్వరూపంలో వెలువరించే ఆశుకవిత్వమే జానపద కవిత్వం. పనిపాటలు చేసుకునేటపుడు కలిగే శ్రమను మర్చిపోవడానికి, తమకు కలిగే సంతోషం, విషాదం, కరుణ, శృంగార భావాలను వ్యక్తం చేయడానికి, తీరిక సమయాల్లో, వేడుకల్లో, జాతరల్లో పాడుకునే పాటలు, కథా గేయాలు జానపద కవిత్వ వర్గీకరణలో చేరతాయి. భావ ప్రకటనే పరమార్థంగా వెలువడే కవిత్వం కాబట్టి

ఛందోబంధాలు, అలంకార సంప్రదాయాలు జానపద కవిత్వానికి అడ్డురావు. మౌఖిక వ్యాప్తి, ఆశు రచన, లతబద్ధత, పాద విభజన స్పష్టత, కాలానికి కట్టుబడకపోవడం వంటి లక్షణాలు జానపద కవిత్వానికుంటాయి.

## శ్రామిక గేయాలు:

నాయని కృష్ణకుమారి గారు తమ 'తెలుగు జానపద గేయ గాథలు' గ్రంథంలో చేసిన వర్గీకరణ ప్రకారం గేయశాఖలో కథారహితం, కథా సంహిత అనే రెండు భాగాలుంటాయి. కథా రహిత భాగంలో మళ్ళీ శ్రామిక గేయాలు, పారమార్థిక గేయాలు, కౌటుంబిక గేయాలు అని మూడు విభాగాలున్నాయి. ఇందులో శ్రామిక గేయాలని విశ్లేషించే దిశగా ఈ వ్యాసం ఉంటుంది. పనిపాటలు చేసుకునే రైతులు, కూలీలు, కార్మికులూ పాడుకునే జానపద గేయాలు శ్రామిక గేయాలు. కొందరు వీటినే పనిపాటలు అని కూడా అంటారు. తెలుగు పనిపాటల్లో ముఖ్యంగా చెప్పదగినవి కర్షక గేయాలు. వీటినే పొలం పాటలని కూడా అంటారు. వానదేవుణ్ణి ప్రార్థించడం మొదలుకుని అన్ని పనులు ముగించుకుని ఇంటికి వెళ్ళేవరకు రైతులు అనేక రకాలైన పాటలు పాడుకుంటారు. వానపాటలు, ఏరువాక పాటలు, ఏతాము, మోట, కపిల పాటలు వంటివన్నీ రైతుకి, రైతుకూలీకి తమ పనిలో దోహదపడేవే.

## ఏతం పాటలు :

బావిలో లేదా చెరువులో నిలిచి ఉండే నీళ్ళను ఎత్తున ఉన్న భూమికి పారించడానికి ఉపయోగపడేది ఏతం. ఏతం వేసి నీళ్ళు తోడేటపుడు రైతులు పాడుకునే పాటల్ని ఏతం పాటలని అంటారు. కర్ర, తాటినార, తోలుతో చేసిన సంచి, ఇనుముతో చేసిన బాన ఏతానికి ఉపయోగించే వస్తువులు. పొడవైన కొయ్య ఒకదాని చివరన ఒక పెద్ద బాన కట్టి ఉంటుంది. ఒక చివరన ఒక వ్యక్తి నిలబడిన ఆ కొయ్య మరొక చివరికి వెళ్ళగానే బాన బావిలోకి వెళుతుంది. తిరిగి ఈ చివరకు రాగానే నీటితో నిండిన బాన పైకి వస్తుంది. ఆ బానలోని నీటిని కాలువలోకి పొర్లించి నీటిని వ్యవసాయ భూమిలోకి పారేల చేస్తారు. నీటిని తోడే ఈ ప్రక్రియనే 'ఏతాం తోడటం' అంటారు. ఏతంతో నీరుతోడి ఎన్నో పాట్లు పడిన రైతు కష్టాలు వివరించే కరుణారసాత్మకమైన శ్రామిక గేయం ఏతం పాటను పరిశీలిద్దాం.

"ఏటి కేతం బెట్టి ఎయి పుట్లు పండించి
ఎన్నడూ మెతుకెతుగరన్నా
నేను గంజిలో మెతుకెరగరన్నా ఏటి)
కాల్జేయి కడుక్కొని కట్టమీద గూసుంటే
కాకి దన్నీ పాయెరన్నా
కాకిపిల్ల దన్నీ పాయెరన్నా (ఏటి)
పోరుకూ చాల్లేక పోయికాడ కూసుంటే
పోరి తన్నీ పాయె రన్నా
పోరి తల్లో తన్నీ పాయెరన్నా (ఏటి)
చుక్క పొద్దున లేచి బొక్కెనెత్తుకపోంగ
బొక్కబోర్లా పడితిరన్నా
నేను పక్కలిరుగా పడితిరన్నా
నాదేటి బతుకాయెరన్నా
నేను నాడె చావకపోతిరన్నా" (ఏటి)

పంట పండించే రైతు లేదా రైతు కూలి పాడే పాట ఇది. ఒక బడుగు రైతు తన పొలంలో కష్టపడి సేద్యం చేసి పుట్లకొద్దీ ధాన్యం పండిస్తాడు. రెక్కలు ముక్కలు చేసుకుని శ్రమించినా అతనికి దక్కే ప్రతిఫలం చాలా తక్కువ. వెయ్యి పుట్లు పండించినా అతడికి గంజిలో మెతుకు కన్పించని దీనావస్థ. దేశంలో రైతు దీనస్థితికి దర్పణం పడుతుంది. వరి పండించే రైతు వరి అన్నం తినలేని పరిస్థితిని ఈ గేయం తెలియజేస్తుంది. అంతేగాకుండా తన పేదరికం వల్ల తోటి వారినుండి, లోకుల నుండి, చివరికి తన భార్యా పిల్లల నుండి కూడా గౌరవం లభించకపోవడం ఈ పాటలో గమనించవచ్చు. సంపాదన లేని వాడంటే ఇంట్లోని వారిక్కూడా లోకువేనన్న నగ్నసత్యం ఈ శ్రామిక గేయం ద్వారా వ్యక్తమవుతుంది. ఈ పాటలో కొంత ప్రతీకాత్మక లక్షణం కూడా ఉంది. ఇక్కడ కాకి అంటే లోకులకు ప్రతీక. చిన్నా, పెద్ద తారతమ్యం లేకుండా లోకులు కాకుల్లా వేధించే వ్యక్తులుగా ప్రతీకాత్మకంగా ఇందులో చెప్పబడింది. ప్రతి పదంలోనూ రైతు బాధల్ని వ్యక్తం చేసే ఈ గేయం కరుణ రసాత్మకంగా సాగింది.

## కపిల పాటలు:

పనిపాటల్లో కపిల పాటలు కూడా ప్రాముఖ్యతని సంతరించుకున్నాయి. తెలుగునాట రాయలసీమలో నదీ జలాలు తక్కువగా ఉండటం వల్ల రైతులు వ్యవసాయానికి అవసరమైన నీటికోసం బావులపై ఎక్కువగా ఆధారపడేవారు. ఈ ప్రాంతంలోని బావులు రెండు రకాలుగా ఉంటాయి. అవి దిగుడు బావులు, చేద బావులు. వ్యవసాయానికి అవసరమైన నీటిని కపిల సాయంతో తోడుతూ రైతులు పాడుకునే పాటలను కపిల పాటలని అంటారు. రైతు పొలానికి నీళ్ళు పెట్టడానికి ఉదయాన్నే పొలం వెళ్ళి ఎద్దుల సాయంతో కాడి కడతాడు. కాడికి ఒక పెద్ద తాడును కపిల సాయంతో బావిలోకి దించి నీటిని తోడి బాన ద్వారా కాల్వలోకి పారిస్తాడు. ఈ బానను ఎద్దు చర్మంతో తయారు చేస్తారు. ఒక ఇనుప కమ్మీని గుండ్రంగా వలయాకారంలో ఏర్పరచి, దాని చుట్టూ ఎద్దు చర్మం కడతారు. దీని సాయంతో నీరు తోడుతారు. ఈ కపిల తోడేందుకు ఇద్దరు వ్యక్తులు అవసరమవుతారు. ఈ విధంగా కపిలతో నీరు తోడే సమయంలో శ్రమను మర్చిపోవడానికి రైతులు కపిల పాటలు పాడుకుంటారు. శృంగార, హాస్య రసాల్ని ఈ పాటల ద్వారా వ్యక్తీకరిస్తారు.

"అలికి పూసి నింటిలోన కలికి కుచ్చులు కమ్మిడేసి
అలక తేరెజాము
కలా అవ్వగారికోడి కూసె.... ఔరా
అత్తమామ లేనిదాన ఇత్తనాలు ఇత్తుదాము
వజ్రాల వాన కురిసె పగడాల పంట పండె
ఎద్దు ఎల్లె ఉండావు, బిడ్డలేల లేవు
ఏమి చేతురా మామ కొడుకా, పొలము అందలేదు
కల్లూరు కట్టె కింద కలుపు నువ్వు తెస్తా ఉంటే
ఇరుకు దీసి జానెడైతే నా కన్నె పాయము నీకు ఇస్తా
స్oత చేస్నుకు సరుతులేల, గొడ్డుమానికి గొడ్డలేల
మీసము లేని మనిషికి పెండ్లి ఏల, నువ్వే చెప్పరా....
గూడు మీద గూడు కట్టె గరిగి చేను కావిలిచ్చి
గూడు చూసి పోతవేమే మంగలోల్ల చిన్నదానా

చుక్కబొట్టు నే బెట్టుకుని, సున్నమడగ నేను బోతే

వాడు చూసిన చూపులాకే ఆ చుక్కబొట్టు సున్నమాయె....."

అంటూ శృంగార రసభరితంగా, కాస్త హాస్యరస స్ఫోరకంగా పాటలు పాడుకోవడం గమనించవచ్చు.

## మోటపాటలు:

అదే విధంగా మోట కొట్టుకుని జీవించే ఒక జానపద స్త్రీ తన ప్రియుడి గురించి శృంగార, కరుణ రసాల్తో తన భావాలు వెల్లడించే ఒక శ్రామిక గేయం పరిశీలిద్దాం. ఈ గేయంలో మోటకు సంబంధించిన వర్ణన కనిపిస్తుంది. రాయలసీమలో కపిల పాటలుగా పిలిచే పాటల్ని, తెలంగాణలో 'మోట పాటలు' అంటారు.

"చింత కిందిరో మోట వాడరా

చిగురు యామంచి ఎడ్ల జోడోయీ

నీ ఎద్దుల మెడమీద మదిర కాడోయీ

నీ ఎద్దుల మెడకున్నా బద్దె పలుపోయీ

నీ వలుపాటి ఎద్దూరా వన్నెలాడోయీ

దాపాటి ఎద్దోయీ ధర్మరాజోయీ

వలుపాటి దారోయీ పిల్ల బాటోయీ

దాపాటి పేరోయీ ఆకు తీగోయీ

మోకు పేరోయీ ఆకు తీగోయీ

దండెడ తాడోయీ పెంజర గున్నోయీ

తొండపుడతాయో కిన్నెర తీగోయీ

మోట పేరోయీ మొగిలిగుమ్మోయీ

బిళ్ళ పేరోయీ భీమ రథమోయీ

కదురు పేరోయీ కన్నెలాడోయీ

బొక్కెన పేరోయీ బొడ్డు గిన్నోయీ

న్ను జూడరో నీళ్ళ కొస్తిరా

ళ్ళూ లేవురా నీవు లేవురా

క్కడ జూచినా ఎవరూ లేరోయీ

ప్పరాని దుఃఖమొచ్చేనూ

టిశోకము కడవ నిండేనూ

డవల నీరోయ మడువ సాగేనూ

మడూవ మలిపే మామ కొడుకూరా....."

అంటూ ఒక జానపద స్త్రీ తన మామకొడుకు లేదా ప్రియుడి కోసం మోట కొట్టే ప్రాంతం దగ్గర పాడుకునే పాటగా కనిపిస్తుంది. ఒక చింతచెట్టు కింద ఉన్న మోట బావి దగ్గరకు నీళ్ళు తీసుకురావాలన్న నెపంతో ఒక జానపద స్త్రీ తన ప్రియుడి కోసం వస్తుంది. అయితే అక్కడ అతడు కనిపించలేదు. నీళ్ళూ లేవు. తన ప్రియుడి కోసం విరహంతో పిలుస్తూ, ఆక్రోశిస్తూ పాడుకున్న ఈ పాటలో భావ సంపద పుష్కలంగా కనిపిస్తుంది. ఈ పాటలో వాడిన ఉపమా సామగ్రి అంతా జానపదుల జీవితాల్లో చాలా సహజమైనవి, వాళ్ళకు అనుభవ పూర్వకమైందిగా ఉంటాయి. ఈ పాటలోని శృంగార భావనలో కన్నీటి ప్రసక్తి ఉన్నంత మాత్రాన ఇది కన్నీటి పాట కాదు. ఆ జానపద స్త్రీలోని కొంటెతనానికి, మాటకారి తనానికి నిదర్శనం ఈ పాట. ఆవిడ గడుసుతనంతో చేసిన ఎత్తిపొడుపులు ఈ గేయంలో కనిపిస్తాయి. ఒక మంచి మోట వాతావరణానికి అనుకూలంగ, రాగయుక్తంగా ఆ శ్రామికుల నోట ఈ పాట వెలువడింది. ఇందులో రాగం, పాటను పేర్చడం చాలా పొందికగా ఉంటాయి.

## ఆహార సేకరణ పాట :

గిరిజన సంచార జాతికి చెందిన యానాదులు ఆంధ్రప్రదేశ్లో ఎక్కువగా తీర ప్రాంత ప్రదేశంలో కనిపిస్తారు. నెల్లూరు వంటి తీర ప్రాంతంలోనూ యానాదులు అధిక సంఖ్యలో ఉన్నారు. యానాదులు ఆహారాన్ని సంపాదించుకుంటూ తమ శ్రమను మరిచిపోవడానికి పాడుకునే 'ఏనాది పాట' కూడా ఒక శ్రామిక గేయం. ఈ పాట వారి ఆహార సేకరణకి సంబంధించింది. ముఖ్యంగా రోడ్లు వేసే పని చేస్తున్నప్పుడు, మట్టి తవ్వకాలు సాగిస్తూ ఈ పాట పాడినట్లు కనిపిస్తుంది.

"చించెరువు కట్ట కిందా - చిన్నాయన బాయికాడ

అద్దవో కుందేలి - అనుగూడ కుందేలి

| | | |
|---|---|---|
| రెడ్డెబ్బ పొదలోనా | - | లేసిందే కుందేలి |
| టంగెత్తీ బయటెయ్యా | - | టంగుపారెత్తి బయటెయ్యి |
| ఎర్రబండల్లో | - | ఎలికలున్నాయి |
| తొవ్వకుందాం | - | రాయె చిన్నదాన |
| టంగెత్తీ బయటెయ్యా | - | టంగుపారెత్తి బయటెయ్యి |
| గడ్డ తొవుతుంటె | - | బిడ్డ పుడుతుంటె |
| తేనె తీస్తుంటె | - | సెయ్యి నాకుతుంటె....." |

అని సాగుతుంది ఈ గేయం. ఇందులో ఉన్న ప్రధాన భావం ఆహార సంపాదనకు సంబంధించింది. కోస్తాంధ్ర ప్రాంతంలో బాగా ముసలి వాళ్ళను పెద్దాయన అనీ, నడి వయస్కులని చిన్నాయన అని పిలవడం కద్దు. ముఖ్యంగా గ్రామాల్లో మోతుబరులని ఇలా పిలుస్తుంటారు. ఈ గేయంలో 'టంగు' అంటే పార, 'టంగుపార' అంటే గడ్డపార లేదా పలుగు అని అర్థం. తవ్వకానికి సంబంధించిన పనిముట్లతో కాలువలు తవ్వేటప్పుడు పాడే శ్రామిక గేయంగా దీన్ని భావించవచ్చు. యానాదుల ఆహార విషయాలైన కుందేళ్ళు, ఎలుకలను పట్టడం, తేనె పట్టుల్ని పిండటం వంటి ఆహార సేకరణ సంబంధమైన విషయాలు ఈ గేయంలో ప్రస్తావించబడ్డాయి. యానాదుల జీవితాలకు సంబంధించిన సహజ చిత్రణ ఈ పాటలో కనిపిస్తుంది.

### కన్నీటి పాట :

కరుణ రసాత్మక భావ చిత్రణకు దర్పణం పట్టే మరొక శ్రామిక గేయం 'కన్నీటి పాట' లేదా 'స్మృతి గేయం' గా చెప్పవచ్చు. ఒక జానపదుడు ఒక చనిపోయిన భార్యను తలచుకుని విలపిస్తూ పాడిన పాట ఇది.

"సుద్దబొందల కాడ
సుద్ది దియ్యంగానే
సద్ది తిన్నట్టాయెనే సిలకా - సిన్నారి సిలకా
ఇంత తొరగా ఎడబాపెనే సిలకా
ఎంత పాపపు దేవుడే సిలకా
సమర్తయై నవ్వు సాటుకు కూకుంటే
సత్తెబామా వందురే సిలకా - సిన్నారి సిలకా

పసవామై నువ్వట్టా పందిట్ల కూసుంటె

పార్వతీ దేవందురే సిలకా - సిన్నారి సిలకా

.................

ఇద్దరమూ తినేటి ఆ బొడ్డు గిన్నెలా

ఒక్కనికి ఒకరాయెనే సిలకా - సిన్నారి సిలకా

ఇద్దరము కప్పేటి మద్ది కాయల దుప్పటి

ఒక్కనికి ఒనరాయెనే సిలకా - సిన్నారి సిలకా"

అని సున్నపు బట్టీల దగ్గర సున్నపు రాయిని తీసే పని చేసుకునేటపుడు పాడే శ్రామిక గేయంగా భావించవచ్చు. చనిపోయిన తన భార్యను తలచుకుంటూ జానపదుడైన భర్త విలపిస్తూ పాడుకున్న గేయంగా ఇది కనిపిస్తుంది. జానపదుడు తన భార్య స్మృతిలో సమర్త అయిన నాటి నుండి సంఘటనలు గుర్తుచేసుకుంటూ, తమ జీవితంలోని రసరమ్య ఘట్టాలను కరుణ రసాత్మకంగా పాడుకుంటున్నాడు. జానపద స్త్రీలు పెళ్ళి తర్వాత కూడా వ్యక్తురాలవడం గమనిస్తే, చిన్న వయసులోనే పెళ్ళి జరిగినట్లు భావించవచ్చు. ఆనాటి సమాజంలో బాల్య వివాహాలు అరగడం అందరకూ తెలిసిన విషయమే.

## వ్యవసాయ పనుల పాటలు :

వ్యవసాయానికి సంబంధించిన నాట్లు, కలుపులు, కోతలు మూడు ప్రధానమైన పనులు. నాట్లు వేయడం ఒక సామూహిక శ్రమ. ఈ సందర్భంగా పాడే పాట కూడా సమూహంగానే పాడుకుంటారు. ఈ పనులు ఎక్కువగా మహిళలే చేస్తుంటారు. శ్రమ చేస్తూనే తమ కోరికలను వెల్లడిస్తుంటారు.

"ఇడదీసి వరి మొక్క లెడమెడముగ పాతండీ

బాధనక బందనక పాటు పడినామంటే

మారాజు పని చూసి మనకీనామిస్తాడు

ఆ వూరి మారాజు ఐదణాలిస్తేను

ఈ వూరి మారాజు ముప్పావులిస్తాడు....."

అని తమ కూలీ పెంపుదల కోసం జానపద మహిళలు పాడుకుంటారు.

పొలంలో కలుపు తీయడంలో కూడా స్త్రీలే పనిచేస్తారు. ఎంతో ఓర్పుగా, నేర్పుగా చేయాల్సిన పని ఇది. ఈ పనిలో వరి మొక్కలపై కాలు పడకుండా చాలులోనే జాగ్రత్తగా అడుగులు వేస్తూ పాదు దగ్గర ఉన్న కలుపు మొక్కల్ని ఏరి వేయాలి. పనిలో దిగేసరికి ఒక క్రమ పద్ధతి సమిష్టిగా ఏర్పడుతుంది. కదలికలన్నీ

ఒకే విధంగా మారిపోయి ఎవరో ఒకరు పాటను మొదలుపెడ్తారు. వెంటనే అందరూ స్వరం కలుపుతారు. ఈ పాటతో పనివేగం కూడా పెరుగుతుంది.

"పొలాల గట్టు కాడ పోచవ్వకు మొక్కి
కలుపుదీయ దిగుతాము కామాక్షిన్ రాయె
చేలోకి పోవాలె చింగులు చెక్కి

కలుపులు తీయాలె కామాచ్చి రాయె....."2 అని పాడుతూ కలుపు పనులు చేస్తారు.

2. రఘుమారెడ్డి ఎల్దండ, పల్లె పదాలతో ప్రజా జీవనం పుట, 146, 1976

పొలాలు కోతలకు వచ్చినప్పుడు జానపద స్త్రీలు కోతలు కోస్తూ కష్టపడతారు. కొడవళ్ళతో కోస్తున్నప్పుడు కాళ్లకంటే చేతులకే పని ఎక్కువ. అడుగుల శబ్దం, వరి కోస్తున్న కొడవలి శబ్ధం, కోసిన వరి కట్టలను వెనక్కి వేసేటపుడు కలిగే శబ్ధం పాటకు ఒక విధమైన లయను కల్గింపజేస్తుంది. ఈ సందర్భంగా పాడే ఒక పాట,

"కొయ్యం డల్లా కొయ్యండి
కోసి ఒణుపూలెయ్యండి
వానల వరదల వంగిన సేను
తిన్నగ దీసి మొదలు కోసి
పనలన్నీ నీ పంజెట్టావా
గింజలు, బందలు పడిపోకుండ
పొందుగ వెన్నులు కోయండల్లా
కాలం సూత్తె శీతాకాలం
కొడవలి పాటు జాగ్రత్తా
కాలు సెయ్యా ఆడితేనే
కుండలో కూడు కనిపిస్తాది....."3

3. ఎల్లోరా, జానపద సాహిత్యం, పుట. 266, 1982

ఈ విధంగా వ్యవసాయపు పనుల్లో శ్రామిక గేయాలను జానపద స్త్రీలు పాడుకుంటారు. ఇంకా విసుర్రాతి పాటలు, దంపుడు పాటలు, ధాన్యాని తిరగలిలో పోసి విసిరేటపుడు, రోట్లో పోసి రోకలితో దంచేటపుడు కూడా మహిళలు శ్రామిక గేయాలు పాడుకుంటారు. ఈ విధంగా అనేక సందర్భాల్లో శ్రమ చేసేటపుడు పాడే శ్రామిక గేయాలే కాకుండా, స్త్రీలు విరామ సమయాల్లోనూ, వ్రతాలు, వేడుకలు చేసుకునే సందర్భాల్లోనూ అనేక జానపద గేయాలు పాడుకోవడం గమనించవచ్చు. ఇన్ని రకాలైన జానపద గేయాలతో తెలుగు జానపద సాహిత్యం పరిపుష్టమైంది.

## ఆధార గ్రంథాలు :


1. ఆంధ్రుల జానపద విజ్ఞానం, ఆర్వీయస్ సుందరం, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్, 1992
2. తెలుగు జానపద గేయ గాథలు, నాయని కృష్ణకుమారి, 1977
3. జానపద విజ్ఞానధ్యయనం, జి.యస్. మోహన్, ద్రావిడ విశ్వవిద్యాలయం, 2010
4. తెలంగాణ రైతాంగ పోరాటం ప్రజాసాహిత్యం, జయధీర్ తిరుమలరావు, సాహితీ సర్కిల్, హైదరాబాద్, 1988
5. దక్షిణ భారతీయ జానపద విజ్ఞానకోశం, కడప రమణయ్య (ప్రధాన సంపాదకులు), ద్రావిడ విశ్వవిద్యాలయం - 2011


"కొండలు పగలేసినం
బండలనూ పిండినం
మా నెత్తురు కంకరగా
ప్రాజెక్టులు గట్టినం
శ్రమ ఎవడిదిరో
సిరి ఎవడిదిరో"
"బంజర్లను నరికినం
పొలాలను దున్నినం
మా చెమటలు ఏరులుగా
పంటలు పండించినం
గింజెవడిదిరో
గంజెవడిదిరో"
"మగ్గాలను పెట్టినం
పోగు పోగు వడికినం
మా నరాలే దారాలుగ
గుడ్డలెన్నో నేసినం
ఉడుకెవడిదిరో
వణుకేవడిదిరే
"యంత్రాలను తిప్పినం
ఉత్పత్తులు పెంచినం
మాశక్తే విద్యుత్తుగా
ఫ్యాక్టరీలు నడిపినం
మేడేవడిదిరో
గుడిసెవడిదిరో
"కారణాలు తెలిపినం
ఆయుధాలు పట్టినం
మా యుద్ధం ఆపకుండ
విప్లవాలు నడిపెదం
చావు మీదిరో
గెలుపు మాదిరో"

- చెరబండరాజు

# జానపదం - సినీపదం

డా. పైడిపాల

జానపదం అంటే పల్లె అని నైఘంటికార్థం. జానపదులంటే పల్లెటూరి వాళ్ళనీ, జానపదం అంటే పల్లెకు సంబంధించినది - అనీ అర్థాలు. జానపదగేయాలు రాతకోతలతో సంబంధం లేకుండా పల్లె జనులు పాడుకొని ఆనందించే పాటలు జానపద గేయాలకు సినీ గేయాలకు ముఖ్యమైన పోలిక రెండూ జనం పాటలు కావడమే. అయితే జానపదాలు అమూల్యమైనవి కాగా సినీపదాలు ఖరీదైనవి. ముప్పైల దశకం నుంచీ యెన్నో జనపదాలు సినీపదాలుగా వినియోగింపబడి విస్తృత ప్రచారాన్ని పొందాయి. వీటిలో కొన్ని గ్రహించినవి, మరికొన్ని సంగ్రహించినవి.

> పొడుపు కథలు, సామెతలు, జాతీయాలు, మొదలైనవి వచన శాఖలో అంతర్భాగాలు. గేయరూపంలో వచ్చిన పొడుపుకథలు అనేక చలన చిత్రాల్లో చోటు చేసుకున్నాయి

నిజానికి జానపద సాహిత్యం కూడా సంప్రదాయంలో ఒక భాగమే. కాని యిటీవల వరకు దానికి తగిన గుర్తింపు లేక అనాదృత వాఙ్మయంగా పరిగణింపబడ్డం వల్ల, అది భావుకుడైన కవి సొత్తుగా గాక జానపదుని అప్రయత్న సృష్టిగా చెలామణి కావడం వల్ల ప్రత్యేకంగా పేర్కొనవలసి వస్తోంది. తరతరాలుగా గ్రంథస్థం కాకుండా, మౌఖిక సంప్రదాయంగా వస్తు ప్రాచీన ఆచార వ్యవహారాలను, కళలను, సాహిత్యాన్ని ప్రతిబింబించే సామాగ్రి జానపద విజ్ఞానంగా పరిగణింపబడింది.

జానపద విజ్ఞానంలో జానపద సాహిత్యం ఒక భాగం. ఆచారాలు, సంస్కృతి, కళలు వగైరాలు మిగతావి. జానపద సాహిత్యాన్ని తిరిగి వచనశాఖ, గేయ శాఖ, దృశ్య శాఖ అని మూడు భాగాలుగా విభజింపవచ్చును.

పొడుపు కథలు, సామెతలు, జాతీయాలు, మొదలైనవి వచన శాఖలో అంతర్భాగాలు. గేయరూపంలో వచ్చిన పొడుపుకథలు అనేక చలన చిత్రాల్లో చోటు చేసుకున్నాయి. యక్షగానం, వీధి నాటకం హరికథ బుర్రకథ, జముకుల కథ మొదలైనవి కళారూపాలు దృశ్యశాఖ విభాగం కిందకు వస్తాయి. ఈ కళారూపాలు కూడా సినిమాల్లో సందర్భాల కనుగుణంగా విరివిగానే వినియోగింపబడ్డాయి. సినిమా పాటల మీద జానపద గేయాల కున్నంత ప్రభావంపై ప్రక్రియలకు లేదనే చెప్పాలి. జానపద గీతాలను సినిమాల్లో కొన్ని యథాతథంగానూ, మరికొన్ని పాక్షికంగానూ, పెక్కింటిని మార్పులతోను వుపయోగించారు. పేరు ప్రతిష్టల నాశించని జానపదుల పాటలను వాటి ప్రాచుర్యాన్ని దృష్టిలో పెట్టుకొని సినీ గేయకవులు సొంతం చేసుకున్నారు.

యథాతథాలు ;- జానపద గేయాలకు యెవరినుంచీ హక్కులు పొందాల్సిన అవసరం లేదు గనుక వాటి రుచి తెలిసిన నిర్మాతలు కథలో సన్నివేశాలకు అవసరమైతే చేర్పులూ మార్పులూ లేకుండానే యథాతథంగా వాడుకున్నారు. ఉదాహరణకు కాకతీయ పిక్చర్స్ వారి 'చిల్లర దేవుళ్ళు' చిత్రంలో తెలంగాణా మాండలికానికి సంబంధించిన్ అనేక ప్రసిద్ధ గీతాలను వుపయోగించారు.

1. ఏటికేతం బట్టి లయి పుట్ల పండించి
   ఎన్నడు మెతుకెరుగనన్నా, నేను గంజిలో
   మెతుకెరగనన్నా.....
2. గుడిసెనక గుడిసె దాన, గుండీల రైక దాన....

మొదలైన ప్రాచుర్యం పొందిన గీతాలు పై చిత్రంలో వున్నాయి.

ఇంకా–

1. అత్తలేని కోడలుత్తమురాలు ఓలమ్మా
   కోడలు లేని అత్త గుణవంతురాలు (మనదేశం)
   (అత్తారింటికి దారేది!)
2. వల్లారి బాబోయే కావురోరయ్యా
   జరుగు జరుగుతున్నా నే జరగలేనన్నా
   (విధివిలాసం)

3. పంచదార వంటి పోలీసెంకటస్వామి
నిను నేను మరువలేనురా

(మనదేశం)

4. ఇల్లు ఇల్లని యేవు - ఇల్లు నాదని యేవు
నీ యిల్లు యెక్కడే చిలుకా తత్త్వం-

(కన్యాశుల్కం)

5. శ్రీ జానకీదేవి సీమంతమునకు.....

(మాయలోకం, ఆడబిడ్డ)

మొదలైనవి పాత సినిమాల్లో మార్పులు లేకుండా పూర్తిగా వాడుకున్న జానపద గేయాలు కాగా కొత్త సినిమాల్లో కూడా ఆ సంప్రదాయం కొనసాగుతుందనడానికి 'పలాస' చిత్రంలో వినియోగించిన-

నాది నక్లెసు గొలుసు
నీ పక్కన పడ్డాదో లేదా సూడోలె పిల్లా (ఉత్తరాంధ్ర జానపదం)

వంటి వాటిని వుదాహరణలుగా పేర్కొనవచ్చు.

## సాక్షికాలు:-

జానపద గేయాల్లో కొంతభాగాన్ని కాని, పల్లవి వరకు గాని తీసుకొని రాసిన సినిమా పాటలే యెక్కువ. ఇలా రాయడానికి అన్నిటికంటె ముఖ్యమైన కారణం - అప్పటికే జనం నోళ్ళలో నానుతున్న పాటలు వుంటే వాటికి ప్రాచుర్యం లభిస్తుందని. కొన్ని సందర్భాలలో నిర్మాత దర్శకులు అలాంటి పల్లవులను తీసుకొమ్మని కవులకు సూచించడం, మరికొన్ని సందర్భాలలో కవులే సంప్రదాయాని కనుగుణమైన జానపదాలతో ప్రారంభించడం జానపద వాసనలు గల సినిమా పాటలు వెలువడ్డానికి కారణాలు. జానపద బాణీలను సినిమాల్లో వాడుకున్న గేయ రచయితల్లో కొసరాజు ఆరుద్ర, ఆత్రేయ, సి.నా.రె మొదలైన ప్రముఖులు ముందుతరం వారు కాగా, జలాది, సాహితి మొదలైనవారు రెండవ తరానికి చెందినవారు. వీరిలో కొసరాజును 'జానపద కవి సార్వభౌమ' బిరుదంతో సి.నా.రె గౌరవించగా జలాది సినిమాల్లో జానపద గేయ సామ్రాజ్యానికి కొసరాజు రాజు అయితే తను సామంత రాజునని చెప్పుకొన్నారు. తెలుగు చలనచిత్ర పరిశ్రమ మద్రాసు నుంచి హైదరాబాద్ తరలివచ్చిన తర్వాత తెలంగాణ, ఉత్తరాంధ్ర మాండలికాలకు సంబంధించిన జానపద బాణీలు సినిమాల్లో యెక్కువగా

చోటుచేసుకున్నాయి. సినీ జానపదాలను మేలుకొలుపులు, సంవాదాలు, పనిపాటలు, స్త్రీల పాటలు, వలపు పాటలు, పెళ్ళిపాటలు మొదలైన వర్గాలుగా విభజింపవచ్చును.

మేలుకొలుపుల్లో తలమానిక మనదగిన 'బరం జీవులు' చిత్రంలో మల్లాది రామకృష్ణ శాస్త్రి రచన - తెల్లవార వచ్చె - తెలియక నా సామి

మల్లి పరుండేవులేరా...

గీతంలోని పల్లవి, మొదటి చరణం

తెల్లవారెనమ్మ, చెల్లనేమందు

నల్లని నా సామిలేరా.....

అనే జానపద మాతృకనుండి గ్రహించినవే నంటే చాలామందికి నమ్మకం చాలదు....

1. ముత్యమంతా పసుపు ముఖమంతచాయ

   ముత్తయిదు కుంకుమ బతుకంత చాయ.....

అనే 'ముత్యాలముగ్గు' చిత్రంలోని ఆరుద్ర పాట....

2. గోరింట పూచింది కొమ్మలేకుండా

   మురిపాల అరచేత మొగ్గ తొడిగింది....

అంటూ సాగిన 'గోరింటాకు' చిత్రంలోని దేవులపల్లి కృష్ణశాస్త్రి రచన.... వంటి ప్రాచుర్యం పొందిన సినిమాపాటలు జానపద సాహిత్యానికి చెెందిన స్త్రీల పాటలు ఆధారంగా అల్లినవే! ఆలుమగలు మధ్య, వదిన - మరదళ్ళ మధ్య, అత్తకోడళ్ళ మధ్య సినిమా పాటల రూపంలో వచ్చిన యెన్నో సంవాదాలకు స్ఫూర్తినిచ్చినవి జానపదాలే!

1. పాండవులు పాండవులు తుమ్మెదా పంచపాండవులోయమ్మ తుమ్మెదా

   (అక్కాచెల్లెలు - ఆత్రేయ)

2. గోగులు పూచే గోగులు పూచె - ఓ లచ్చ గుమ్మడి

   గోగులు దులిపే వారెవరమ్మా - ఓ లచ్చగుమ్మడి

   (ముత్యాలముగ్గు -సి.నా.రె)

3. ఒలియ ఒలియో ఒలియ
 రావేలు గలవాడ రారా పొలిగాడ

(రోజులు మారాయి - కొసరాజు)

4. ఆకులు పోకలు యివ్వొద్దు
 నానోరు ఎర్రగ చెయ్యొద్దు

(భార్యాబిడ్డలు - ఆత్రేయ)

వంటి పనిపాటలకు సంబంధించిన మనోరంజకమైన సినిమా పాటలెన్నో జానపద పల్లవులను తీసుకొని రాసినవే! ఇంకా సినిమాల్లో వచ్చిన పెళ్ళిపాటలు, పిల్లలపాటలు, హాస్యగీతాలు శృంగార గీతాలు మొదలైన వెన్నో జానపద పల్లవులతో ప్రారంభించి సృజించినవే!

ఇలా జానపద పల్లవుల హవా నేటికీ కొనసాగుతుందనడానికి ఆబాలగోపాలాన్ని అలరించిన 'లవ్ స్టోరీ' చిత్రంలోని 'సారంగదరియా...' పాటే ప్రబలోదాహరణం. నిజానికి ఆ పాటను సినిమాలో వినియోగించిన సుద్దాల అశోక్ తేజ వివరిస్తే తప్ప - ఆ పాటకు మాతృక ఒక గిరిజన గీతమనీ, 'సారంగి' అనే వాద్యాన్ని ధరించిన స్త్రీ అనే పదం రూపాంతరం చెంది సారంగదరియాగా మారిందనీ యెవరికో తప్ప తెలియదు.

దాని కుడిభుజం మీద కడవ

దాని గుత్తలు రైకలు మెరియా

అది రమ్మంటే రాదు సెలియా

దాని పేరే సారంగదరియా....

దాని ఎడం భుజం మీద కడవా

దాని ఎజెంటు రైకలు మెరియా

అది రమ్మంటే రాదుర సెలియా

దానిపేరే సారంగదరియా....

అనే జానపద పల్లవిని గ్రహించి, దానికి రెండు చరణాలు మాత్రమే తాను రాశానని, తెలంగాణ ప్రాంతంలో అప్పటికే అ పల్లవి అందరి నోళ్ళలో మారుమోగేదని అశోక్ తేజ స్వయంగా చెప్పారు.

ఉత్తరాంధ్రలో గరివిడి లక్ష్మినోట బహుళ ప్రచారాన్ని పొందిన -

రానురానంటూనే చిన్నదో చిన్నది

రాములోరి గుడికొచ్చె చిన్నదో చిన్నది

అనే పల్లవిని తీసుకొని 'జయం' చిత్రంలో కులశేఖర్ ఆర్. పి. పట్నాయక్ సంగీత దర్శకత్వంలో జనరంజకమైన పాటగా మలిచాడు.

జానపద బాణీలు:జానపద గీతాల పల్లవులను గ్రహించకుండా వాటి ప్రభావంతో జానపదాలనే భ్రమ కలిగించేలా రాసిన సినిమాపాటలు అనేకం. ముఖ్యంగా ఎనభైల దశకంలో జానపద గీతాలనో, గిరిజన గీతాలనో విని ప్రజానాట్యమండలి, జన నాట్యమండలి వంటి వామ పక్ష సాంస్కృతిక సంస్థల కవులు పాటలు రాయగా అవి చేర్పులు మార్పులతో సినిమాలకెక్కాయి. ఉదహరణకు-

> ఇక – జానపదాల్లోని ఒక పంక్తిని లేదా పదాన్ని మాత్రమే గ్రహించి జనం మెచ్చిన పాటలుగా మలిచిన సినిమా పాటలు చాలా వున్నాయి.

1. జిలగిజిగిలగిజిగి లంబాడీ లజ్జనకిడి.....
2. నాంపల్లి టేశనుకాడా రాజాలింగో.....
3. అక్కో అక్కో అక్కో మీ తమ్ముల మొచ్చిన మక్కా...

వంటి వాటిని పేర్కొనవచ్చు.

1. సూరట్టుకు జారతాది సితుక్కు సితుక్కు వానసుక్క
   గుండెల్లో కుదిపేస్తా గతుక్కు గతుక్కు ఏందేలక్క.....

(పల్లెసీమ - జాలాది)

2. లాలూ దరోజ లస్కర్ బోనాల్ పండుగ కస్తనని రాకపోతివి
   లకడీకాపూల్ పోరికి లబ్బర్ గాజులు తెస్తనని రాకపోతివి

(మొండి మొగుడు - పెంకి పెళ్ళాం - సాహితి)

మొదలైన మాండలిక జానపద బాణీలు కూడా ప్రాచీన జానపదాల నుంచి తీసుకున్నవి కావు. 'లాలు దర్వాజ...' పాట రాజస్థాన్ సంగీత బాణీలో కూర్చినదట!

ఇటీవల రాజకీయ ప్రచారాల్లో కూడా వినిపించిన చంద్రబోస్ సినిమాపాట-

ఆగట్టునుంటావా నాగన్న ఈ గట్టుకొస్తావా?

కూడా ఏ జానపద మాతృకను తీసుకొని రాసినది కాదని రచయిత స్వయంగా చెప్పారు.

ఇక - జానపదాల్లోని ఒక పంక్తిని లేదా పదాన్ని మాత్రమే గ్రహించి జనం మెచ్చిన పాటలుగా మలిచిన సినిమా పాటలు చాలా వున్నాయి. 'ఉయ్యాల - జంపాల' చిత్రంలోని నేటికీ వినిపిస్తున్న ఆరుద్ర రచన 'కొండగాలి తిరిగింది, గుండె వూసులాడింది!కి ఉత్తరాంధ్ర ప్రాంతంలో పశువుల్ని కాసే ఒక కుర్రాడు పాడిన - 'కొండగాలి తిరిగింది, కొడుకుకేమొ లేచింది' అనే పంక్తి మాత్రమే ప్రేరణ అట!

'నువ్వు - నేను' చిత్రంలో కులశేఖర్ రచన - 'గాజువాక పిల్లా - మేం గాజులోల్లం గామా.....' అనే పాట కూడా ఆంధ్ర విశ్వవిద్యాలయంలో విద్యార్థులు సరదాగా కట్టిన బాణీని ఆధారంగా చేసికొని రాసినదేనట!

'మందులోడా ఓరి మాయలోడా' అనే పాటను పెక్కు చిత్రాల్లో వుపయోగించినా, సరికొత్తగా 'శ్రీదేవి సోడాసెంటర్'లో ఆ పంక్తి వరకు మాత్రమే తీసుకుని మొత్తం పాటను కొత్తబాటలో రాసినట్టు ఆ రచయిత కాసర్ల శ్యామ్ చెప్పారు. అలాగే 'అల వైకుంఠపురం'లో ఆయనే రాసిన 'రాములో రాములా...' పాటలో 'రాములో' పదం వరకు మాత్రమే తను తెలంగాణా మాండలికం నుంచి గ్రహించారట! తెలంగాణ ప్రాంతంలో 'రాములో' పదాన్ని 'దేవుడో' అనే వూతపదంలా వుపయోగిస్తారట!

ఏతావాతా జానపద గేయ సాహిత్యానికీ సినీ గేయ సాహిత్యానికి వున్న అనుబంధం అంతా యింతా కాదు. జానపదం సినీపదానికెంతగా దోహదం చేసిందో జానపదాలను వెలికి తీసి వాటి వ్యాప్తికి సినిమా మాధ్యమం కూడా అంతగానూ వుపకరిస్తోంది. అయితే ఆరుద్ర చెప్పినట్టు సినీకవులు జానపదాలను సినిమా పాటల్లో వుపయోగించుకోవడం - వాటి ప్రాచుర్యం యినుమడించడానికే తప్ప భావ దారిద్ర్యం మాత్రం కాదు. ఇక ముందు కూడా జానపదాల స్ఫూర్తితో అర్థవంతమైన సినీపదాలు వెలువడి వుభయతారకమైన కీర్తి నార్జిస్తాయని ఆశిద్దాం.

# ఆలోచనల "పొద్దు పొడుపు కథలు"



ఆచార్య పగడాల చంద్రశేఖర్
94908 03523

మానవుడు మనసులోని మాటను తెలపటానికి అనుసరించే అనేక మార్గాల్లో భాష అత్యంత ప్రాథమికమైనది, అంతేకాక ప్రధానమైనది, ప్రముఖమైనది కూడా. భావాన్ని అనేక రకాలుగా తెలుపవచ్చు. అంటే వాచ్యార్థం, లక్షణార్థం, వ్యంగ్యార్థం, మొదలైన తీరుల్లో వెల్లడిస్తాడు. అయితే కొన్నిమార్లు మనసుకు హత్తుకుపోవడానికి కవిత్వం, లోకోక్తులు, నుడికారాలు, పలుకుబళ్లు, సామెతలు, మొదలైనవాటిని కూడా ఆశ్రయిస్తాడు. అయితే మనిషి మేధస్సును, ఆలోచనను పదును పెట్టటానికి పొడుపు కథలను వాడతాడు. వీటిద్వారా మెదడుకు మేత, మానసిక ఉల్లాసం కలుగుతాయి. ఇవి మన జీవితంలోని ఆనందాలకు సాక్ష్యాలు.




ప్రతిభాషలో పొడుపు కథలకు ప్రత్యేక స్థానం ఉంది. వీటికి సృష్టి కర్తలు పల్లె ప్రజలే. ఇప్పటికీ పల్లె ప్రాంతాల్లో నిత్య వ్యవహారంలో వినిపించే మాటల్లో, పాటల్లో, ఆటల్లో, సామెతల తరువాతి స్థానం పొడుపు కథలదే. వీటిపై పండితులకు కూడా ఆసక్తి కలగడంవల్ల పద్యాల్లో కూడా చోటు చేసుకున్నాయి. సాహిత్యంలో కనిపించే పొడుపు కథలు తాత్త్వికంగా, ధార్మికంగా ఉన్నాయి. ఋగ్వేదంలోని ప్రశ్నోత్తర రూపంలోని పొడుపు కథలు ప్రాచీనమైనవి. మహాభారతంలోని యక్ష ప్రశ్నలకు సూచన అని పలువురి అభిప్రాయం.

> పొడుపు కథను ఆంగ్లంలో 'riddle' అంటాం. భారతీయభాషల్లో పొడుపు కథను వివిధ పేర్లతో పేర్లతో పిలుస్తున్నారు.

పొడుపుకథ విజ్ఞానాన్ని పెంపొందించి, నిగూఢమైన అర్థాన్ని తెలిపిమనస్సులోగూడుకట్టుకుంటుంది. ఇది చమత్కారాన్ని, వినోదాన్ని, ఆసక్తిని, హాస్యాన్ని, సృజనాత్మకతను పెంపొందిస్తుంది. హాస్యాన్ని కలిగించే పొడుపు కథలను అందరూ ఇష్టపడతారు. మెదడుకు మేత, బుద్ధికి తేజస్సు, తెలివితేటలకు పదును పెట్టి, సమస్యలను పరిష్కరించే నేర్పు కలుగుతుంది. అందువల్ల మనిషికి పొడుపు కథలోని రహస్యాన్ని తెలుసుకోవాలనే కుతూహలం ఉంటుంది. అయితే సూటిగా అర్థం తెలపకుండా చిక్కులు పెడుతుంది. పొడుపును విప్పటానికి బుద్ధి బలం అవసరం. అందువల్ల మనిషి పొడుపు కథలోని గుట్టును విప్పి, తెలివితేటలను నిరూపించుకోవాలనే తపన కూడా ఉంటుంది. అందువల్ల పొడుపు పొడుపు కథ పల్లె ప్రజలకు వినోదంతో కూడిన ఆట. ఇవి సాంప్రదాయకంగా వస్తున్నప్పటికీ, ఆధునిక కాలంలోని దాదాపు అన్ని విషయాలపైన కూడా పొడుపు కథలు రూపొందుతున్నాయి. కథలు మనిషిని ఆకర్షిస్తున్నాయి.

పొడుపు కథను ఆంగ్లంలో 'riddle' అంటాం. భారతీయభాషల్లో పొడుపు కథను వివిధ పేర్లతో పేర్లతో పిలుస్తున్నారు. "ప్రహేళిక, ప్రవలిక, ప్రశ్న, ప్రత్యుత్తర కూట, బ్రహ్మోదయ, వివాద, సమస్యా గూఢ, హదయాలిక (సంస్కృతం); వహేలి, హియాలియా (ప్రాకృతం); ఒగటు లేక వగటు, ఒంటు, ఒడగతె, ఒడకతె, ఒడ్డకతె, ఒగణు (కన్నడం); విడికత్తై, విడుకత్తై, పుడుర్ (తమిళం); విడికద, కటకద, కటం కథ (మలయాళం); పహెలీ, బుజోవల్, భుల్బులైయా, ముకరియా (హిందీ); ఉఖాణా, ఆహణా, ఉమణా, కోహడా, కులంగాదె, కోడే, బయాణా (మరాఠి); వహేలి, దాంథా, పెయ్ (బెంగాలి); ఉఖాణో, ఉఖాతచా, కొహ్యడో, అభియాణు, కోడు (గుజరాతి); ఉఖాణీ (సింధి); పహేలి, భుజాత్ (పంజాబి); బాహా, పహేలీ (బీహారి), పహేలీ చుట్ కులే (ఉర్దూ)" మొదలైన పేర్లతో పిలుస్తారని ఆచార్య కసిరెడ్డి (1950, పుట 41) తెలిపారు.

'చిత్రకవితా ప్రక్రియకు చెందినదే ప్రహేళిక.' (శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి),

పొడుపు కథ అనేది ఒక సమస్య లేక ప్రశ్న మాదిరి వుంటుంది." (శ్రీ కంఠం సిద్ధారెడ్డి), "సామాన్యంగా పొడుపు కథలు కేవలం శబ్దచమత్కార సమస్యలుగా భావించడం వుంది .... లక్ష్యార్థ (మెటాఫరికల్మీనింగ్) ప్రాధాన్యం (డా.శ్రీ హెచ్.ఎస్. బహ్మానంద, శ్రీ బి. నారాయణ గారలు), పొడుపు కథలు జానపద విజ్ఞానానికి సంబంధించిన ఒక వినోదాత్మక పక్రియ .. ఊహచే సమాధానమును వెదకి వినోద ఆశ్చర్యములతోపాటు గూఢార్థమును వెలువరెంచెడి, సవాలు చేసెడి పశ్నార్థక రూపకాశయోక్తి ప్రక్రియ (డా.శ్రీ జి.యస్. మోబన్), పొడుపుకథలలోని కవిత్వమును భావబంధకవిత్వముగా చెప్పుకొనవచ్చును. అర్థమునే మాత్రము చెప్పక దాని భావమును గుప్తముగా సూచించుట యన్నది తట్లయొక్క లక్షణము (యెల్దండ రఘుమారెడ్డి) వెల్లడించారని ఆచార్య కసిరెడ్డి (2006 పుట 51) ఉట్టంకించారు.

> ఒకే వస్తువును పరిపరివిధాలుగా ఊహించడమవుతుంది. అందువల్ల "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" (ఋగ్వేద సూక్తం 1-164) గుర్తుకువస్తుంది.

పొడుపు కథలో గోప్యత ఉంటుంది, భావనలో కొంత తికమక పెట్టే లక్షణం, అలంకారికత ఉంటాయి.

ఒకే వస్తువును పరిపరివిధాలుగా ఊహించడమవుతుంది. అందువల్ల "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" (ఋగ్వేద సూక్తం 1-164) గుర్తుకువస్తుంది. సత్యం ఒకటే, దానిని విజ్ఞులు అనేక రకాలుగా తెలుపుతారు. సత్యాన్ని తెలపడంలో వ్యత్యాసాలు ఉండవచ్చు. అంటే ఒక్కొక్కరు ఒక్కోరకంగా తెలుపవచ్చు. సందర్భాన్ని బట్టి, అవసరాన్నిబట్టి, ఆయా దేశకాలాలను బట్టి సత్యం ఆవిష్కృతం అవుతుంది.

పొడుపు కథలో ఉల్లేఖాలంకార లక్షణాలు కూడా కనిపిస్తాయి. "వస్తువు ఒకటే అయినప్పటికీ ఒక్కొక్కరు ఒక్కోవిధంగా భావించడాన్ని ఉల్లేఖాలంకారం అంటాం." రాజును ప్రజలు దేవునిగా, యాచకులు కల్పవృక్షంగా, విరోధులు ప్రళయకాల రుద్రునిగా భావించడాన్ని ఉల్లేఖాలంకారం అంటారు. ఒక వస్తువులోని లేదా భావనలోని వివిధ అంశాలను పొడుపు కథలో పరిపరి

విధాలుగా భావించవమైంది.

పొడుపుకథలో ఊగు-తూగు, అంత్యప్రాస, వ్యంగ్యం-హాస్యం ఉంటాయి. ఇది ప్రశ్నార్థక రూపకాతిశయోక్తి ప్రక్రియ. పొడుపు కథలో ఉపమాన, ఉపమేయాలు దాగి ఉంటాయి. ఇందులో ఉపమానం వాచ్యం. ఉపమేయం సూచ్యం. వాచ్యమైన ఉపమానంచే సూచ్యమైన ఉపమేయాన్ని గుర్తించడం సమాధానమనిపించుకుంటుంది.

పొడుపు కథను రెండు భాగాలుగా విభజించవచ్చు.

అవి- 1.పొడుపు, 2.విడుపు. పొడుపు కథాంశంలోని 'కొన్ని ఆధారాలు' తెలిపి, వాటికి సమాధానం చెప్పమని అడుగుతాం. ఇలా ప్రశ్నించటాన్ని 'పొడుపు' అంటాం, దీన్ని 'పొడవటం' అని కూడా పిలుస్తారు. ప్రశ్నకు సమాధానం చెప్పటాన్ని 'విడుపు' అంటాం. ఈ విధంగా పొడుపు కథలో 'పొడుపు, విడుపు' అనే విభాగాలు ఉన్నాయి. పొడుపు కథను ఒకరు పొడుస్తారు, అంటే ప్రశ్నిస్తారు. దాన్ని మరొకరు విప్పుతారు, అంటే మరొకరు సమాధానం చెబుతారు. ఆయా ప్రాంతాల్లోని, ఆయా సమాజాల్లోని, ఆయా ప్రజల అలవాట్లనుబట్టి పొడుపు వివిధ రకాలుగా భాసిస్తుంది. అయితే విడుపు మాత్రం ఒకటే ఉంటుంది. ఒక వస్తువులోని లేదా ఒక భావనలోని వివిధ అంశాలను పరిపరి విధాలుగా ఊహించడమవుతుంది. అందువల్ల పొడుపులు అనేకంగా ఉన్నా, విడుపు మాత్రం ఒకటే ఉంటుంది.

పొడుపు -1, పొడుపు -2, పొడుపు -3, పొడుపు -4, పొడుపు .... = విడుపు ||

ఈ నేపథ్యంలో కొబ్బరికాయ/టెంకాయ, దీపంకు సంబంధించిన పొడుపుకథను చూద్దాం. మనం నిశితంగా పరిశీలిస్తే ఈ విధమైన పొడుపు కథలు అనేకం కనిపిస్తాయి.

మొదట కొబ్బరికాయ / టెంకాయను గురించి తెలుసుకుందాం.

పొడుపు 1 : చెయ్యని కుండ, వెయ్యని సున్నం, పొయ్యని నీరు.

పొడుపు 2 : చూస్తే చిన్నోడు, వాడి ఒంటి నిండా నార బట్టలు.

పొడుపు 3 : ఆ వీధిరాజుకి జుట్టుంది, కొప్పులేదు. కళ్లున్నాయి, చూపులేదు

పొడుపు 4 : బండకు కొడితే వెండి ఊడుతుంది.

పొడుపు 5 : చూస్తే చిన్నోడు, వాడి ఒంటి నిండా నార బట్టలు?

విడుపు : టెంకాయ, కొబ్బరి కాయ.

ఇప్పుడు దీపం గురించి తెలుసుకుందాం.

పొడుపు 1 : అద్దంకి చెరువులో ముద్దంకి పిట్ట | ముక్కున బంగారం, తోకతో నీళ్లు తాగుతుంది ||

పొడుపు 2 : ఇల్లంతా వెలుగు | బల్లకింద చీకటి ||

పొడుపు 3 : తలపుల సందున మెరుపుల గిన్నె ||

పొడుపు 4 : దాస్తే పిడికిలిలో దాగుతుంది | తీస్తే ఇల్లంతా జారుతుంది ||

విడుపు : 1,2,3 దీపం 4. దీపం వెలుగు.

పై పొడుపుల్లో దీప లక్షణాలను వెల్లడించడమైంది. ఏ ఒక్క పొడుపులో కూడా లక్షణాలన్నీ లేవు. అందువల్ల ఉల్లేఖాలంకార లక్షణాలు ప్రతిబింబించాయి. పొడుపులో దీపాన్ని వివిధ రకాలుగా భావించడం వల్ల 'ఏకం సత్ ...' అనే సూక్తి సరిపోతుంది.

ఈ విధంగా పొడుపుకథ లక్ష్య, లక్షణ పూరితంగా ఉంటుంది.

మరికొన్ని పొడుపు కథలను పరిశీలిద్దాం.

పొడుపు : నీచే దెబ్బలు తిన్నాను | నిలువునా ఎండిపోయాను || నిప్పు గుండం తొక్కాను | గుప్పెడు బూడిద అయ్యాను ||

విడుపు : పిడక

పొడుపు : అయ్య కొయ్యలమారి | అమ్మ గిచ్చులమారి | బిడ్డలు రత్నమాణిక్యాలు ||

విడుపు : రేగుచెట్టు

పొడుపు : ఆకాశంలో ఉంటుంది - కాని మేఘం కాదు |
తోకతో ఉంటుంది - కాని ఎద్దు కాదు |
అటు ఇటు తిరుగుతుంటుంది - కాని పక్షి కాదు |
ఝుమ్మని శబ్దం చేస్తుంది - కాని తూనీగ కాదు |
పట్టు తప్పితే చాలు పరుగు తీస్తుంది |

పొడుపు : గాలిపటం.

పొడుపు : ఆకుల్లేని అడవిలో జీవంలేని జంతువు | జీవం గల జంతువుతో పోరాడింది |

పొడుపు : దువ్వెన.

పొడుపు : ఐదుగురు పతులుండు - ద్రౌపది కాదు |
మూల నల్లగనుండు - ముసలి కాదు |
తలాతోకా నుండు - మరి నా పేరేమి?

విడుపు : పెన్ను

పొడుపు : కాటుక రంగు - కమలము హంగు |
విప్పిన పొంగు - ముడిచిన కుంగు |

నేనెవరిని?

విడుపు : గొడుగు

పొడుపు : చుక్కల గుర్రాన్నెక్కి - సూటికర్రల చేతబట్టి |
ఆకుల్లేని అరణ్యానికి- రాజకుమారుడు |
వేటకెళ్ళాడు ||

విడుపు : చంద్రుడు

పొడుపు : నాలుగు కాళ్ళుంటాయి- మనిషిని కాదు |
చెట్టూ చేమా, అమ్మానాన్న- అయితే కావచ్చు..

విడుపు : కుర్చీ.

పొడుపు : నిలువెల్ల తరువైతిని
తలవాకిట లోహమందు తలదూర్చితి నేనిల, నా జాతి వినాశము
తల పెడుదును పేరుదెల్ప తరమా నీకు..?

విడుపు : గొడ్డలి.

పొడుపు : బాహువులు పదహారు - బాణాసురుడు కాడు |
వీపున జందెముండు - విప్రుడు కాడు ||

విడుపు : రాట్నం

పొడుపు : మంచం కింద మామయ్య | ఊరికి పోదాం రావయ్యా ||

విడుపు : చెప్పులు.

పొడుపు : మా తాత ఏటి అవతలకు వెళ్లి మూడెడ్లు తెచ్చాడు.
ఒకటి కరిగేది, ఒకటి తేలేది, ఒకటి మునిగేది.

విడుపు : సున్నం, వక్క, ఆకు.

వ్యాసరచయిత ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు(హైదరాబాదు) ప్రచురించిన జానపద సరస్వతి-2008లో పొడుపు కథల్లో కొబ్బరికాయను భావించిన తీరును, అంతేకాక జానపదసరస్వతి-2013లో పొడుపు కథల్లో సూర్యచంద్రులను భావించిన తీరును వివరించడమైంది.

**ఉపయుక్త గ్రంథ సూచి:**


1. ఆచార్య కసిరెడ్డి. తెలుగు పొడుపు కథలు. జాతీయ సాహిత్య పరిషత్తు, హైదరాబాదు. 2006.
2. ఆచార్య పగడాల చంద్రశేఖర్(సం). జానపద సరస్వతి-2008. ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్. హైదరాబాదు. 2008.
3. ఆచార్య పగడాల చంద్రశేఖర్(సం). జానపద సరస్వతి-2013. ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్. హైదరాబాదు. 2013.
4. గాజుల సత్యనారాయణ. సామెతలు పొడుపుకథలు.కుమార్ బుక్స్, విజయవాడ.2008.
5. Telugu Podupu Kathalu - తెలుగు పొడుపు కథలు by G.N.Reddy - Telugu Podupu Kathalu (anandbooks.com)
6. http://www.anandbooks.com/Telugu-Podupu-Kathalu
7. https://www.ntnews.com/editpage/chelimi-news-12-100218




*"Our ancient poets said people's tongues are the palm leaves that safeguard the literature. Now the hearts of the people are the tape recorders that preserve literature."* - ఆరుద్ర

# జానపద పురాగాధలు ఐతిహ్యాలు - కథలు



ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి
98493 07333

జానపద పురాగాథలు - ఐతిహ్యాలు - కథలను కలిపి జానపద గద్యాఖ్యానాలని, గద్య కథనాలని అంటారు. గద్యాఖ్యానాలంటే గద్యరూపంలో అంటే వచన రూపంలో అఖ్యానం అంటే చెప్పడం వెరసి వచన రూపంలో చెప్పేవని, గద్య కథనాలంటే వచన రూపంలో ఉండే కథలని అర్థం

**1. పురాగాథలు:** జానపదులు అనేక రకాలైన పురాగాథలను చెప్పుకుంటుంటారు. గద్య కథనాలలో ఇవి ముఖ్యమైనవి. పురా అంటే ప్రాచీనమైనవి, గాథ అంటే కథ అని అర్థం. కాబట్టి వీటికి ప్రాచీన హోదా కల్పించడానికి పురాగాథలు అని పేర్కొనడం జరిగింది. వీటినే జానపద పురాణాలు అని కూడా అనొచ్చు. ప్రాచీన కాలంలో శాస్త్ర పరిజ్ఞానం లేకపోవడం వల్ల ప్రకృతిలో జరిగే ప్రతి మార్పుకు మానవాతీత శక్తులే కారణమని ఆనాటి వారు భావించారు. తనకు మంచి చేసే వాటిలో దైవాంశ ఉందని, తనకు చెడు చేసే వాటిలో రాక్షశాంశ ఉందని నాటి మానవులు తలపోశారు. అగ్నిని పూజించారు. జీవనాధారలైన వాయువును, వర్షాలను పలు వృక్షాలను ఆరాధించడం ప్రారంభించారు. ఇలా నాటి మానవులు తమ జీవితానుభవాలను ఆధారం చేసుకొని పురగాథల్ని సృష్టించుకొన్నారు. పురగాథలు మూడు రకాలు. అవి 1. సృష్టి గాథలు 2. దేవతా సంబంధ గాథలు 3. ఆచార సంబంధ గాథలు

**1.1.సృష్టి గాథలు :** వీటిలో భూమికి చెందినవి, ఆకాశానికి చెందినవి కూడా ఉన్నాయి. సృష్టికి పూర్వం ప్రపంచమంతా జలమయంగా ఉండేది. ఈ జలరాశి ముక్కు, ముఖం లేని ఒక పక్షి పెట్టిన మూడు గుడ్లు పగుల్తాయి. మొదటి గుడ్డు పైభాగం ఆకాశంగాను, కింది భాగం భూమిగాను రూపొందుతాయి. రెండవగుడ్డు నుండి విష్ణువు, బ్రహ్మ, మహేశ్వరులు, ముప్పై మూడు కోట్ల దేవతలు, అరవై

ఆరుకోట్ల మునులు ఉద్భవిస్తారు. మూడవ గుడ్డు నుండి రాక్షసులు, మానవులు, జంతువులు, వృక్షాలు ఆవిర్భవిస్తాయి. ఇలా గుడ్డు నుండి విశ్వం అవతరిస్తుందని పురాగాథ చెప్తుంది. మరో పురాగాథను గమనించండి.

అమ్మవారు సృష్టించిన ప్రాణులన్నీ తిండికోసం, నివాసం కోసం కొట్లాడుకుంటూ ఉండేవి. ఆమె స్వర్గ, మర్త్య, నాగ లోకాలను సృష్టిస్తుంది. మానవులను, జంతువులను మర్త్య లోకంలో ఉండమని చెప్తూ, బలమైన ప్రాణులను, బలహీనులను తినమని ఆదేశిస్తుంది. అలాగే దేవతలకు అమృతాన్నిచ్చి స్వర్గలోకంలో నివసించమంటుంది. నాగులకు నాగలోకాన్నిస్తుంది. అలా వివిధ ప్రాణుల కోసం వివిధ లోకాల సృష్టి గురించి పేర్కొనబడి ఉంది. మరో పురాగాథను గమనించండి-

భూమి జలంతో నిండి ఉంటుంది. ఆ సమయంలో శక్తి అవతరిస్తుంది. తన మహిమ చేత ప్రపంచాన్ని సృష్టించింది. జంతువులు, వృక్షాలు, పక్షులు అన్నీ భూమిపై వెలిశాయి. తనకు కామ వికారం కలిగింది. తనకో మగతోడు భర్త కావాలనుకొంటుంది. బ్రహ్మను సృష్టిస్తుంది. బ్రహ్మ 'తల్లీ' అని సంబోధిస్తాడు. లాభం లేదనుకొని విష్ణువును సృష్టిస్తుంది. విష్ణువు అమ్మా అంటాడు. ఇక సహనం కోల్పోయి శివుడ్ని సృష్టిస్తుంది. శివుడు ఏమే అంటాడు. ఇతనే తనకు సరైన జోడని భావించి పెళ్ళాడమంటుంది. అయితే శివుడు తనకు శక్తికున్న మూడో కన్ను, త్రిశూలం ఇస్తే పెళ్ళాడతానంటాడు. శక్తి అలాగే ఇచ్చేస్తుంది. ఇలాంటి సృష్టికి సంబంధించి పురాగాథలెన్నో జన వ్యవహారంలో ఉన్నాయి.

**1.2. దేవతా సంబంధ గాథలు :** వీటిలో గ్రామదేవతల గాథలు, కుల దేవతల గాథలు, దైవాలుగా భావింపబడే ప్రకృతి శక్తులకు సంబంధించిన గాథలు, పేరంటాండ్ర గాథలు, పౌరాణిక దేవతా సంబంధి గాథలు వంటివి ఉన్నాయి.

## ఉదాహరణకు దేవతా సంబంధి గాథలు:

**పోచమ్మ కథ :** గ్రామాన్ని ప్రజల్ని పోషించే అమ్మనే పోచమ్మ అని అంటారు. పోచమ్మ ఆగ్రహిస్తే స్ఫోటకంవస్తుందని విశ్వసిస్తారు. అమ్మవారు వ్యాపించినప్పుడు భయపడి గ్రామాన్ని వదలిపోతే పోచమ్మ వెంటాడుతుందని ప్రజల నమ్మకం. ఒకానొకప్పుడు ఒక గ్రామంలో స్ఫోటకం వ్యాధి వల్ల అనేకమంది మరణిస్తారు. ఈ అమ్మవారి ప్రభావం నుండి తప్పించుకోవడానికి ఒకామె తన ఒక్కగానొక్క కొడుకును తీసుకొని గ్రామాన్ని వదలిపెట్టి పోయింది. అలా చాలాదూరం పోయాక ఒక అడవిలో ఒక ముసలామె ఎదురై వాళ్ళను ఎక్కడకు పోతున్నారని ప్రశ్నిస్తుంది.

అందుకు ఆమె అమ్మవారు చూపు తమమీద పడకుండా ఉండాలని, గ్రామాన్ని వదలిపోతున్నామని సమాధానం చెప్తుంది. అది విని ముసలామె తన తల్లో పేలు ఇబ్బందిగా ఉన్నాయని కాస్త పేళ్ళను కుక్కి వెళ్ళమని కోరుకుంది. అప్పుడు పేళ్ళను కుక్కడానికి ముసలమ్మ కొప్పు విప్పగానే తలనిండా కండ్లు కనిపిస్తాయి. ఆ ముసలామె పోచమ్మని తెలుసుకొని మన్నించమని ప్రాధేయపడి తిరిగి తమ గ్రామాన్ని చేరుకుంటారు.

**1.3 ఆచార సంబంధి గాథలు :** వీటిలో పండుగలకు చెందిన గాథలు, వ్రత గాథలు, కుటుంబ సంబంధ గాథలు వంటివెన్నో ఉన్నాయి.

పండుగలకు చెందిన గాథలకు ఒక ఉదాహరణ:-

ఆంధ్ర దేశానికి ఒకప్పుడు నాగభూమి అనే పేరుండేది. తెలుగువారు నాగ సంతతికి చెందిన వారని కూడా అంటారు. నాగపంచమి పల్లె పడుచులకు ప్రధానమైన పండుగ. దీనిని శ్రావణ శుద్ధ పంచమినాడు చేస్తారు. ఈ రోజు భూమి దున్నడం, కాయగూరలు కోయడం, వండడం వంటివి చేయడం నిషేధం. ఈ నిషేధం ఆచారంగా మారిన విధానాన్ని వివరించే కథ ఒకటి ఉంది. ఒకానొకప్పుడు వ్యవసాయదారుడొకడూ భూమిని దున్నేటప్పుడూ నాగలి పుట్టలోని పాము పిల్లలకు తగిలి మరణిస్తాయి. చనిపోయిన తన పిల్లలను చూసిన తల్లి పాము వ్యవసాయదారునిపై ఆగ్రహించి అతని ఇంటిలోనికెళ్ళి వరుసగా కుటుంబ సభ్యులనందరినీ చంపేస్తుంది. ఆ వ్యవసాయదారుని పెద్దకూతురు పెండ్లయి అత్తగారింట్లో ఉంటుంది. ఆమెను కూడా చంపాలనుకొని పాము అక్కడికి వెళ్తుంది. అప్పుడామె సర్ప ప్రతిమను పూజిస్తూ, ధ్యానంలో ఉంటుంది. నాగుపాము ఆమె పూజైన తర్వాత కాటు వేసేందుకు కాచుకొంది. అప్పుడు ఎదురుగా ఉన్న పాలు, పేలాలు కనబడ్తాయి. వాటిని తింటూనే నాగేంద్రునికి కోపావేశాలు తగ్గిపోతాయి. వ్యవసాయదారుని పెద్ద కూతురు పూజ పూర్తికాగానే నాగేంద్రున్ని చూస్తుంది. పాము జరిగిన వృత్తాంతాన్ని వివరిస్తుంది. ఆమె తన కుటుంబం దుర్మరణం పాలవడం తెలిసి దుఃఖించి తన వారిని బతికించమని

ఆంధ్ర దేశానికి ఒకప్పుడు నాగభూమి అనే పేరుండేది. తెలుగువారు నాగ సంతతికి చెందిన వారని కూడా అంటారు.

నాగేంద్రుని వేడుకుంటుంది. పాము కూడా పశ్చాత్తాపంతో అమృతానివ్వగా, దాని ప్రభావంతో ఆమె తన పుట్టింటి వారిని బ్రతికించుకుంటుంది. అప్పట్నుంచి శ్రావణ శుద్ధ పంచమినాడు భూమిని దున్నడం, కాయకూరలను కోయడం, వండడం చేయరు. పాలు, పేలాలు, గుడ్లు నాగపంచమి నాడు పుట్ట దగ్గర నైవేద్యంగా నాగేంద్రునికి సమర్పిస్తారు.

ఇలాంటి పురాగాథలే కాకుండా ఇంకా అనేక రకాల ఆసక్తికరమైన చిన్న చిన్న పురాగాథలున్నాయి. త్రేత్రాయుగంలో శ్రీరాముడు ఉడుతను ప్రేమపూర్వకంగా నిమిరిన వేళ్ళ గుర్తులే నేటి ఉడుతల పైన కనిపిస్తాయని ఒక పురాగాథ చెప్తుంది. అలాగే కాకికి ఒక కన్ను కనిపించకపోవడానికి కారణాన్ని కూడా పురాగాథ వివరిస్తుంది.

శ్రీరామచంద్రుడు కాకాసురుని కంటిని బాణంతో కొట్టడం వల్ల కాకాసురుని సంతతైన కాకులన్నింటికీ ఒక కన్ను కనిపించకపోవడానికి కారణమని అంటారు. అలాగే వేడుకోగానే వంగి, అర్థించగానే కల్లును అందించే గౌండ్ల వారి జీవనాధారమైన తాటిచెట్లు, పోలేరమ్మ శాప ఫలితంగా నిటారుగా నిలబడి గీస్తూనే కల్లుని ఇస్తాయని ఇంకొక పురాణగాథ చెప్తుంది. అలాగే శివపార్వతుల పెండ్లికి కావలసిన అవిరేని కుండల కోసం బ్రహ్మ, గుండయ్యను సృష్టించాడు. అలా గుండయ్యను, ఆయన సంతతికి మట్టి పాత్రలు చేయడమే వృత్తిగా మారిందని వేరొక పురాగాథ చెప్తుంది. ఇలాంటి వృత్తులకు, కులాలకు, పశుపక్ష్యాదులకు సంబంధించిన పురాగాథలెన్నో ఉన్నాయి.

**2. ఐతిహ్యాలు :** ఐతిహ్యాలు పురాణాల కంటే, కథల కంటే చిన్నవిగా ఉండి, పరిమిత పాఠాంతరాలను కలిగి ఉంటాయి. మౌఖికంగా ఒక తరం నుంచి మరో తరానికి సంక్రమిస్తాయి. కాబట్టి ఐతిహ్యాలలోని విషయాలన్నీ యదార్థాలేనని చెప్పడానికి వీలులేదు. జరిగాలని మనం నమ్మే వాటినే ఐతిహ్యాలని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. అవి. 1. స్థానిక ఐతిహ్యాలు 2. సంచారి ఐతిహ్యాలు.

**2.1. స్థానిక ఐతిహ్యాలు :** ఇవి స్థానికంగా బహుళ ప్రచారంలో ఉంటాయి. సాధారణంగా ఒక ఊళ్ళోనో, ఒక ప్రాంతంలోనో పుట్టి, పెరిగి బహుళ ప్రచారంలోకి వస్తాయి. ఒక్కోసారి పుట్టిన చోటే నశించిపోతుంటాయి.

**2.1.1. ఊర్ల పేర్లకు సంబంధించినవ :** ఐతిహ్యాలలో ఊర్ల పేర్లకు, స్థలాలకు సంబంధించినవి కోకొల్లలుగా ఉన్నాయి. కొన్ని ఊర్లకు, స్థలాలకు ఆ పేర్లు ఎందుకు వచ్చాయో తెలియదు. అయితే జానపదులు మాత్రం ఏదో ఒక కథ చెప్తారు. ఆ కథ

నిజమో కాదో నిర్ధారించడానికి సరైన ఆధారాలు దొరకవు. ఒక్కోసారి వారు చెప్పేవి చరిత్రకు ఎంతో దోహదపడే విధంగా ఉంటాయి. అయితే మధ్య మధ్యలో అభూత కల్పనలు ఎన్నో చోటు చేసుకొని ఉంటాయి. కింది ఐతిహ్యాలను గమనించండి-

**నాగలాపురం :** చిత్తూరు జిల్లాల్లో తిరుపతికి సుమారు 70కి.మీ దూరంలో నాగలాపురం ఉంది. ఒకరోజు శ్రీకృష్ణ దేవరాయలు, అతని తల్లి నాగమాంబ నాగలాపురంలోని వేదనారాయణ స్వామి ఆలయాన్ని దర్శించారట. ఆ ఆలయాన్ని దర్శించిన తర్వాత అపురూపమైన అనుభూతికి లోనైన నాగమాంబ దేవి తన కొడుకుతో తన పేరున ఒక గ్రామాన్ని నిర్మించమని చెప్పిందట. రాయలు తల్లి కోరికపై గుడికి దగ్గరలో ఒక గ్రామాన్ని నిర్మించి దానికి నాగమాంబపురం అనే పేరుని పెట్టాడట. తర్వాత నాగలాపురంగా మారిపోయింది.

**పామిడి :** అనంతపురం జిల్లా గుత్తి మండలంలో ఈ పామిడి అనే ఊరుంది. ఇక్కడ ఒక క్షేత్రం కూడా ఉంది. ఈ ఊరి అసలు పేరు శేష గ్రంధిపురం. అది తెలుగున పాముముడి అయిందంటారు. సింహగిరిని ఆనుకొని క్షేత్రపాల కొండ అనే గ్రామం ఉంది. ఆ గ్రామంలో ఒక ఆవుల కాపరి వుండేవాడు. మందలోని ఒక నల్లటి ఆవు ప్రతిరోజూ మందను వదలిపోయి ఒక పుట్టలో పాముకి పాలను వదిలేది. ఇది చూసిన కాపరి ఆవును దండించబోతాడు. అప్పుడు ఆ పాము నేను భోగేశ్వరుడనని ఆ ఆవు సురభ అని చెప్తుంది. ఆ రోజు రాత్రి ఆవు యజమానికి భోగేశ్వరుడు కలలో కనిపిస్తాడు. పుట్టను తవ్వి చూడమని చెప్తాడు. యజమాని పుట్టను తవ్వించి చూడగా పుట్టలో శివలింగం దాని చుట్టూ పాము, పానవట్టము కనిపించాయి. యజమాని అక్కడే స్వామికి, అమ్మవారికి ఆలయాలను కట్టిస్తాడు. ఈ ఆలయ ప్రదేశంలో ఒక గ్రామాన్ని నిర్మించాలని అనుకొంటాడు. ఆ రోజు రాత్రి శేషుడు అతడి కలలో కనిపిస్తాడు. వెంటనే ఆ ప్రాంతంలో గ్రామాన్ని నిర్మింపస్తాడు. ఆ వూరికి శేష గ్రంథి పురం అనే పేరు పెడ్తారు. తర్వాత పాము చుట్టుకొని వున్న శివలింగం దొరికినందున పాము ముడి అనే పేరుతో పిలవడం మొదలు పెట్టారు. తర్వాత ఆ పేరు పామిడిగా మారిపోయిందంటారు.

**పిల్లలమఱ్ఱి :** నల్గొండ జిలా సూర్యాపేట దగ్గర పిల్లల మఱ్ఱి గ్రామం ఉంది. కాకతీయ చక్రవర్తుల కాలంలో సేనా నాయకులైన రేచర్ల నామిరెడ్డి, బేతిరెడ్డి ఆమనగల్లు రాజధానిగా పిల్లలమఱ్ఱి ప్రాంతాన్ని ఏలుచుండేవాళ్ళు. అప్పుడు ఒకనాడు బేతిరెడ్డి గంటికి దగ్గర్లో గల అడవిక ప్రాంతానికి తన సైన్యంతో వేటకు

వెళ్ళాడు. వేటాడి బాగా అలసి ఒక పెద్ద మఱ్ఱి చెట్టుకింద విశ్రాంతి తీసుకొంటుండగా బేతిరెడ్డికి ఏవో ఆలోచనలతో నిద్రపట్టలేదట. ఇంతలో ఆ చెట్టు పైనే చాలా కాలంగా నివాసం ఉండే ఒక బేతాళుడు శబ్దం చేస్తూ కన్పించాడట. వృక్ష మూలంలో నిధులు వున్నాయని తెలుసుకొంటాడు. ఆ నిధులను తన వశం చేసుకొన్నాడట. ఆ నిధులతో అన్నదమ్ములు ఆ ప్రాంతంలోనే వటవృక్షం పేరుతోనే ఒక గ్రామాన్ని నిర్మించారట. దానిపేరే పిల్లలమఱ్ఱి అని చెప్తారు.

**పట్టిసం :** తూర్పు గోదావరి జిల్లా రాజమండ్రికి అతి దగ్గరలో పట్టిసంలో వీరభద్రుడు భద్రకాళీ ఆలయం ఉంది. దక్షుని తల నరికిన తర్వాత వీరభద్రుడు 'పట్టిసాన్ని' (కత్తిని) కడిగినందువల్ల ఆ ప్రదేశానికి పట్టిసం అనే పేరొచ్చింది.

**లేపాక్షి :** అనంతపురం జిల్లాలో ఇది ఉంది. రావణాసురుడు సీతను అపహరించి ఆకాశ మార్గంలో తీసుకొని పోతున్నప్పుడు జటాయువు అనే పక్షీంద్రుడు అడ్డుపడ్డాడు. ఇద్దరి మధ్యా యుద్ధం జరుగుతుంది. రావణుడు తన ఖడ్గంతో జటాయువు రెక్కలు ఖండించగా జటాయువు కింద పడిపోతాడు. సీతను వెతుక్కుంటూ రామలక్ష్మణులు జటాయువు ఉండే చోటుకు వస్తారు. సీతను రావణుడు ఎత్తుకు పోయిన వృత్తాంతాన్ని జటాయువు రామలక్ష్మణులకు చెప్తాడు. అప్పుడు రాముడు జటాయువుని తన చేతులతో నిమిరి లేపాక్షి అన్నాడట. రామ స్పర్శతో జటాయువు ఇహలోక పరాలకు వెళ్ళిపోయాడట. లేపాక్షి అని రాముడు జటాయువుకు మోక్షప్రాప్తి కలిగించిన ప్రదేశమే లేపాక్షి అయిందని అదే జన వ్యవహారంలో లేపాక్షిగా పిలువబడుతోంది.

**2.1.2. కొండలు, కోనలకు సంబంధించినవి :** తెలుగు ఐతిహ్యాలలో ఈ కోవకు చెందిన ఐతిహ్యాలెన్నో ఉన్నాయి. ఉదాహరణకు ఈ ఐతిహ్యాన్ని గమనించండి.

తిరుపతిలోని తిరుమల కొండకు నడచి వెళ్ళే మార్గానికి అలిపిరి అనే పేరుంది. అయితే శిష్టులు అడిపడి (మొదటి మెట్టు) అలిపిరిగా రూపాంతరం చెందిందంటారు. అయితే సాధారణ ప్రజలు ఇందుకు భిన్నంగా ఒక ఐతిహ్యాన్ని చెప్తారు. హైదరాలి దండెత్తి చిత్తూరు ప్రాంతం మీదికొచ్చాడు. తిరుపతి పరిసర ప్రాంతాలలోని తొండవాడ, తిమ్మప్ప దేవాలయాన్ని నేలకూల్చి తర్వాత శ్రీనివాస మంగాపురాన్ని కొంత ధ్వంసం చేసి తిరుపతికి వస్తాడు. అలిపిరిలోని ఒక దేవాలయంలో మూలవిగ్రహాన్ని విరగ్గొడతాడు. ఇదంతా చూస్తూ ఉన్న ఒక హిందూ మంత్రికి ఒక ఆలోచన వచ్చి హైదరాలితో తిరుమలలో ఉండే దైవం వరాహస్వామి అని చెప్తాడు. వరాహం అంటే క్యాహై అంటాడు ఆలి. 'సువర్' అంటాడు హిందూ

మంత్రి. పందిని తాకితే ముస్లింలు ఏడు చెరువుల నీళ్ళు, ఏడు బావుల నీళ్లతో స్నానమాచరించాలంట. లేకపోతే వీళ్ళకు చెడు జరుగుతుందట. దాంతో ఆలీ 'ఛీ' హిందువులు సువర్కు పూజ చేస్తార్' అంటూ అక్కడ నుండి గుర్రంపై దౌడు తీస్తూ పారిపోతాడు. కాబట్టి ఆ ప్రదేశానికి ఆలీ పారే అంటే 'ఆలీ... పారిపోయే' అని అర్థం. ఆలిపారే లేదా ఆలీపారి తర్వాత అలిపిరి అయ్యిందంటారు. క్రీ.శ. 1782లో హైదరాలీ చంద్రగిరి కోటను ముట్టడించి చుట్టుపక్కల గుళ్ళను ధ్వంసం చేసింది వాస్తవమే. అయితే కొండమీదకి వెళ్ళకపోవడానికి అదే కారణం అవునో కాదో ఖచ్చితంగా చెప్పలేం. హైదరాలీ ధ్వంసం చేసిన గుళ్ళ రాతి శిల్పాలు ఇప్పటికీ శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో అలంకరించబడి ఉన్నాయి.

**నాచారం గుట్ట :** మెదక్ జిల్లాలో ఈ గుట్ట ఉంది. దీనిపై లక్ష్మీ నరసింహ స్వామి ఆలయం ఉంది. నాచారం గుట్ట అనే పేరుతో కూడా ఇక్కడి ఆలయాన్ని పిలుస్తారు. పూర్వం నాచర్ అనే భక్తుడు ఉండేవాడట. అతను ప్రతిరోజూ లక్ష్మీ నరసింహ స్వామికి ధూప దీప నైవేద్యాలను సమర్పించి పూజ చేసేవాడట. అందువల్ల ఇతనికి గుర్తుగా ఈ గుట్టను నాచారం గుట్ట అని పిలుస్తున్నారు.

**2.1.3. దేవాలయాలకు సంబంధించినవి :** వీటికి సంబంధించిన ఐతిహ్యాలు కోకొల్లలు. కింది ఐతిహ్యాన్ని గమనించండి.

మహానంది క్షేత్రం:- కర్నూలు జిల్లాలో మహానంది ఉంది. శిలాధుడి కొడుకు నందుడు శివభక్తుడు. ఈ నందుడు విద్యాభ్యాసం పూర్తి చేసి శివుడి గురించి తపస్సు చేశాడు. అతడి భక్తికి మెచ్చి శివుడు ప్రత్యక్షమైనాడు. అప్పుడు నందుడు శివుడిని రకరకాలుగా స్తుతించి ఆ ప్రదేశంలోనే నిన్ను ఇంకొంతకాలం పూజించే అదృష్టాన్ని నాకు కలిగించమని వేడుకొన్నాడట. తర్వాత నందుడు అన్ని పుణ్యక్షేత్రాలను దర్శించి వచ్చి మళ్ళీ తపస్సు ప్రారంభించాడు. అప్పుడు ఈశ్వరుడు పార్వతీ సమేతుడై ప్రత్యక్షమై, నీ కోరిక ఏమిటో చెప్పమన్నాడు. అందుకు నందుడు నీ వాహనమై ఎప్పుడూ నిన్ను మోసే అదృష్టాన్ని నాకు కలిగించమని వేడు కొన్నాడట. అందుకు శివుడు ఒప్పుకొని నువ్వు తపస్సు చేసిన ఈ ప్రదేశం ఐదు క్రోసుల మేరకు నీ పేరున క్షేత్రమై విలసిల్లుతుంది అని వరమిచ్చాడట అందుకే ఆ ప్రదేశం మహానంది క్షేత్రమైంది.

**2.1.4. దేవుళ్ళకు దేవతలకు సంబంధించినవి :** వీటికి సంబంధించిన ఐతిహ్యాలు కూడా అనేకం చోటు చేసుకొని ఉన్నాయి. చూడండి-

**రెడ్డమ్మ దేవత :** రెడ్డమ్మ దేవత చిత్తూరు జిల్లా గుర్రం కొండకు పది కిలో మీటర్ల దూరంలో చెర్లోపల్లి దగ్గర ఉంది. రెడ్డెమ్మ అనే పేరు గల దేవత వుండే కొండ కాబట్టి దీనికి రెడ్డెమ్మ కొండ అనే పేరు వచ్చింది. ఈ దేవత రెడ్లలో ఒక శాఖ అయిన ఎలమరెడ్ల ఆడపడుచు. నలుగురు అన్నదమ్ములకు ఆమె ఒకటే ఆడపడుచు. ఈమె జొన్న చేనుకు కాపలా వుండే సమయంలో గుర్రం కొండ నవాబు ఆమె సౌందర్యాన్ని చూసి మోహిస్తాడు. ఆమె దానికి నిరాకరిస్తుంది. అతడు బలవంతం చెయ్యబోతే ఆమె తప్పించుకొని పరిగెత్తితే అతను వెంటాడ్తాడు. చేసేది లేక ఒక బండరాయి ఎక్కి భూదేవిని రక్షించమని ప్రార్థిస్తే, ఆ బండ రెండుగా చీలుతుంది. దానిలో రెడ్డెమ్మ సమాధి అయ్యింది. నవాబు వచ్చే సమయానికి ఇవన్నీ జరిగి బండ చీలిక పూడిపోతుంది. ఒకరోజు ఒక వ్యక్తికి కలలో కనిపించి నేను ఫలానా చోట వుంటాను. నన్ను పూజిస్తే నీకు సంతానం కలుగుతుందని చెప్తుంది. అతడు అలాగే ఆమెను పూజించి సంతానాన్ని పొందుతాడు. అప్పటి నుంచి ఇప్పటి వరకు ఆ దేవతను పూజిస్తూనే వున్నారు. ఆ దేవత సంతానాన్నిచ్చే దేవతగా పూజింపబడుతోంది. ఇప్పటికీ ఆమె వరప్రభావం వల్ల పుట్టిన బిడ్డలకు ఆమె పేరు మీదుగా రెడ్డెమ్మ, రెడ్డెయ్య అనే పేర్లు పెట్టుకొంటున్నారు.

**అలమేలు మంగమ్మ - కరివేపాకు కథ :** చిత్తూరు జిల్లా నారాయణ వనంలో వేంకటేశ్వర స్వామికి అలమేలు మంగమ్మకు పెళ్ళవుతుంది. కొన్నాళ్ళకు అలమేలు మంగ కాపురానికి కొండకొచ్చింది. పుట్టింటి నుండి కాపురానికి కావలసిన వస్తువులన్నింటినీ తెస్తుంది. ఆ వస్తువులన్నింటినీ చూసిన వెంకటేశ్వరస్వామి కరివేపాకు తెచ్చావా? అని ప్రశ్నిస్తాడు. అయ్యో! మరచిపోయానని చెప్పి, కరివేపాకు తేవడానికి బయలుదేరుతుంది. అప్పుడు వెంకన్న పొద్దు పోయేలోపల కొండ చేరుకోవాలని లేదా పొద్దుపోయాక నువ్వెక్కడుంటే అక్కడే శిలగా మారి పూజలందుకొంటావని చెప్తాడు. అప్పుడు అలమేలు మంగమ్మ గబగబ కొండ దిగి నారాయణవనం చేరుకొని కావలసినంత కరివేపాకును తీసుకొని తొందర తొందరగా కొండకొస్తుంటుంది. అయితే అలమేలు మంగమ్మ తిరుచానూరుకొచ్చేసరికి పొద్దుపోతుంది. పాపం! అలమేలు మంగమ్మ అక్కడే శిలగా మారిపోతుంది. కరివేపాకు కథను బట్టి చూస్తే తిరుమల కొండలో ఒకప్పుడూ కరివేపాకు చెట్లుండేవి కావు. అంటే సహజ సిద్ధంగా కొండపై కరివేపాకు చెట్లు మొలకెత్తవు. ఇప్పుడిప్పుడే తిరుమలలో నివాసం ఉన్నవాళ్ళు కరివేపాకు చెట్లను పెంచుతున్నారు.

ఈ ఐతిహ్యాన్నే మరోరకంగా కూడా చెప్తారు. గమనించండి.

కొండకు కాపురానికెళ్ళిన అలమేలు మంగను ఎందుకు కరివేపాకును తేలేదని వెంకన్నను ప్రశ్నిస్తాడు. దాంతో అలమేలు మంగ వెంకటేశ్వరునిపై అలిగి కొండ దిగి తిరుచానూరులో శిలైపోయిందని అంటారు.

**2.2 సంచారి ఐతిహ్యాలు :** ఒక నిర్దిష్ట కాలంలో పుట్టి అక్కడే అభివృద్ధి చెంది, ఏదైనా నమ్మకాలతోనో, కర్మకాండలతోనో, మతాలతోనో కలిసిపోయి ఇతర ప్రాంతాలకు, దేశాలకు వ్యాపిస్తాయి. ఇవి చిన్న చిన్న కథల రూపంలో వుండు కుతూహలాన్ని రేకెత్తించడం వల్ల ఈ సంచారి ఐతిహ్యాలు ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి ప్రయాణం చేస్తుంటాయి.

**2.2.1. ఆత్మ బలికి సంబంధించినవి :** వీటికి సంబంధించిన ఎన్నో ఐతిహ్యాలున్నాయి. పూర్వం పుంగమ్మ అనే ఆమె ఒక చెరువు తవ్వించింది. వర్షాలు పడి చెరువు నిండినప్పుడల్లా ఒక చోట కట్ట తెగిపోయేది. ఇక లాభం లేదనుకొని ఈ గండి పడిన చోట తాను దూకి బలిచ్చుకుంది. పుంగమ్మ మీద మట్టిపోసి చెరువు గండిని పూడ్చేశారు. అప్పట్నుంచి ఇప్పటి వరకు చెరువుకట్ట తెగలేదట. అందుకని పుంగమ్మ సత్యం ఉన్నంతవరకు చెరువుకట్ట తెగదని అంటుంటారు. ఆ చెరువు కట్ట మీద పుంగమ్మ విగ్రహాన్ని ఉంచి చిన్ని గుడిని కట్టి పూజిస్తున్నారు. అక్కడ వెలసిన ఊరికి 'పుంగమ్మ ఊరు' అని, అదే 'పుంగనూరు'గా మారిందంటారు.

కార్వేటి నగర రాజుల మొదటి రాజధాని నారాయణ వనం. వీళ్ళు ఒకసారి వేటకు వెళ్ళినప్పుడు అక్కడ కుక్కల్ని, కుందేళ్లు తరమడం చూసి అక్కడ కోట కడ్తే బాగుంటుందని, అక్కడున్న అడవిని నరికి నగరాన్ని నిర్మించారు. కాబట్టి 'కాడు వెట్టి నగరం' ఆ తర్వాత కార్వేటి నగర రాజ్యమైంది.

పై ఐతిహ్యాన్ని వింటూనే మనకు విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించిన ఐతిహ్యం గుర్తుకొస్తుంది. హరిహర రాయలు, బుక్కరాయలు వేటకు వెళ్ళడం, అక్కడ కుందేలు, కుక్కను తరమడం చూసి సామ్రాజ్యాన్ని స్థాపించారని అంటారు. అట్లాగే బెంగుళూరును నిర్మించిన తెలుగు ప్రభువు కెంపె గౌడ కథ కూడా అట్లాంటిదే.

వేంకటాచల మహాత్మ్యంలో గోవు వృత్తాంతానికి చెందిన ఐతిహ్యం ఒకటుంది. రోజూ ఆవు పుట్టలో ఉన్న వెంకన్నకు పాలు ఇస్తుంటే, ఒకరోజు కోపంతో గొల్లవాడు దానిని గొడ్డలితో కొట్టబోతాడు. వెంకన్న వెంటనే పుట్టలోంచి పైకి లేచి గోవును తప్పిస్తాడు. ఆ గొడ్డలి దెబ్బ వెంకన్న తలకు తగులుతుంది. తర్వాత నీలాదేవి ద్వారా

తలనీలాలను తీసుకొంటాడు.

ఇలాంటి ఐతిహ్యాలు కర్ణాటకలో అనేకం ఉన్నాయి. మండ్య జిల్లాలో గుత్తలు అనే ఊరిలో ఒక ఆవు పుట్టలో పాలివ్వడం, గొల్లవాడు ఆవును కొట్టడం, ఆ దెబ్బ శివలింగానికి తగలడం, ఆ లింగంలోని కొంతభాగం మరో ఊర్లో పడ్డం వల్ల రెండు చోట్లా దేవాలయాలు వెలిశాయంటారు.

ఇలా ఐతిహ్యాలు జానపద గద్యాఖ్యానాలలో చోటు చేసుకొని ఉన్నాయి.

**3. జానపద కథలు :** ఒకప్పుడు మనకు వినోద సాధనాలు లేనప్పుడు పల్లెలోని, పట్టణాలలోని ప్రజలు కథలు చెప్పుకొని వినోదించేవారు. కాలక్షేపం చేసేవారు. విజ్ఞానాన్ని పొందేవారు. మానసిక ఉల్లాసాన్ని అనుభవించేవారు. అప్పుడే కాదు నేటి ఆధునిక యుగంలో కూడా జానపద కథలను చెప్పుకొని ఆనందిస్తున్నారు. అందుకే వీటిని జనప్రియ కథలంటారు. చిన్నపిల్లలు సైతం కథను వినందే నిద్రపోరు. పొలాలలో పనిచేసేవారు ఇప్పటికీ విశ్రాంతి సమయంలో పొలం గట్లపై కూర్చొని కథలను వింటుంటారు. అలాంటి కథలెన్నో సినిమాల రూపంలో కూడా వచ్చి విజయ ఢంకా మోగించాయి. జానపద కథలకున్న శక్తి అది. జానపదులు అనేక కథలను చెప్పుకుంటారు. అవి - అద్భుత కథలు, వినోద కథలు, ప్రాణి కథలు, సమస్యాత్మక కతలు. ఈ అన్ని కథలకు ఒక్కో ఉదాహరణను పేర్కొన్నా ఈ వ్యాసం బాగా విస్తరించిపోతుంది. అందుకని ఒక వినోద కథను మాత్రం ఉదాహరణగా పొందుపరచడమైంది. కింది కథను గమనించండి.

ఒక ఊర్లో ఒక బ్రాహ్మణ కుటుంబం ఉండేది. వారికి పిల్లలు లేరు. ఆ బ్రహ్మణుడు ఏ పని చేసినా పంచాంగం చూసి కాని చేసేవాడు కాదు. ప్రతి సందర్భానికి పంచాంగం చూసేవాడు. ఇలా వుండగా ఒకరోజు అతని భార్య అతనికి భోజనం పెట్టి, తాంబూలం ఇచ్చేటప్పుడు ఏదో మాట్లాడుతుండగా ఆమె నోటి తుంపర్లు అతనిపై పడ్డాయి. దానికి ఆ బ్రాహ్మడు అయ్యయ్యో నీ ఎంగిలి పైన బడ్డదే దీనికేవన్నా దోషముంటాదేమో చూస్తాఅని పంచాంగం తిరగేస్తే కాశీకి పోయి పదిహేను మునకలు వేస్తే ఆ దోషం హరించిపోతుందని ఉంది. దాంతో ఆ బ్రాహ్మడు "సరే నేనిక గుర్రం మీద కాశీకి ఎల్లిపోతున్నాను. నువ్వెందాక నా ఎమ్మిటికొచ్చి ఎంగిలి తుంపర్లు ఏశావు కాబట్టి ఈ దోషం నా దగ్గరుంటే ఎప్పుడైనా ప్రమాదమేను నేను కాశీకెళ్ళి పోతున్నా" అని చెప్పి బయలుదేరుతాడు. దారిలో ఆ బ్రాహ్మణుడు ఒక బ్రాహ్మణ పూటకూళ్ళామె ఇంటికి భోజనానికి వెళ్తాడు. ఆమె పూటకి కొన్ని వరహాలిస్తే భోజనం పెడ్తానని అంటుంది. అందుకతడు ఒప్పుకొని

భోజనం చేస్తాడు. భోంచేసి పైకి లేచేముందు విస్తరాకు మడవబోతాడు. అందుకా పూటకూళ్ళ బ్రహ్మణ స్త్రీ 'ఏవండేవండీ యిస్తరాకు మడవబాకండీ, ఈ ఊళ్ళో ఇస్తరాకులు చిక్కేది మహా కష్టం. ఇప్పుడు పదోవాడివి నువ్వు. ఆ యిస్తరాకులో భోంచేసే అయినికి - ఆ యిస్తరాకు కడిగెన్నా పెట్టాలి ఇంకెవరన్నా వొస్తే పెట్టాలి" అని అంది. అందుకా బ్రాహ్మణుడు 'రామ..... రామ, క్రిష్ణ.... క్రిష్ణ' అనుకుంటూ పరిష్కారం కోసం పంచాంగం తిరగేశాడు. ఎంగిలి విస్తరాకులో తిన్నందుకు కాశీలో యాభై మునకలు వేస్తే దోష పరిహారమవుతుందని ఉంది. సరే ఇంకేం చేద్దాం పదిహేను మునకలకు ఇంకో యాభై కలుపుకుంటే సరిపోతుందిలే అని గుర్తుగా రాసుకొని ప్రయాణమయ్యాడు. ఇంకో ఊరిలో భోజనానికి ఒక పేదరాశి పెద్దమ్మ ఇంటికెళ్ళాడు. బ్రాహ్మణుడే ఆమెను "ఏవమ్మా నువ్వు కొత్తిస్తరాకులో బెడ్తావా లేక ఆ వుర్లో ఎంగిలిస్తరాకులో పెట్టి కడిగి పెట్టుకుంటుందే అట్ట బెడ్తావా?" అని అడిగాడు. అందుకామె ఆ అట్టాగాదయ్యా, ఆ పన్జేసేదాన్ని గాదూ ఎవరికే యిస్తరాకూ మా వూళ్ళో యిస్తరాకులు దొరకత్తై - ఎవరిక్కావాల్సిన యిస్తరాకు వాళ్ళకు పెడతాను" అని చెప్పింది. సరేనని ఆ బ్రాహ్మణుడు భోజనం చేశాడు. తర్వాత ఆరుబయట మంచం వేసుకొని పడుకొని తాంబూలం కాని దొరుకుతుందా అని పేదరాసి పెద్దమ్మనడిగాడు. అందుకామె లేదని చెప్పి ఒక వక్క పలుకు ఇచ్చింది. ఆ వక్క పలుకుని నోట్లో వేసుకొని పఫపట మని కొరికాడా బ్రహ్మణుడు. అప్పుడా పేదరాసి పెద్దమ్మ "నీ పొల్లు చానా గెట్టిగున్నట్టున్నయ్యి యిప్పుడు పదిహేను మంది కొరికారు. యిది. ఎవరికీ నలగలేదు. నీ పళ్ళు చానా గెట్టియ్యి" అని అనింది. దాంతో బ్రహ్మణుడు తెగ బాధపడిపోతూ ఎంగిలి స్వయంగా కడుపులోకి పోయింది. కాబట్టి పరిష్కారం కోసం పంచాంగం తిరగేశాడు. ఈ పాపానికి కాశీలో ఐదువందల మునకలేస్తే పరిహారం అవుతుందని వుంది. ఇక మొత్తం మునకలు ఎన్నో రాసుకుని అక్కడ్నుంచి ప్రయాణమయ్యాడు. ఇకమీదట ఎక్కడా భోజనం చెయ్యకూడదు, తనే స్వయంగా వంట చేసుకుని తినాలి అని అనుకొని ఇంకో ఊరికి వెళ్ళేసరికి బియ్యం తెచ్చుకున్నాడు. వంటపాత్రలెక్కడా దొరకలేదు. ఇక ఇంటికి వెళ్ళి "అమ్మా! రవంత వంట పాత్రలుంటే ఇస్తావా నేనన్నమొండుకొని తినాలా" అన్నాడు. అప్పుడామె "అయ్యో లేదే మాకన్నీ సరిపోయేనే ఎట్టాజేసేదబ్బా" అనుకొంటూ ఏదో ఒక పాత్రనిస్తుంది. ఆ బ్రాహ్మణుడు ఆ పాత్రే చాలని తీసుకొని దాంట్లో వంట జేసుకొని తిన్నాడు. ఇంతలో ఆమె అత్తవచ్చి ఇక్కడున్న పాత్ర ఎక్కడా? అని అడిగింది. ఆమె బ్రహ్మణుడికి వండుకోని ఇచ్చానని చెప్తుంది. అప్పుడామె అత్త "అయ్యయ్యో అది కుక్కకు కూడేసే బొచ్చే, అదెందుకిచ్చావే' అని అంటుంది. అది విన్న బ్రహ్మణుడు విపరీతంగా బాధపడి పంచాంగం తిరగేయగా

ఐదువందల సార్లు ఐదువేల మునకలేస్తే శాంతి జరుగుతుందని రాసుంది. మొత్తం ఇవన్నీ లెక్కవేసుకొని ఆ బ్రాహ్మణుడు కాశీకి వెళ్ళి మునకలేసి పైకి లేవలేక చనిపోయాడు. ఒకరకంగా ఛాదస్తాలు కూడా పనికి రావని కూడా ఈ కథ పరోక్షంగా చెప్తోంది. (సేకరణ : డా. కె.వి సత్యనారాయణం)

ఇలా జానపద గద్యాఖ్యానాల్లో కథలు చోటుచేసుకొని తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేస్తున్నాయి.

**పురాగాతలు విశ్లేషణ :** పురాగాథల లక్ష్యం ప్రకృతిని, నేటి ప్రపంచ స్థితిని వివరించడమే కాక, ఆచార సంప్రదాయాలను, దేవతా మహాత్మ్యాలను గాథల రూపంలో వివరించి శ్రోతలకు, వాటిపైన నమ్మకాన్ని కలిగిస్తాయి. ప్రకృతి వివరణే కాకుండా మానవుని నడవడికను నియబద్ధం చేయడం రెండో లక్ష్యం. సమాజంలోని వ్యక్తుల భావాలను, చర్యలను ఒక ప్రామాణిక మార్గంలో పయనించడానికి పురాగాథలు దోహదం చేస్తాయి. ప్రాచీన కాలంలో ఆచార సంప్రదాయాలను, దేవతలను గౌరవిస్తే మంచి గతి కలుగుతుందని, నిర్లక్ష్యం చేస్తే ఆపదలు కలుగుతాయని తరతరాల వారిని హెచ్చరించడమే పురాగాథల నాలుగో లక్ష్యం. ఆచార సంప్రదాయాలను గౌరవించిన ప్రాచీనుల జీవితాలనే వర్తమాన, భావితరాల వాళ్ళు అనుసరించాలని పురాగాథలు బోధిస్తాయి. ఈ గాథలు భూతకాలపు వ్యవస్థను వివరించి, వర్తమాన భవిష్యత్తుల సామాహిక వ్యవస్థలను కూడా శాసిస్తాయి. దేవతా మహాత్మ్యాన్ని వర్ణించి, వాళ్ళను సంతోషపరచడానికి ప్రజల కర్తవ్యాన్ని, కర్మకాండల ఆచరణ విధానాలను పురాగాథలు బోధిస్తాయి.

**ఐతిహ్యాల విశ్లేషణ :** ఐతిహ్యాలు మన సంస్కృతి, సంప్రదాయ పరిరక్షకాలు. ఐతిహ్యాలలో ఎన్నో చారిత్రకాంశాలు కనిపిస్తున్నాయి. చరిత్రను శాసనాలు సాహిత్యం, నాణ్యాలు వంటి వాటితో నిర్మించవచ్చు. అట్లాగే ఐతిహ్యాల్లో ఉండే ప్రత్యక్ష, పరోక్ష ఆధారాల సహాయంతో చరిత్రను పునర్నిర్మించవచ్చు. ఐతిహ్యాలు మౌఖిక చరిత్రకు నిదర్శనాలు. ఐతిహ్యాల్లో అభూత కల్పనల్ని, అలౌకికాంశాల్ని తీసేస్తే చరిత్రకు నిధులు లాంటివి. ఐతిహ్యాలలో ఒక జాతి మత విశ్వాసాలు నిక్షిప్తమై ఉంటాయి. అట్లాగే వాటిని గుర్తు చేస్తుంటాయి కూడా. కథల్లో లాగే ఐతిహ్యాలలో కూడా మానవ జీవితం ప్రతిబింబిస్తోంది. ప్రజల నమ్మకాలకు, విశ్వాసాలకు ఐతిహ్యాలు అద్దం పడుతున్నాయి. ఐతిహ్యాలు మానవుని ఎదిగే మనసుకు ప్రతిబింబాలు ఐతిహ్యాలు మానవ కల్పనా శక్తికి నిదర్శనాలు. ఐతిహ్యాలలో వివిధ రకాల అనుభవాలు మిళితమై చిత్రమైన అనుభూతులకు గురి చేస్తుంటాయి. ఐతిహ్యాలు జనుల మనోల్లాసానికి తోడ్పడుతుంటాయి.

కొన్ని ఐతిహ్యాలు ప్రజల్ని, పిల్లల్ని అదుపులో పెట్టడాని ఉద్భవిస్తాయి. రహస్య నిధికి సంబంధించిన ఐతిహ్యాల వల్ల ఎన్నో చారిత్రక కట్టడాలు, దేవాలయాలు ధ్వంసం అయిపోతున్నాయి. దెయ్యాలు, భూతాలకు సంబంధించిన ఐతిహ్యాల వల్ల ప్రజలు మూఢ నమ్మకాలకు బలైపోతున్నారు. తద్వారా అభివృద్ధి కుంటుపడే అవకాశం ఉంది.

**కథలు విశ్లేషణ :** కథలు వినోదాన్ని, విజ్ఞానాన్ని కలుగజేస్తాయి. రోమాంచక వృత్తాంతాలెన్నో మనల్ని ఆశ్చర్యపరుస్తాయి. మనోల్లాసాన్ని కల్గిస్తాయి. మనస్సును రంజింపజేస్తాయి. అద్భుత విషయాలు మనల్ని ఊహాలోకాల్లో విహరింపజేస్తాయి. కాల్పనిక సంఘటనలెన్నో ఉంటాయి. ప్రజల జీవన విధానాలు, మనస్తత్వాలు, నమ్మకాలు, సాంస్కృతిక విషయాలు, కట్టుబాట్లు వంటి ఎన్నో విషయాలు జానపదుల కథల్లో చూడొచ్చు. కథలు భావ వ్యక్తీకరణ విధానాలే కాకుండా, జానపదుల కష్ట నిష్ఠూరాలను యథాయథంగా ప్రతిబింబిస్తుంటాయి. మన ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, చారిత్రల విషయాలు ఎన్నో చోటు చేసుకొని ఉంటాయి. అలాగే సాహిత్యపు విలువలను కూడా కలిగి ఉంటాయి.

ఇలా జానపద గద్యాఖ్యానాలలో పురాగాథలు, ఐతిహ్యాలు, కథలు చోటు చేసుకొని తమ ప్రత్యేకతను చాటుకుంటున్నాయి.

## ఆదార గ్రంథాలు :


1. తెలుగు జానపద సాహిత్యము - పురాగాథలు
- డా. రావి ప్రేమలత

2. ఆంధ్రుల జానపద విజ్ఞానము
- ఆచార్య ఆర్వీయస్ సుందరం

3. తెలుగు ఐతిహ్యాలు
- ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి

4. జానపద గేయాల్లో శ్రీ వేంకటేశ్వరుడు
- ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి

5. జానపద విజ్~ఝాన వ్యాసావళి
- ఆచార్య జి. యస్. మోహన్

6. నెల్లూరు జిల్లా జానపద కథలు - ఒక పరిశీలన
- డా. కె.వి. సత్యనారాయణ

# మహాభారతంలోని ప్రాణి కథలకు మూలం జానపద సాహిత్యం



డా. తరపట్ల సత్యనారాయణ
✆ 92906 30752

## 1.1 ప్రవేశిక :

ప్రపంచ సాహిత్యంలో అన్నింటికంటే అతి ప్రాచీనమైన సాహిత్యం మౌఖిక సాహిత్యం. తరతరాలుగా, వారసత్వ సంపదగా, ఒక తరం నుండి మరొక తరానికి, ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి మౌఖిక ప్రచారం ద్వారా అభివృద్ధి చెందిన భాషా సాంస్కృతిక సాహిత్య సంపదే జానపద సంపదగా భావించవచ్చు. మానవ చరిత్ర ఎంత ప్రాచీనమైనదో, ఎంత సుదీర్ఘమైందో జానపద సాహిత్యం కూడా అంతే ప్రాచీనమైంది. సుదీర్ఘమైందిగా కనిపిస్తుంది. శిష్ట సాహిత్యానికి లేక పండితుల చేత గ్రంథస్తమైన సాహిత్యానికి మూలం జానపద సాహిత్యమే. వర్ణనలకు, వ్యక్తీకరణకు, కల్పనలకు, వస్తు వైవిధ్యానికి నిలయమై అనాదరణకు గురై అజ్ఞాతంగా మిగిలిపోయింది. పల్లె భాషగా, పల్లె పదాలుగా శ్రమ జీవుల చెమట భాషగా జానపద సాహిత్యం మరుగున పడిపోయింది. ఎంతోమంది కృషి ఫలితంగా జానపద సాహిత్యం శిష్ట భాష కంటే సులభంగా అర్థమై నిఘంటువుల అవసరం లేకుండా ప్రజా భాషగా నిలబడి ప్రపంచ వీధుల్లో మన ప్రాచీన జన సంస్కృతిక మూల భాషగా వాసికెక్కింది. విలియమ్ థామ్స్ అలెన్ దండస్, ఆర్. ఎస్. బాగ్స్ నుండి ఆర్వీయస్ సుందరం, బిరుదరాజు రామరాజు, జి.ఎస్. మోహన్, తంగిరాల వెంకట సుబ్బారావు, ఎం. జయదేవ్, భక్తవత్సలరెడ్డి, కృష్ణారెడ్డి వరకుగమనిస్తే వారి కృషి ఫలితంగా పరిశోధనల ఫలితంగా, జానపద విజ్ఞానం విశ్వ విద్యాలయ స్థాయిలో విస్తృతంగా వ్యాపించి బోధన, పరిశోధన రంగాల్లో, ప్రగతిని సాధించింది. విజయకేతనం ఎగరేసింది జానపదం.

## 1.2 ప్రధాన ఉద్దేశం :

భారతదేశం అతి ప్రాచీనమైన సాంస్కృతిక ఆధాత్మిక, ఆచార, సంప్రదాయాల భావజాలమున్న వసుధైక దేశం. ఇక్కడ ఉన్న అతి పవిత్రమైన గ్రంథాల్లో భారత ఇతిహాసాలు అత్యంత ప్రధానమైన ఇతిహాసాలుగా నిలిచాయి. ఐరోపా దేశాల్లో మహేతిహాసాలుగా పిలువబడుతున్న ఇలియడ్ ఒడిస్సి కంటే అతి పెద్దదైన రామాయణం భారతాలు మన దేశ వైదిక సంస్కృతికి చిహ్నాలుగా నిలిచి ప్రపంచంలోనే ఒక ప్రత్యేకతను సాధించి ప్రాధాన్యతను కలిగి ఉన్నాయి. సంస్కృతంలో వేదవ్యాసుడు రాసిన భారతంలో ఎన్నో ఉపాఖ్యానాలున్నాయి. వాటిలో చాలావరకు మనకు పరిచయమైన కట్టుకథలు, ప్రాణి కథలు, అద్భుత కథలు, నీతి కథలు పరిశీలిస్తే వాటికి మూలం జానపదులు పాడుకునే కథా గేయాలు, బిక్షుగాయకులు పాడుకునే భక్తి గేయాలు గుర్తుకొస్తాయి. కొంతమంది పండితులు ఆయా కాలాల్లో ఆయా సందర్భాల్లో ఏవిధంగా చొప్పించారు. వాటి పూర్వపరాలను పరిశీలించే క్రమంలో ప్రాణికథలను వివరించే ప్రయత్నమే ఈ వ్యాసం ముఖ్య ఉద్దేశం.

## 1.3 జానపద కథలు - ప్రధానాంశాలు :

కథా సాహిత్యం ఆబాల గోపాలాన్ని ఆకర్షిస్తుంది. అందుకే కథకు అంత ప్రాధాన్యత ప్రత్యేకత ఏర్పడింది. భారతదేశం జానపద కథలకు పుట్టినిల్లు లాంటిది. అతి ప్రాచీన కాలం నుండి ఈ దేశంలో కథలు చెప్పడం ఆచారంలో భాగంగా నిలిచింది. సినిమాలు, టీ.విలు లేని రోజుల్లో పిల్లలకు, పెద్దలకు కథలే విజ్ఞానాన్ని వినోదాన్ని అందించడంతో పాటు భక్తితత్వాన్ని కూడా ప్రబోధించాయని చెప్పవచ్చు. కథ చెప్పడం ఒక కళ. అందరూ కథను అందంగా చెప్పలేరు. దానికి కొన్ని లక్షణాలుంటాయని వాటిని ఆరు రకాలుగా వర్గీకరించారు ఆచార్య ఎమ్. జయదేవ్ గారు. వాటిలో 1. కథను అందంగా, ఆసక్తికరంగా ఉత్సాహం కలిగే విధంగా చమత్కారంగా చెప్పాలి. 2. తడుముకోకుండా ధారాళంగా చెప్పగలగాలి 3. శ్రోతల వయస్సు, మనస్సును, అనుభవాన్ని, సంస్కారాన్ని గ్రహణ సామర్థ్యాన్ని, అభిరుచిని బట్టి కథను చెప్పగలగాలి. 4. సమయస్ఫూర్తి, హాస్య ప్రియత్వం కలిగి ఉండాలి. 5. కథ చెప్పేటప్పుడు మంచి మంచి సామెతలు జాతీయాలు , అలంకారాలు ప్రయోగించాలి 6. మధ్యలో శ్రోతలకు కలిగిన సందేహాలకు చక్కని వివరణ ఇవ్వాలి, ఇటువంటి లక్షణాలు కలిగి కథ కల్పనలోను, అభివ్యక్తీకరణలోనూ, పాత్ర చిత్రణలోనూ, భాషోచ్చారణలోనూ,

అభినయకౌశలంతో చెప్పే కథల్లో జానపదుల్లో ఉన్న ప్రతిభను తెలియజేస్తాయి. జానపదులు తన అనుభవంలో ఉన్నవి, చూసినవి. విన్నవి, ఊహించినవి, వస్తువుగా మార్చుకుని సహజత్వానికి దగ్గరగా కొన్ని ఊహాకల్పనతో కొన్ని కథలు చెబుతారు. అలా రూపొందించిన కథలు జన సామాన్యంలోకి వదలిపెడతారు. అవి ఆనోటా ఈనోటా తిరిగి తిరిగి విశ్వవ్యాప్తం అవుతాయి. విశ్వవ్యాప్తం అయిన కథలో రామాయణ భారతాల్లో కూడా చేరతాయి. తర్వాత వివిధ రకాలుగా లక్షకుయించి శ్లోకాలతో భారత ఇతిహాసాలు విస్తృత పరిధిని పొంది ప్రచారంలో నిలిచాయి.

## 1.4 సంస్కృత భారతంలో కనిపించే కథలు :

సంశ్కృత భారతంలో జానపద కథలు అనే అంశం మీద ఆచార్య ఎం. జయదేవ్ గారు అద్భుతమైన పరిశోధన దృక్పథంలో ఒక గ్రంథాన్ని రాశారు. అందులో సమగ్ర పరిశీలన ఉంది. సంస్కృతాంధ్ర భాషల్లో ఉన్న భారత రచనా విధానంలో ప్రత్యేకమైన పరిశీలనా దృష్టి పుష్కలంగా కనిపిస్తుంది. వాటితో పాటు సహేతుకమైన పరిశోధన పటిమ, ప్రశ్న - సమాధానం అనే రెండు అంశాలపై శాస్త్రీయమైన ఆధారాలను ప్రత్యక్షంగా చూపించే సరికొత్త వైజ్ఞానిక దృష్టి కనిపిస్తుంది. అందుకే ఈ అంశాన్ని ఎన్నుకోవడం జరిగింది.

మొదటిగా వ్యాసుడు జయం అనే పేరుతోనే భారతాన్ని రాశాడు. ఆ తరువాత కాలంలో మార్పులు జరిగి భారతంగా పిలువబడింది. ఆ తరువాత మరికొన్ని మార్పులు చేర్పులు జరిగి మహా భారతం అయింది. జయంగా పిలువబడినప్పుడు కేవలం 8800 శ్లోకాలు ఉన్నాయి. తరువాత భారతంగా పిలువబడినప్పుడు 2400 శ్లోకాలు ఉన్నాయి. ఆ తరువాత మహా భారగంగా పిలువబడినప్పుడు ప్రస్తుతం లక్షకు పైగా శ్లోకాలకు చేరుకుందనే విషయం అందరికి తెలిసిన విషయమే. ఈ రచనా క్రమంలోనూ ప్రచారంలోనూ, మార్పులు చేర్పుల ఫలితంగా వ్యాసుడూ రాసిన జయం పన్నెండు రెట్లకు పెరిగినట్లు గుర్తించుకోవాలి. వ్యాసుని తరువాత కాలంలో చాలామంది సంస్కృత పండితులు అనేక ఉపాఖ్యానాలతో, శాస్త్ర విషయాలను చొప్పించినట్లు తెలుస్తుంది. వీటిలో కల్పనల్ని గమనిస్తే ప్రధానంగా యక్షులు, గాంధర్వులు, దేవతలు వారికి సంబంధించిన కథలు, ఋషులు, గోవులు, విశ్వసృష్టి, పతివ్రతలు, చక్రవర్తులు, అనేక మహాత్మ్యాలు, ఊర్ధ్వ అధోలోకాలు, అనేక పక్షులు వంటి అంశాలు చిత్ర విచిత్రంగా ఇది నిజమే కదా అనే విధంగా ఏ ప్రశ్న తలెత్తకుండా అందంగా చొప్పించారు పండిత

> మొదటిగా వ్యాసుడు జయం అనే పేరుతోనే భారతాన్ని రాశాడు. ఆ తరువాత కాలంలో మార్పులు జరిగి భారతంగా పిలువబడింది. ఆ తరువాత మరికొన్ని మార్పులు చేర్పులు జరిగి మహా భారతం అయింది.

శ్రేష్ఠులు. ధర్మార్థకామ మోక్షాలకు సంబంధించిన విషయాలు, తత్వ, వేదాంత శాస్త్ర విషయాల ప్రస్తావన కూడా గమనించవచ్చు. వీటికి మూలం ఆనాటి జానపద వ్యవహారంలో ఉన్న అనేక కథలే అని చెప్పవచ్చు. ఇటువంటి కథలు సంస్కృత భారతంలో ఎక్కువగా ఆదిపర్వం, శాంతి పర్వం అను శాసన పర్వాల్లో కనిపిస్తాయి. అలాగే వన, సభ, ద్రోణ, కర్ణ, శల్య పర్వాల్లో ఒక్కొక్కటి చొప్పున కనిపిస్తాయి. వీటిలో ఏ ఒక్క కథనూ వ్యాసుడు రాయలేదని తెలుస్తోంది. ఆదిపర్వంలో అనుక్రమణికా పర్వం అనే ఉపపర్వంలో భారత రచనకు సంబంధించి చెప్పిన అమానుషాంశాలను హేతుబద్ధంగా విశ్లేషిస్తే భారత కథను వ్యాసుడు రాయాడానికి ముందు జానపద కవి చేత ప్రచారంలో వున్న వీరగాథ మౌఖిక ప్రచారంతో గాయక భిక్షులచేత జన వ్యవహారంలో ప్రసిద్ధి పొంది ఉండాలి. దానినే విన్న వ్యాసుడు జయం పేరుతో భారతాన్నే రాసినట్లు గుర్తించాలి. సంస్కృత భారతంలో ఉన్న కట్టుకథల సంఖ్య ఇరవై రెండు. ప్రాణికథల సంఖ్య తొమ్మిది, నీతి కథల సంఖ్య ఎనిమిది, అద్భుత కథల సంఖ్య మూడు, మొత్తం మీద సంస్కృత భారతంలో ఉన్న జానపద కథలన్నీ పరిశీలిస్తే 42 కథలు వ్యాస భారతంలో కనిపిస్తాయి. ప్రస్తుతం ప్రాణి కథలను గూర్చి తెలుసుకుందాం.

### 1.5 ప్రాణి కథలు:-

ఆంగ్లభాషలో వీటిని ఏనిమల్ టేల్స్ అంటారు. ప్రాణులకు సంబంధించిన కథలే ప్రాణి కథలు. వీటిని తిర్యక్కథలు అని కూడా అంటారు. తిర్యక్కులు అంటే పశుపక్ష్యాదులు అని అర్థం. అంటే వీటిలో పశువులు, పక్షులు, క్రిములు, కీటకాలు వాటికి సంబంధించినవి. మనిషి కూడా రెండు కాళ్ళ జంతువే కాబట్టి మనిషి కూడా ప్రాణి కథల్లో భాగమౌతుంటాడు. ఈ కథల్లో చిత్రవిచిత్రమైన రూపాలు

పొందడం చివరకు మనిషిగా మారడం గమనించవచ్చును. జానపదులు అద్భుతమైన సృజనా శక్తిగల వారిగా కనిపిస్తారు. ఈ కథల్లో వ్రతాలు, తీర్థాలు, తిరునాళ్ళ, పూజలు, పునస్కారాలు వంటి వాటి వల్ల భక్తితత్వం పెరుగుతుంది. ఆపదలు వచ్చినా సంతోషం వచ్చినా మొక్కులు మొక్కడం, బలులు వేయడం జరుగుతుంది. అటువంటి ఆచారాల్లో భాగంగా జానపదులు కథలను అద్భుతంగా చిత్రికరిస్తారు. కొన్ని పాత్రలు రాక్షసులుగా మారిపోవడం, పక్షులుగా మారడం, జంతువులుగా మారడం, మనుషుల భాషలో మాట్లాడడం, సహాయంచేయడం, మోసం చేయడం, మాయారూపాలు పొందడం, నల్ల గులాభిగా మారడం, చేపగా మారడం, గండభేరుండ పక్షిగా మారడం, పాముగా మారడం, కుక్కగా మారిపోవడం, మనిషిగా వచ్చి మాట్లాడడం వంటివి కనిపిస్తాయి. ఇవి అద్భుత కథల్లాగ కొన్ని సందర్భాల్లో దర్శనమిస్తాయి.

> పంచతంత్రంలో ఈ విధమైన కథలు కనిపిస్తాయి. అందులో ఉన్న పాత్రలన్నీ పశుపక్ష్యాదులే, కాని మానవుని భాషలో మాట్లాడటం, మానవులకు సమాజానికి సంబంధించిన అంశాలు ప్రబోధించడం.

పంచతంత్రంలో ఈ విధమైన కథలు కనిపిస్తాయి. అందులో ఉన్న పాత్రలన్నీ పశుపక్ష్యాదులే, కాని మానవుని భాషలో మాట్లాడటం, మానవులకు సమాజానికి సంబంధించిన అంశాలు ప్రబోధించడం. వీటితో స్నేహం, ధర్మం , నీతి, మిత్రులు, శత్రువులు వివిధ మనస్థత్వం చిత్రణ కనిపిస్తుంది. అలాగే ప్రాణి కథలు సంస్కృత భారతంలో చాలావరకు ఉన్నాయి. వాటిలో జరిత - పిల్లల కథ, తెలివైన నక్క కథ, దుర్మార్గపు హంస కథ, హంస కాకి కథ, మూషిక మార్జాల సంబంధ కథ, గృధ - గోమాయు కథ, వ్యాఘ్ర- గోమాయు కథ, ఉష్ట్రగ్రీవో పాఖ్యానం, చిలుక కథ వంటివి, వీటినే అడవి ప్రాణుల కథలు, అడవి జంతువుల కథలు మనుషులు దేవతల కథలుగా విభజించవచ్చు.

## జరిత - పిల్లలు కథ :

ఈ కథ సంస్కృత భారతంలో ఆదిపర్వంలోని ఖాండవ దహన పర్వమనే ఉపపర్వంలో 229వరకు ఉంది. నూట ముప్పై శ్లోకాలలో ఉంది. జనమేజయునికి వైశంపాయనుడు ఈ కథ చెబుతాడు. ఖాండవ వనంలో నాలుగు శారంగ పక్షుల పిల్లలు ఎలా బ్రతికాయని అడగగా దానికి సమాధానంగా ఈ కథను చెబుతాడు.

మందపాలుడనే ఋషి కఠినమైన బ్రహ్మచర్యాన్ని పాటించి గొప్ప తపస్సు చేసి దేహం విడిచి పితృలోకానికి వెళ్ళాడు. కాని తన తపస్సునకు తగిన ఫలితం పొందలేక యమధర్మ రాజు దగ్గరకు వెళ్ళాడు. దానికి కారణం ఏమిటని అక్కడ ఉన్న దేవతలను అడుగుతాడు. దీనికి కారణం బ్రహ్మచర్యాన్ని పాటించి సంతానం పొందలేక పోవడం చేత ఫలాన్ని పొందలేవని చెబుతాడు. అందువల్ల భూలోకానికి వెళ్ళి సంతానం పొందమని చెప్పగా భూలోకానికి వచ్చి త్వరితగతిలో సంతానాన్ని పొందాలని భావిస్తూ పక్షులలో జరిత అనే శారికతో శారికుడై జతకట్టగా అది నాలుగు గుడ్లు పెడుతుంది. మందపాలుడు జరితను వదలి లపిత అనే మరొక శారిక దగ్గరకు వెళ్ళిపోతాడు. తర్వాత జరిత నలుగురు పిల్లల్ని కంటుంది. ఆ సమయంలో ఖాండవ వనాన్నే దహించడానికి అగ్ని దేవుడు వస్తాడు. అది తెలుసుకున్న మందపాలుడు అగ్నిదేవుణ్ణి ప్రార్థించి నలుగురు పిల్లల్ని రక్షించమంటాడు. దానిని అంగీకరించి రక్షిస్తాడు అగ్నిదేవుడు. ఈలోగా జరిత పిల్లల్ని చూసి దుఃఖించి మందపాలుణ్ణి నిందిస్తూ పిల్లల్ని కన్నంలోకి పంపి పైన చెత్తతో నింపి ప్రాణాలను రక్షించుకోడాని వెళ్ళే ప్రయత్నం చేస్తుంది. కాని నలుగురు పిల్లలు అంగీకరించక లోనికెళ్ళి ఎలుకలకు ఆహారం అవడం కంటే అగ్నిలో ఆహుతి అవ్వడం మేలంటుంటే ఈలోగా అగ్ని దేవుడు మాట ప్రకారం పిల్లల్ని రక్షిస్తాడు. అప్పుడు మందపాలుడు వచ్చినా పిల్లలు భార్య మాట్లాడరు. అగ్ని దేవుణ్ణి వేడుకున్నానని

మందపాలుడనే ఋషి కఠినమైన బ్రహ్మచర్యాన్ని పాటించి గొప్ప తపస్సు చేసి దేహం విడిచి పితృలోకానికి వెళ్ళాడు. కాని తన తపస్సునకు తగిన ఫలితం పొందలేక యమధర్మ రాజు దగ్గరకు వెళ్ళాడు.

చెప్పి వెళ్ళిపోతాడు. ఇదీ ప్రధాన కథ.

ఈ కథలో నన్నయ ఏ విధంగా మార్పులు చేయలేదు. పురుషుడైన మందపాలుడు కేవలం కోర్కెలు తీర్చుకోవడం కోసం సంతానం కోసమే జత కట్టడంలో స్వార్థ పరత్వం తేటతెల్లమవుతుంది. ఇది జరిగినది కాదు. జానపదులు ఊహకల్పనకు ప్రత్యక్ష సాక్ష్యంగా కనిపిస్తుంది. మనుషుల ప్రవర్తనా వాదానికి నిలువెత్తు సాక్షంగా జరిగిన కథను పండిత కవులు కల్పించినట్లుగా చెప్పవచ్చు.

## తెలివైన నక్క కథ :

ఈ కథ ఆదిపర్వంలోని సంభవ పర్వం అనే ఉపపర్వంలో 140 అధ్యాయంలో 24 నుంచి 49 వరకు ప్రస్తావించబడింది. 26 శ్లోకాల్లో వున్న ఈ కథ దృతరాష్ట్రుడు కణికుడనే మంత్రిని అడుగుతూ శత్రువుని సామదాన దండోపాయంతో ఎలా చంపగలమో చెప్పుమన్న సందర్భంలో ఉంది.

> ఒక అడవిలో మితిమీరిన స్వార్థంతో నివశిస్తున్న తెలివైన నక్క ఉండేది దానికి పులి, తోడేలు, నెమలి, ఎలుక అనే మిత్రులుండేవారు. అవి బలమైన జింకను చూసి దాన్ని చంపి తినడానికి ఉపాయాన్ని ఆలోచిస్తారు

ఒక అడవిలో మితిమీరిన స్వార్థంతో నివశిస్తున్న తెలివైన నక్క ఉండేది దానికి పులి, తోడేలు, నెమలి, ఎలుక అనే మిత్రులుండేవారు. అవి బలమైన జింకను చూసి దాన్ని చంపి తినడానికి ఉపాయాన్ని ఆలోచిస్తారు నక్క ఎలుకతో 'నీవు జింక నిద్రపోతున్నప్పుడు కాళ్ళు కొరికి గాయంచేయి. పరుగెత్తలేని స్థితిలో ఉన్న జింకను పులి సులభంగా చంపగలుగుతుంది. అప్పుడు అదిమనకు ఆహారమౌతుంది అంటుంది. వెంటనే చెప్పిన విధంగా ఎలుక కాళ్ళకు గాయం చేయడంతో జింక పరుగెత్తలేక పులి దాడికి చనిపోతుంది. అప్పుడు నక్క అందరిని చూసి మీరు వెళ్ళి స్నానం చేసిరండి అని చెప్పగా నదికి వెళ్ళి స్నానం చేసి మొట్టమొదటగా వచ్చిన పులిని చూసి మహానుభావ ఎలుక జింకకు గాయం చేయడం వల్లనే నీకు దొరికిందని నా వల్లే జింక నీకు దొరికిందని చెప్పగా పులి ఎలుక సహాయంతో పొందిన ఈ జింకను తిననని వెళ్ళిపోయింది. తరువాత ఎలుక అక్కడికి రాగానే దాంతో నక్క ఎలుక

నీకు శుభం కలగాలి. నెమలి జింక మాంసాన్ని తినదని ఎలుకనే తింటానని నాతో చెప్పింది అనగానే ఎలుక అక్కడనుండి పారిపోయింది తర్వాత తోడేలు రాగానే నక్క పులి నీమీద కోపంగా ఉంది. అది భార్యని తీసుకుని రావడానికి వెళ్ళింది అనగానే తోడేలు ఏం కీడు కలుగుతుందోనని వెళ్ళిపోయింది చివరిగా నెమలి రాగానే నక్క మీకు జింక మంసం కావలంటే నన్ను ఓడించి జింక మాంసాన్ని తిను అనగానే నీతో యుద్ధం చేసే ఉత్సహం నాకు లేదు అని వెళ్ళిపోతుంది. ఈ విధంగా తెలివైన నక్క సామదానదండో పాయంతో అందరిని బెదిరించి పంపేసి జింక మాంసాన్ని దక్కించుకుంది.

ఇటువంటి జానపదుల కథలను పండిత కవి స్వీకరించి సంస్కృత భారతంలో చేర్చాడని తెలుస్తుంది. నన్నయ ఈ కథను వదలి వేశాడు.

## దుర్మార్గపు హంస కథ :

ఈ కథ సభా పర్వంలో శిశుపాల వధ అనే ఉపపర్వంలో చెప్పబడింది. ధర్మరాజు అశ్వమేధ యాగ పరిసమాప్తిలో శ్రీ కృష్ణుని అగ్రపూ జార్హతను ప్రశ్నిస్తూ శిశుపాలుడు భీష్మునితో ఈ కథ చెప్పినట్లు తెలుస్తుంది.

పూర్వం ఒక సముద్ర తీరంలో ముసలి హంస ఒకటుండేది. అది ఆహారం కోసం తిరగలేక ధర్మ పన్నాలతో దగ్గరలో ఉన్న పక్షులను ఆకర్షించడం చేసుకుంది. ఆ మాటలు విన్న పక్షులు దయతో దానికి ఆహారాన్ని అందిస్తూ ఉండేవి. అంతేగాకుండా తమ గుడ్లను హంస దగ్గర నమ్మకంగా పెట్టి వెళ్తుండేవి. కొద్దిరోజులకు గుడ్లు తరిగిపోవడం గమనించిన పక్షులకు అనుమానం వచ్చి కాపుకాసి నిజాన్ని నిర్ధారణ చేసుకుని పక్షులన్నీ దాడి చేసి హంసను చంపేస్తాయి. ఈ కథ చిన్నదైనా

పూర్వం ఒక సముద్ర తీరంలో ముసలి హంస ఒకటుండేది. అది ఆహారం కోసం తిరగలేక ధర్మ పన్నాలతో దగ్గరలో ఉన్న పక్షులను ఆకర్షించడం చేసుకుంది. ఆ మాటలు విన్న పక్షులు దయతో దానికి ఆహారాన్ని అందిస్తూ ఉండేవి.

నమ్మకానికి జరిగిన ద్రోహ చింతన, దానికి తగిన శాస్తి జరిగిన తీరును పరిశీలిస్తే ఈ కథ జానపదాలలో వున్నది. దానిని పండితకవులు భారతంలో చెప్పినట్లు గమనించవచ్చు.

జానపద కథల్లో కనిపించే పక్షుల్లో గ్రద్ధ, కాకి, కొంగ మొదలైన దుర్మార్గపు పక్షులుగా పేర్కొనడం గమనించవచ్చు. హంస మాత్రం అరుదైన పక్షి. ఇవి శిష్ట సాహిత్యంలో కనిపిస్తుంది. సరోవర తీరంలో స్వేచ్ఛగా తిరిగే పక్షిగా కవుల ప్రస్తావనలో కనిపిస్తుంది. నన్నయ ఈ కథను కూడా విస్తరించకుండా క్లుప్తంగా చెప్పినట్లు గమనించవచ్చు. వ్యక్తుల స్వభావం ఈ కథలో కనిపిస్తుంది.

### హంస - కాకి కథ :

ఈ కథ కర్ణ పర్వంలో నాలుగవ అధ్యయనంలో డెబ్బై ఎనిమిది శ్లోకాల్లో ఉంది. దీన్ని కర్ణుని రథసారథి యైన శల్యుడు కర్ణునితో చెపుతాడు. యుద్ధంలో శత్రువైన అర్జునుణ్ణి తక్కువచేసి తనకోసం గొప్పగా చెప్పుకునే సందర్భంలో శల్యుడు కర్ణునికి చెబుతాడు.

సముద్ర తీరంలో ఒక రాజ్యం ఉంది. ఆ రాజ్యంలో ధనవంతుడైన ఒక వైశ్యుడుండేవాడు. వాని కుమారులు ప్రతిరోజు అక్కడ వున్న కాకికి ఎంగిలి మెతుకులు వేసేవారు. అవి తిన్న కాకి బలశాలిగా తయారైంది. పెరుగ పాయసం, పాలు మాంసం తినడం వల్ల సాటి పక్షులను తులనాడే స్థితికి చేరుకుంది. ఒకరోజున కోమటి కుమారులు కాకితో అన్ని పక్షుల్లో కల్ల శ్రేష్టమైనదానివి గొప్ప శక్తి గలదానివి. అటువంటి నీవు హంసలతో పోటీ పడగలవు అనగానే మూర్ఖురాలైన ఆ కాకి వాటితో పోటీకి దిగి, నేను ఎన్ని విధాలుగా ఎగరగలనో తెలుసా అని పోటీలో పాల్గొంది. చివరకు ఆయాసం వచ్చి చేసేది లేక సముద్రంలో మునిగిపోయే స్థితికి రాగ హంస దాన్ని రక్షించి ఒడ్డుకు చేర్చి ప్రాణాన్నే కాపాడింది. ఈ కథ జానపదుల నుండే స్వీకరించి పండిత కవులు భారతంలో చేర్చి జానపద సాహిత్యంలో కోకొల్లలుగా ఉన్నాయి. దీన్నే శల్య సారథ్యం అంటారు. తిక్కన ఈ కథలో చిన్నమార్పు చేశాడు.

### వ్యాఘ్ర - గోమాయుసంవాదం :

వ్యాఘ్రమంటే పులి, గోమాయువు అంటే నక్క అని అర్థం. దీనినే నక్క పులి కథ అని జానపదాలలో కనిపిస్తుంది. ఈ కథ శాంతి పర్వంలో పద్నాలుగవ అధ్యాయంలో తొంభై శ్లోకాలలో వివరంగా వ్రాయబడి ఉంది. ధర్మరాజు భీష్ముణ్ణి

"శార్దూలం మాటలు విన్న తన తల్లి అసలు విషయం చెబుతుంది. తను అపరాధి కాదని అంటుంది. మలిన మనస్కులైన వారు నిర్దోషులను దోషులగా చూపిస్తారు. వీరు ఇతరుల ఔన్నత్యాన్ని అంగీకరించలేరని అంటుంది."

క్రూరులు సౌమ్యంగాను, సౌమ్యులు క్రూరంగానూ కనిపిస్తారని అలాంటి వారిని ఎలా తెలుసుకోగలమని అడగ్గా ఈ కథను చెబుతారు.

పూర్వం పురిక అనే పేరుగల పట్టణాన్ని పౌరికుడు అనే పేరుగల దుర్మార్గపురాజు ఒకడుండేవాడు. అతడు ఇతరులను హింసిస్తూ ఆనందపడేవాడు. అతడూ చనిపోయి మరుసటి జన్మలో నక్కగా జన్మించాడు. కాని పూర్వజన్మలో ఉన్న లక్షణాలు లేకుండా సత్యవాక్పరిపాలన వ్రతాన్ని పాటిస్తూ చెట్ల నుండి రాలిన పండ్లను , నియమిత సమయాల్లో తినడం స్మశానాల్లో జీవించడం చేసేది. తోటి నక్కలు మాలాగే ఉండమని ఆహార నియమాలు మార్చుకోమని చెప్పగా వేదాంత ధోరణిలో మంచి, కర్మలను పాటించాలని, కేవలం తిండి మీదే ఆసక్తి చూపకూడదని, దానివల్ల వచ్చే పాపం ఇహ పర లోకాల్లో శాపాన్ని తెస్తుందని చెబుతుంది. అది గమనించిన శార్దూలం నక్క ప్రవర్తనను తెలుసుకుని మంత్రిగా ఉండమని ఆహ్వానిస్తుంది. చివరకు ఇష్టం లేకపోయినా మంత్రిగా అంగీకరించింది. కొద్దిరోజులు గడచిన తరువాత ఏ విధమైన ప్రలోభాలకు లొంగని నక్కపై పులికి ఆహారంగా ఉంచబడిన మాంసాన్ని నక్క దగ్గర పెట్టి నింద మోపుతారు. రాజు, మంత్రులు నక్కపై విరుచుకుపడి పెద్ద పులి గోమాయువును చంపమని ఆదేశిస్తుంది.

శార్దూలం మాటలు విన్న తన తల్లి అసలు విషయం చెబుతుంది. తను అపరాధి కాదని అంటుంది. మలిన మనస్కులైన వారు నిర్దోషులను దోషులగా చూపిస్తారు. వీరు ఇతరుల ఔన్నత్యాన్ని అంగీకరించలేరని అంటుంది. వాస్తవాలను తెలుసుకున్న వ్యాఘ్రం తనను క్షమించమని ప్రాధేయపడుతుంది. కాని నక్క పగిలినది అతకడం కష్టం అతికిన్ది విచ్చిపోవడం సహజం నామీద

నింద వేశారు నేను భరించలేను అని చెప్పి అరణ్యానికి వెళ్ళి ప్రయోపవేశం తీసుకుని వస్తానని చెబుతుంది నక్క.

ఈ కథ జానపదులలో ప్రభలంగా ప్రచారం పొందిన తరువాత పండిత కవులు భారతంలో చేర్చారని చెప్పవచ్చు, ఇటువంటి కథలకు నిలయం భరతఖండం. ఈ కథలో రాజనీతి, లోకుల స్వభావం, రాజుల కథ, మనస్తత్వం వివరించబడింది.

## మూషిక మార్జాల సంవాదం :

ఈ కథ శాంతి పర్వంలో అపద్ధర్మ పర్వం అనే ఉప పర్వంలో 221 శ్లోకాల్లో వివరించబడింది. భీష్ముడు ధర్మరాజుకి ఈ కథను చెబుతాడు దీనిలో శత్రువులకు చిక్కిన రాజు ఎలా ప్రవర్తించాలి, బలవంతులందరు కలసి బలహీనపడిన రాజును వంటరి చేసి చంపడానికి ప్రయత్నించిన రాజు ఏ విధంగా ప్రవర్తించాలి, అలాంటివాడు మిత్రువో, శత్రువో ఎలా పొందగలుగుతాడో అనే వివిధ ప్రశ్నలకు సమాధానంగా ఈ కథ సాగుతుంది.

> ఒక దట్టమైన అడవిలో పెద్ద మర్రి చెట్టు ఉంది. దాన్ని ఆశ్రయించుకుని ఎన్నో పక్షులు, జంతువులు జీవిస్తుండేవి. ఆ చెట్టుకింద నూరుదారులు కల్గిన కలుగులో 'పలితం' అనే పేరుగల ఒక ఎలుక, చెట్టుమీద 'లోమశం' అనే పిల్లి జీవించేవి.

ఒక దట్టమైన అడవిలో పెద్ద మర్రి చెట్టు ఉంది. దాన్ని ఆశ్రయించుకుని ఎన్నో పక్షులు, జంతువులు జీవిస్తుండేవి. ఆ చెట్టుకింద నూరుదారులు కల్గిన కలుగులో 'పలితం' అనే పేరుగల ఒక ఎలుక, చెట్టుమీద 'లోమశం' అనే పిల్లి జీవించేవి. ప్రతిరోజు ఒక వేటగాడు సాయింత్రం వేళ ఉరులు వొగ్గి బోను పెట్టి తెల్లవారు జామున వచ్చి వలలోను, బోనులోను చిక్కిన వాటిని తీసుకొనిపోయి వాటిని అమ్ముకుని జీవించేవాడు. ఒకరోజు పిల్లి వలలో చిక్కుకుంటుంది. ఫలితమనే ఎలుక భయం లేకుండా తిరుగుతోంది. అదే సమయంలో ఎలుకకు శత్రువులైన ముంగీస అక్కడికి వస్తుంది. అక్కడే కొమ్మ మీద ఒక గుడ్లగూబ ఎలుకను చూసి తినడానికి ఉబలాటపడుతుంది. ఎలుక శతవిధాలుగా ఆలోచించి చుట్టూ ఉన్న శత్రువులను జయించడం ఎలా, భయపడకూడదని భావించి ఇప్పుడు శత్రువైన పిల్లిని మించి

వేరేదారి లేదని భావించి, మార్జాల మిత్రమా మంచి మనస్సుతో అడుగుతున్నాను. భయపడకుము నిన్ను నేను రక్షిస్తాను. నీ వురి తాళ్ళను నేను కొరికి రక్షిస్తాను అంది. చివరకు వీరి మైత్రిని చూసి శత్రువులు వెళ్ళిపోతారు. మిత్రమా ఒక్కమాట చెప్పకుండా కలుగులోకి వెళ్ళిపోయావు నేను కృతజ్ఞత గలదానను అనగానే జాతి స్వభావం పోదు కదా అంది. ఇటువంటి కథలు జానపదుల నుంచి సేకరించి పండిత కవులు భారతంలో చొప్పించినట్లు భావించవచ్చు.

## చిలుక కథ :

ఈ కథ అనుశాసన పర్వంలో దానధర్మ పర్వం అనే ఉపపర్వంలో ఉంది ముప్పై రెండు శ్లోకాల్లో వివరింపబడింది. ధర్మరాజు స్వామి భక్తి కలిగిన దయాళువు గుణగణాలు గలవారిని గూర్చి అడిగినప్పుడు భీష్ముడు చెప్పిన సందర్భంలోదీ కథ. కాశీరాజు రాజ్యంలో ఒక బోయవాడూ అడవికి వేటకు వెళ్ళి విషం పూసిన బాణంతో ఒక మృగాన్ని చంపే ప్రయత్నంలో వేసిన బాణం గురితప్పి ఒక చెట్టుకు గుచ్చుకుంటుంది. దాంతో ఆ చెట్టు ఆ విష ప్రభావంతో ఎండిపోయి ఆకులు రాలిపోయి మోడైపోతుంది. అన్ని పక్షులు జంతువులు వెళ్ళిపోయినా ఒక చిలుక మాత్రం తొర్రలోనే ఉంటూ నీరసపడి శల్యమై పోతుంది. అది చూసిన చిలుక దేవేంద్రుడు బ్రాహ్మణ రూపంలో వచ్చాడని గ్రహించి నేను చిన్నప్పటి నుండి ఇక్కడే వున్నాను. నాకు ఆశ్రయమిచ్చిన చెట్టును ఇప్పుడు వదలి వెళ్ళలేను. కృతజ్ఞత గలదానవే అంటుంది దానిని మెచ్చుకుని అమృతాన్ని చల్లి చెట్టును మళ్ళీ యథా తథంగా చిగురింపజేసి వెళ్ళిపోయాడు. చివరివరకు జీవించి తర్వాత ఇంద్రలోకాన్ని పొందింది. ఇటువంటి కథలు జనవ్యవహారంలో ఉన్నవే. వాటిని పండిత కవులు

> “మొదటిగా సంస్కృత భారతంలో వున్న కట్టుకథలు, నీతి కథలు, అద్భుత కథలు, ప్రాణికథలపై సరికొత్త పరిశోధన చేసి జానపద సాహిత్యంలో ఒక విశిష్టమైన గ్రంథాన్ని అందించడమే కాకుండా, భారతంలో కథాంశ కథలు.”

స్వీకరించి సందర్భానుసారంగా భారతంలో చేర్చారని చెప్పవచ్చు.

ఈ విధంగా సంస్కృత భారతంలో ఎన్నో జానపద కథలు వచ్చి చేరాయి. మొదటిగా వచ్చిన జయం భారతంగా, మహాభారతంగా పరిణామ క్రమంలో వచ్చిన మార్పులు, చేర్పులు గమనిస్తే, భారతంలో కథలకు మూలం జానపద కథలే. మొదటి నుంచి ఏ సాహిత్యం అయినా ప్రజా భాషలో వ్యవహారంలో వున్న వీరగాథల వల్లే ఆఖ్యానాలు, ఉపాఖ్యానాలు కావ్యాలు మహాకావ్యాలు పుట్టాయి. ఇది సహజ పరిణామమే. శిష్యులైన వారు పల్లె పదాలలో ఉన్న భాషనే సంస్కరించారు తప్ప కొత్తగా కనిపెట్టింది లేదు. వ్యవహార భాషకు గ్రాంథికత కూర్చారు. అగ్గి అనే పదాన్ని అగ్ని : అగ్ని లాగానే అన్నీ సంస్కరించి సంస్కృతీకరించి దేవనాగరిక భాషగా, దేవభాషగా ప్రచారం చేసి ప్రసిద్ధులయ్యారు. ఆనాటి వ్యవహారంలో వున్న జానపదులు ప్రయోగాల్లో అలంకారాలు, వస్తువు, పాత్రలు గమనిస్తే వారి కల్పనా శక్తికి చేయెత్తి సంస్కరించవచ్చు.

మొదటిగా సంస్కృత భారతంలో వున్న కట్టుకథలు, నీతి కథలు, అద్భుత కథలు, ప్రాణికథలపై సరికొత్త పరిశోధన చేసి జానపద సాహిత్యంలో ఒక విశిష్టమైన గ్రంథాన్ని అందించడమే కాకుండా, భారతంలో కథాంశ కథలు. యాదవుల జానపద కళారూపాలు, సింహాచల దేవళం కట్టుబడి కథా గేయాలు అందించి దశావతార కథాగేయాలను, సంస్కృత రామాయణం మరో చరిత్ర వంటి గ్రంథాలను అందించబోతున్న గురువర్యులు ఆచార్య జయదేవ్ గారికి కృతజ్ఞతాభినందనలు తెలియజేస్తూ ఈ వ్యాసం రాయడానికి వారి పరిశోధనల్లో వున్న సరికొత్త అంశాలు ఎంతో ఆసక్తిని కలిగించాయి, ఆలోచింపచేశాయి. సంశ్కృత భారతంలో ఇటువంటి కథలు ఎలా వచ్చి చేరాయో ఆధారాలతో సహా అందించిన గ్రంథాలు నేటి జానపద పరిశోధకులకు సాహితీ పరిశోదకులకు ఒక నూతన ఆవిష్కరణలకు ఆధార గ్రంథంగా నిలుస్తుందని ఆశిస్తూ ఇది భావి పరిశోధకులకు ఉపయుక్తమవుతుందని భావిస్తున్నాను.

## ఆధారగ్రంథాలు

1. డా.ఎం. జయదేవ్ - సంస్కృత భారతంలో జానపద కథలు -

2. కవిత్రయభారతం - టి.టి.డి ప్రచురణలు

3. శ్రీమద్మహాభారతమ్ - నీలకంఠీయవ్యాఖ్య

4. డా. తరపట్ల సత్యనారాయణ - జానపదం

# జానపద కథా స్వరూపశాస్త్రం



ఆచార్య పులికొండ సుబ్బాచారి
✆ 94404 93604

జానపద శాస్త్రంలో నిర్మాణ విధానాల గురించి చేసిన ఆలోచనలు అన్నీ కూడా భాషాశాస్త్రం నుండి ప్రభావితమై వచ్చినవే. దీనిలో నిర్మాణాల గురించి ఆలోచన చేసిన పండితులు ఆర్నే, థాంప్సన్, ప్రాప్ అందరూ భాషాశాస్త్రాన్ని ప్రత్యక్షంగా ఆధ్యయనం చేసినవారు ప్రాప్ భాషాశాస్త్రాన్ని చాలా కాలం బోధించాడు కూడా తర్వాతి కాలంలో వచ్చిన లెవిస్ట్రాస్ మానవ శాస్త్రజ్ఞుడే ఆయినా ఆయనపైన కూడా భాషాశాస్త్రప్రభావం ఉంది. వీరందరికన్నా ఆధునికుడైన అలన్ డండెస్ లెవిస్ట్రాస్ ని ప్రాప్ ని కూడా అధ్యయనం చేసి వారిని మరింత అర్థవంతంగా జానపదశాస్త్రానికి పరిచయం చేసాడు. ఈయన పైన మనోవిజ్ఞాన శాస్త్రప్రభావం చాలా ఎక్కువ అయినా భాషాశాస్త్రప్రభావాన్ని కూడా చూడవచ్చు.

జానపద కథని నిర్మాణ పరంగా అధ్యయనం చేయడంలో ఆంటీ ఆర్నే, స్టిత్ థాంప్సన్ లు ముందుగా కృషి చేసిన వారు. అంతకుముందు కథలను గురించి ఇతిహాసాలు పురాకథల గురించి చేసిన అధ్యయనం ప్రధానంగా వాటి పుట్టుక ఏకమూల బహుమూల సిద్ధాంతాలు కథల వ్యాప్తి గురించి చేసిన ఆలోచనలు ప్రధానంగా సాగినది. దీన్నే ఫిన్నిష్ సిద్ధాంతం అని చారిత్రక భౌగోళిక సిద్ధాంతం అని వ్యవహరించేవారు. దీని తర్వాత మిత్ గురించి లెజెండ్ గురించి కాక కథలను గురించి వాటి నిర్మాణాల గురించి ఆలోచించడం మొదలు పెట్టారు. ఇక్కడ కథలు అంటే పురాకథలు ఇతిహాసాలు కాక అద్భుతకథలు అని లేదా folktale అని అర్థం చేసుకోవాలి. జానపదకథలను గురించి ఆలోచించినప్పుడు వాటిలోని నిర్మాణాల గురించి ఆలోచించినప్పుడు tale-type అనే భావన మొదటిది అని చెప్పాలి. కథలలో కొన్ని మాదిరులు ఉంటాయని వీటి ద్వారానే కథల నిర్మాణం జరుగుతుందని tale-type ని వర్ణించి వాటికి ఒక ఇండెక్సును

తయారు చేశాడు ఆంటీ ఆర్నే. ఈ ఇండెక్సు ద్వారా ప్రపంచంలోని జానపద కథలలో ఉన్న కథామాదిరులను తెలుసుకోవచ్చు. వివిధ దేశాల కథలలో ఉన్న నిర్మాణాంశాలను తులనాత్మకంగా చూడవచ్చు.

> జానపద కథని నిర్మాణ పరంగా అధ్యయనం చేయడంలో ఆంటీ ఆర్నే, స్టిత్ థాంప్సన్ లు ముందుగా కృషి చేసిన వారు.

దీని తర్వాత జానపద కథానిర్మాణానికి సంబంధించి చేసిన గొప్ప సిద్ధాంతం మోటిఫ్ అనేది. మోటిఫ్ అంటే కథానిర్మాణంలో కనీస నిర్మాణ ఏకకం. అంటే **minimum structural unit.** ప్రతి జానపద కథలో ఒక నిర్మాణ అంశం ఉంటుందని అది కథలో ఒక ముఖ్యమైన కనీస నిర్మాణ రూపమని చెప్పాడు. దీన్ని మూలాంశం అని కథన ఘటకము అని తెలుగులో జానపదవిద్వాంసులు అనువాదం చేశారు. మోటిఫ్ అంటే కథలో కనీసకథాంశం. ఇలాంటి కథాంశాలతో ఒక పెద్ద సూచికను ఒక నిఘంటువులాగా తయారు చేశారు. ఆర్నే థాంప్సన్ లు కలిసి. దీనిలో ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ప్రముఖ జానపదకథలలో ఉండే మూలాంశాలు అకారాది క్రమంలో ఏర్పాటు చేశారు. ఆరు సంపుటాలలో ఉద్గ్రంథంగా తయారైంది ఈ మోటిఫ్ ఇండెక్సు. జానపద కథలను వాటి నిర్మాణ పరంగా ఆలోచించిన మంచి సైద్ధాంతిక ఆలోచన ఇది. ఒక అధ్యయన విధానం కూడా.

దీని తర్వాత జానపద ప్రక్రియల నిర్మాణం గురించి ఆలోచించిన చాల ప్రముఖమైన సిద్ధాంతం, లేదా ఒక విధానం కథాస్వరూప అధ్యయనం. దీనికి ఆద్యుడు వ్లాదిమీర్ ప్రాప్. ఈయన **Morphology of the Folktale** అనే సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టిన తర్వాత ప్రపంచ వ్యాప్తంగా జానపద కథల అధ్యయన స్వరూపమే మారిపోయింది. ప్రాప్ రష్యాలో స్థిరపడిన జర్మన్ దేశీయుడు. ప్రధానంగా ఈయన భాషాశాస్త్రజ్ఞుడు. దాని ప్రభావంతోనే ఆయన జానపదకథలకు సంబంధించిన నిర్మాణాన్ని అధ్యయనం చేయడానికి పూనుకున్నాడు. కానీ దీనికి పెట్టిన పేరు మాత్రం ఆయన వృక్ష శాస్త్రంనుండి తీసుకున్నాడు. వృక్షాల నిర్మాణాన్ని అధ్యయనంచేసే పద్ధతిని మార్ఫాలజీ అని అంటారు. ఆ పేరును కథలను అధ్యయనం చేసే దీనికి పెట్టాడు.

> జానపదకథ అత్యంత వైవిధ్య భరితమైనది అని ప్రపంచమంత ఉన్న దాన్ని విస్తృతంగా అధ్యయనం చేయడం సాధ్యం కాదని అందుకని ఉన్న కథా సామగ్రిని సునిశితంగా వర్గీకరించాలని ప్రాప్ అంటాడు

మార్ఫాలజీ అనేది ప్రధానంగా ఒక విధానం కానీ సిద్ధాంతం కాదు. కానీ ఈ విధానం గురించి ఆలోచించిన నేపథ్యం ఒక సైద్ధాంతిక భావనే. ప్రపంచవ్యాప్తంగా ఉన్న కథలను నిర్మాణపరంగా అర్థం చేసుకోవడానికి విశ్లేషించడానికీ ఈయన ఒక పద్ధతిని విధానాన్ని అభివృద్ధి చేశాడు.

జానపదకథకు సంబంధించిన ఈ కృషి ప్రాప్ కాలానికి ముందు సమకాలంలోను జరిగిన దానిలో ప్రధానమైనది. ప్రాప్ జానపద కథకు సంబంధించిన తన విధానాన్ని ప్రవేశపెట్టబోయే ముందు విధానపరంగా తనకన్నా ముందున్న కృషిని దానిలోని లోటుపాట్లను సమీక్షించాడు. ఆ తర్వాతనే తన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

ప్రాప్ నిర్మాణ సిద్ధాంతాన్ని రచించకముందు (1926) కథకు సంబంధించిన తులనాత్మక చారిత్రక అధ్యయనం ఎక్కువ జరిగింది. ప్రాప్ తన గ్రంథంలో వాటిని విమర్శించాలని అనుకోలేదు. జానపదకథను వర్ణనాత్మకంగా ఆలోచించిన వివిధ పద్ధతులను ప్రస్తావించి వాటి లోటుపాట్లను చర్చించాడు.

జానపదకథ అత్యంత వైవిధ్య భరితమైనది అని ప్రపంచమంత ఉన్న దాన్ని విస్తృతంగా అధ్యయనం చేయడం సాధ్యం కాదని అందుకని ఉన్న కథా సామగ్రిని సునిశితంగా వర్గీకరించాలని ప్రాప్ అంటాడు. "తర్వాత జరిగే కథాధ్యయనంలోని నైశిత్యమంతా ముందు జరిగే వర్గీకరణలోని నైశిత్యం పైనే ఆధారపడి ఉంటుందని శాస్త్రీయవర్ణన (Scientific description) నిశితమైన వర్గీకరణంపైనే ఆధారపడి ఉంటుందని ప్రాప్ నిశ్చితమైన అభిప్రాయం. అసమర్థమైన వర్గీకరణలని ప్రాప్ నిశితంగా విమర్శించాడు.

## జానపద కథలను సర్వ సాధారణంగా చేసే విభజన

1. అద్భుతకథలు (fairy tales) 2. దైనికజీవన కథలు (tales of everyday life), 3. జంతువులకథలు (animal tales). ఈ విభజన గ్రిమ్ సోదరులు చేసింది. దీన్ని ప్రాప్ అంగీకరించలేదు. ఇది పైకి చూస్తే బాగానే కనిపిస్తుంది కానీ ఇది లోపాలతో కూడింది. దేవతల కథలలో జంతువుల పాత్రలు కూడా ప్రధానంగా ఉండవచ్చునని, అలాగే జంతువుల కథలలో దేవతల పాత్రలు ప్రదానంగా ఉండవచ్చు దైనందిన జీవిత కథలలో జంతువులు ప్రధాన పాత్రని పోషించవచ్చు. కనుక ఇది సరైన విభజన కాదని తిరస్కరించాడు ప్రాప్.

> విల్హెల్మ్‌ఉంట్ అనే జానపద విజ్ఞాని Folklore Psychology అనే తన గ్రంథంలో జానపద కథలను ఏడు వర్గాలుగా విభజించాడు. ఈయన చేసిన వర్గీకరణ పైన చూపిన వర్గీకరణ కన్నా మెరుగైనదని కాని ఇది కూడా సమంజసమైనది కాదని ప్రాప్ చెప్పాడు.

విల్హెల్మ్‌ఉంట్ అనే జానపద విజ్ఞాని Folklore Psychology అనే తన గ్రంథంలో జానపద కథలను ఏడు వర్గాలుగా విభజించాడు. ఈయన చేసిన వర్గీకరణ పైన చూపిన వర్గీకరణ కన్నా మెరుగైనదని కాని ఇది కూడా సమంజసమైనది కాదని ప్రాప్ చెప్పాడు. ఈయన చేసిన విభజనలో ఫేబుల్ అ మాట ఏడుసార్లు వచ్చింది. దీని అర్థాన్ని ఎలా ఊహించాడో అర్థంకాదు, అస్పష్టం. కేవల హాస్య కథలనే విభజన అంగీకార్యం కాదు అని అంటాడు. నీతి కథలలో జంతువులు, జంతువుల కథలలో నీతి ఉండకూడదా. అని ప్రశ్నించి దీన్ని కూడా తిరస్కరించాడు ప్రాప్. ఇలా వర్గాలుగాకాకుండా కథలను ప్లాట్లుగా చేసిన విభజన ప్రాప్ కన్నా ముందు కనిపిస్తుంది. ఈ విభజన ఇంకా అయోమయ పరిస్థితిలోనికి పోవడానికి ఉపయోగిస్తుంది అంటాడు ప్రాప్.

ప్రాప్ ఆర్నే కృషిని కూడా పరిశీలించాడు. దాని ప్రయోజనాన్ని మెచ్చుకున్నాడు. అయినప్పటికీ వారు అనుసరించిన విధానము లోపభూయిష్టమని హెచ్చరించాడు. వివిధ కథల నమూనాను స్పష్టంగా వివిధ

విభాగాల క్రింద గీత గీసినట్లు విభజించడం సాధ్యంకాదని ఒక్కో నమూనా ఇంకో నమూనాలోనికి చొచ్చుకు పోవచ్చునని చెప్పాడు. అంతే గాక కథకు సంబధించిన బాహ్యవిషయలాపై ఆధారపడి వర్గీకరించిన ఇతర వర్గీకరణలను కూడా తిరస్కరించాడు. అవి గుడ్డెద్దు పోకడగా ఉన్నాయని (blind alley) అన్నాడు.

థాంప్సన్ కంటే ముందు ప్రాప్ కాలంలోనే వ్లోకోవ్స్కి అనే రష్యన్ జానపద విజ్ఞాని కథలను మోటిఫ్ల రూపంలో విభజించి తిరిగి ప్లాట్లుగా వర్గీకరించాడు. ప్రాప్ వీటిని కూడా అంగీకరించలేదు. ఈ పద్ధతిలో వచ్చే సమస్యలను కూడా క్షుణ్ణంగా చర్చించాడు. ఈ విధంగా తనకన్నా ముందు జానపద కథకు సంబంధించిన వర్గీకరణ, వర్ణన, విచారకరమైన స్థితిలో ఉన్నాయని చెప్పాడు.

జానపద అద్భుత కథకు ప్రత్యేక లక్షణముందని అది వాటి కథాంశాలని, ఈ అంశాలను ఏమీ మార్చకుండానే మరొక కథకు మార్చవచ్చునని, ఇది కథకు ఉన్న పరివర్తన గుణమని  అంటాడు ప్రాప్.  కథకున్న బయటి విషయాలను అనుసరించి కాక కథకున్న నిర్మాణాన్ని, అంతర్గత కథాంశాల ద్వారా జరిగే నిర్మాణం ఆధారంగా మాత్రమే జానపద అద్భుత కథని వర్ణించాలని (describe) చెప్పాడు. తన కన్నా ముందు జరిగిన పరిశోధనను సిద్ధాంత ఆలోచనలను పరిశీలించి కథలను వర్ణనాత్మక అధ్యయనం నుండి నిర్మాణాత్మక అధ్యయనం వైపునకు మలుపు తిప్పి జానపదవిజ్ఞానశాస్త్రంలో మొదటి నిర్మాణాధ్యయనవాది అయ్యాడు ప్రాప్.

జానపదఅద్భుతకథానిర్మాణాన్ని, చట్రాన్ని నిర్ణయించేది జానపదకథలోని పాత్రల చర్యలేనని చెప్పి, వాటిని ప్రకార్యాలు (Functions) అని వివరించాడు ప్రాప్.  "ఈ ప్రకార్యాల పరస్పర సంబంధాన్ని కథతో వాటికి ఉన్న సంబధాన్ని అధ్యయనం చేయడమే జానపద కథాస్వరూపశాస్త్రము" అని "Morphology of the Folktale" అని అన్నాడు. దీన్ని విపులంగా చర్చించే ముందు జానపద విజ్ఞానిగా ప్రాప్ నేపథ్యాన్ని క్లుప్తంగా చూడడం సమంజసం.

వ్లాదిమీర్ జాకవ్ లేవిచ్ ప్రాప్ 1895 ఏప్రిల్ 17వ తేదీన రష్యాలోని సెంట్ పీటర్స్ బర్గ్ లో ఒక జర్మన్ దంపతులకు జన్మించాడు ఆయన జర్మన్ భాషా శాస్త్రంలో ప్రావీణ్యం పొందాడు. ప్రారంభంలో ఒక సెకండరీ పాఠశాలలో అధ్యాపకుడుగా పనిచేశాడు. త్వరలోనే ఒక కాలేజిలో జర్మన్ అధ్యాపకుడుగా పదోన్నతి పొందాడు. ఆ రోజుల్లోనే ప్రాప్ రష్యన్ భాషలో మూడు పాఠ్య పుస్తకాలు, ఒక జర్మన్ వ్యాకరణం రచించాడు. ఆయన 1932లో లెనిన్గ్రాడ్ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా

ప్రవేశించి జీవితాంతం అక్కడే పనిచేశాడు. 1938 నుండి జానపదశాస్త్రంలోనే పనిచేసి తిరిగి భాషా శాస్త్రం వైపు వెళ్ళలేదు.

ప్రాప్ జానపద కథా స్వరూప శాస్త్రం పుస్తకాన్ని 1928లో రచించాడు. మొదట్లో ఆయన దీనికి మార్ఫాలజీ ఆఫ్ వండర్ టేల్ అని పేరు పెట్టి తర్వాత మరింత ఆకర్షకంగా ఉండాలని పేరు మార్చి మార్ఫాలజీ ఆఫ్ ఫోక్ టేల్ అని పెట్టారు. ఈ సైద్ధాంతిక ఆలోచనలోని గొప్పతనాన్ని కొద్దిమంది మాత్రమే ఆరోజుల్లో గ్రహించారు. మెచ్చుకున్నారు. కానీ దానికి రావలసినంత పేరు కాని వ్యాప్తికానీ అప్పట్లో రాలేదు. కానీ ముప్పై సంవత్సరాల తర్వాత 1958లో దీని ఆంగ్ల అనువాదం వచ్చిన తర్వాత ఇది ప్రపంచం అంతా వ్యాపించింది. ఇది జానపద ప్రక్రియలని విశేషించి కథా ప్రక్రియని ఎంత కొత్తగా ఆలోచిస్తూ ఉందో ఎంత శాస్త్రీయంగా ఆలోచిస్తూ ఉందో ఎన్నో దేశాలలోని జానపద విజ్ఞానులు భాషా వేత్తలు నిశితంగా పరిశీలించి మెచ్చుకున్నారు. అలన్ డండెస్ వంటి వాడు దీనికి ముందు మాట రాసి మరింత ప్రచారం చేశాడు. ఈ గ్రంథం అప్పుడే ఉంటే జానపద విజ్ఞానం శాస్త్రంపైన ఎంతో ప్రభావం వేసి ఉండేది. అని మెల్ విల్ జాకబ్సన్ అనే విమర్శకుడు చెప్పాడు.

> జానపద అద్భుత కథకు ప్రత్యేక లక్షణముందని అది వాటి కథాంశాలని, ఈ అంశాలను ఏమీ మార్చకుండానే మరొక కథకు మార్చవచ్చునని, ఇది కథకు ఉన్న పరివర్తన గుణమని అంటాడు ప్రాప్.

క్లాడ్ లెవిస్ట్రాస్ ఈ గ్రంథాన్ని సమీక్షించి మెచ్చుకున్న తర్వాత దీని గొప్పతనం ప్రపంచానికి బాగా తెలిసింది. డండెస్ దీనితో బాగా ప్రభావితమయ్యాడని చెప్పాను. ఆయన అమెరికన్ ఇండియన్ జానపద కథలకు ఈ విధానాన్ని అనువర్తింపజేసి అధ్యయనం చేశాడు. ప్రాప్ విధానానికి అత్యంత వ్యాప్తి కీర్తి రావడానికి ఫ్రాన్స్ లో లెవిస్ట్రాస్ కారణం అయితే అమెరికాలో డండెస్ మూలం. 1970 దాకా ప్రాప్ సిద్ధాంత ప్రభావం చాలా తీవ్రంగానే ఉంది. తర్వాత దీని ప్రభావాన్ని తర్వాతి సైద్ధాంతిక ఆలోచనలు తగ్గించినా దీని ప్రాముఖ్యం నేటికీ ఉంది.

ప్రాప్ జానపదకథాస్వరూప శాస్త్రం: ప్రాప్ రూపొందించిన జానపద

కథాస్వరూపశాస్త్రం Morphology of the Folktale జానపద కథలకు చెందిన పరిశోధనలను బాహ్య జగత్తునుండి ఆంతరిక జగత్తునకు మార్చింది. ఇటువంటి తొలిగ్రంథం ఇదే కావడం వల్ల జానపదవిజ్ఞానశాస్త్రం ఒక శాస్త్రస్థాయిని పూర్తిగా పొందినదని ఆనాటి శాస్త్రజ్ఞులు చెప్పారు.

ఆంటీ ఆర్నే తన వర్గీకరణంలో 'fairy tale' ను 300-749గా చేశాడు. ఈయన అద్భుతకథకు సంబంధించిన కథాంశాలను తులనాత్మకంగా అధ్యయనం చేశాడు. కొన్ని విధానాలను దృష్టిలో ఉంచుకొని సాగింది. జానపదకథలోని మౌలికాంశాల తులనాత్మక అధ్యయన ఫలితంగానే జానపద కథాస్వరూపశాస్త్రం ఏర్పడింది. "జానపదకథ లోని మౌలికాంశాలను వర్ణించడం, ఈ మౌలికాంశాల పస్పర సంబంధం మొత్తం కథతో వాటికున్న సంబంధాన్ని వర్ణించడమే జానపద కథాస్వరూపశాస్త్రం" అని నిర్వచించాడు ప్రాప్.

ఇంతకు ముందు చర్చించినట్లుగా ప్రాప్ పరిశోధన అన్ని జానపదకథలకు ఇతర ప్రక్రియలకు వర్తించేదే అయినా అది (Morphology) ప్రధానంగా అద్భుతకథను ఉద్దేశించిందే. ఆయన ఇతర పరిశోధనలు అన్నింటిలోను అద్భుతకథకు సంబంధించిన భావధార మనకు కనిపిస్తుంది.

జానపదకలోని కథాపాత్రల చర్యలే (Dramatise Persone) కథలోని మౌలికాంశాలను నిర్ణయిస్తాయని ప్రాప్ అంటాడు. పాత్రల స్వభావాలు మారినా అవి మారవు అంటాడు. కథాపాత్రల చర్యలు ఎలా ఉంటాయో కింద చూద్దాం.

౧. ఒక నాయకునికి రాజు డేగను ఇస్తాడు. ఆ డేగ నాయకుని వేరే రాజ్యానికి తీసుకుపోతుంది.

౨. సుచెంకోకు ఒక ముసలివాడు గుర్రాన్ని ఇస్తాడు. గుర్రం సుచెంకోను వేరే రాజ్యానికి తీసుకుపోతుంది.

3. ఒక మాంత్రికుడు ఇవానుకు చిన్న పడవనిస్తాడు. ఆ పడవ అతడిని వేరే రాజ్యానికి తీసుకుపోతుంది.

> "ఆంటీ ఆర్నే తన వర్గీకరణంలో 'fairy tale' ను 300-749గా చేశాడు. ఈయన అద్భుతకథకు సంబంధించిన కథాంశాలను తులనాత్మకంగా అధ్యయనం చేశాడు"

౪. ఒక రాజకుమార్తె ఇవాన్కు ఉంగరాన్ని ఇస్తుంది. దానిలోనుండి పుట్టిన యువకులు ఇవాన్ను వేరే రాజ్యానికి తీసుకుపోతారు.

౫. రాజకుమారుడు ఇద్దరు రాక్షసులనుండి పాదరక్షలు గ్రహిస్తాడు అవి రాజకుమారుడు అనుకున్న చోటికి తీసుకుపోతాయి.

౬.రాజు యువకునికి కీలుగుర్రాన్ని ఇస్తాడు. అది యువకుని సప్తసముద్రాలను దాటిస్తుంది.

౭. బాలుడు గండభేరుండపక్షి పిల్లలను కాపాడతాడు. అవి బాలుణ్ణి సప్త సముద్రాలను దాటిస్తాయి.

౮. రాజకుమారునికి ఒక ముని మాయ కంబళిని ఇస్తాడు. అది రాజకుమారుడిని అనుకున్న ప్రతి చోటికీ తీసుకుపోతుంది.

ఇటువంటి ఉదాహరణలను అన్ని చోట్లనుండి ప్రపంచ అద్భుతకథలలో చూడవచ్చు. పై ఉదాహరణలలో జాగ్రత్తగా గమనిస్తే స్థిరాంశాలు, అస్థిరాంశాలు కనిపిస్తాయి. పై ఉదాహరణల్లో కథా పాత్రలు మారాయి. ఇవి అస్థిరాంశాలు. కానీ అవి చేసే పనులు మారలేదు. పైకి వస్తువులు మారి ఉండవచ్చు. కాని పని అదే విధంగా అన్నింటిలో ఉంది. దీనినిబట్టి జానపదకథ తరచుగా భిన్న కథా పాత్రలతో ఏకరీతినుండే చర్యలు కలిగి ఉండేదిగా నిర్ణయించాడు ప్రాప్. ఈ చర్యలనే Functions అని అన్నాడు. మనం దీన్ని తెలుగులో ప్రకార్యాలు అని అనువాదం చేసుకోవచ్చు. ఇకపైన మొత్తం వ్యాసంలో Functions అంటే ప్రకార్యాలు అని గుర్తుపెట్టుకోవచ్చు.

జానపదకథా ప్రపంచంలోని అసంఖ్యాక పాత్రలతో పోల్చినప్పుడు ఆశ్చర్యకరంగా ప్రకార్యాల సంఖ్య చాలాతక్కువ. “ఈ విషయం జానపదకథకు సంబంధించిన ద్విముఖమైన గుణాన్ని తెలియజేస్తుంది. అది ఆశ్చర్యం గొలిపే రీతిలో బహురూపము, వైవిధ్యభరితమూ, అదే విధంగా ఏకరూప్యమూ, పునర్వర్తనగుణమూ ఒకేసారి కలిగిఉంది.” అంటాడు ప్రాప్. అదే కథానిర్మాణ వైచిత్రి.

ఒక జానపద కథలోని కథాపాత్రల ప్రకార్యాలు కథామౌలికాంశాలు అవుతాయి. ఆ విధంగానే వాటిని గుర్తించి వెలికి తీసి నిర్వచించాలి. ప్రకార్యాలను ఎన్నుకోవడానికి ప్రాప్ కొన్ని పద్ధతులను పాటించాడు. కథాపాత్రల చర్యలు ఒకే లాగ కనిపించినంతమాత్రాన అది ప్రకార్యమని భ్రమపడకూడదని అంటాడు.

కథాంతంలో ఒక రాజకుమారుడుకీ ఒక రాజకార్తెకు జరిగే పెండ్లి (ప్రకార్యం w) కథ మధ్యలో ఒక తండ్రికి ఇద్దరు సంతానం ఉన్న విధవతో జరిగే పెండ్లికి పోలిక లేదు. కనుక ఈ రెండు ఒకే ప్రకార్యం కావు. ఇలాంటి వాటిని గమనించాలి అని ప్రాప్ వివరించాడు. ఈ రెండు భిన్న స్వభావాలు కలిగినవి కథా నిర్మాణంలో వాటి ప్రమేయం వేరు. కనుక వాటిని ప్రకార్యాలు ఒకటి కావు అని విస్పష్టంగా చెప్పాడు. ఇక్కడ తెలుగు కథలనుండి ఒక ఉదాహరణను చూచి దీన్ని అర్థం చేసుకోవచ్చు.

బాలనాగమ్మకథలో బాలవర్ధిరాజుకు ముగ్గురు రాజకుమార్తెలతో జరిగేవివాహం (w) అదే కథలో నవభోజరాజుకు మాణిక్యాల దేవితో జరిగే వివాహం ఒకే రకమైన ప్రకార్యం కిందికి రావు. బాలుడు వివాహం కథ సుఖాంతమవుతూ ఉండగా ప్రతినాయకుడు శిక్షింపబడుతూ ఉండగా జరిగింది. నవభోజరాజు పెండ్లి బలవంతంగా పిల్లల పోషణార్థం జరిగింది దీని అర్థం వేరు. కనుక ఈ ప్రకార్యం (w) కిందికి రాదు. ప్రకార్యాలను ఎన్నుకోవడంలో ఇలాంటి జాగ్రత్తలు అవసరం.

ప్రకార్యాలకు సంబంధించి మరో ముఖ్యమైన సూచన చేశాడు ప్రాప్. కథాపాత్రల చర్యలు ఒక విధమైన సంయుక్తపద్ధతిలో ఉండి అది ఏ ప్రకార్యమా అని నిర్వచించడానికి వీలు లేనప్పుడు పాత్రల చర్యల ద్వారా ఆ తర్వాత జరిగే పరిణామాలను దృష్టిలో ఉంచుకొని దాని ఏ ప్రకార్యంగా నిర్ణయించాలో నిర్వచించాలి అనిచెప్పాడు.

"ఏకరూపమైన చర్యలు భిన్నమైన అర్థాన్ని కలిగి ఉండవచ్చు. ఒకే అర్థంలోను భిన్నమైన చర్యలు ఉండవచ్చు. కథాకథనక్రమాన్ని అనుసరించి వాటిని గుర్తించాలి. ప్రకార్యాన్ని కథాపాత్రల చర్యలనుండి గ్రహించాలి. పూర్తికథా ప్రకరణంలో(context) పాత్రల చర్యకున్న గుర్తింపు (పర్యవసానం) ను బట్టి ప్రకార్యాన్ని నిర్వచించాలి". అంటాడు ప్రాప్. ప్రకార్యానికి నాలుగు ప్రధానలక్షణాలను చెప్పాడు. వాటిని ఇక్కడ తప్పక చెప్పాలి.

౧. ప్రకార్యాలు మారకుండా పనిచేసే స్థిరమైన కథాంశాలు. కథాపాత్రలను ఏవి నిర్వహిస్తున్నాయి అన్న విషయం, ఎలా నిర్వహిస్తున్నాయి అన్న విషయం నుండి ఇవి స్వతంత్రంగా ఉంటాయి.

౨. జానపదకథలలో ఉండే ప్రకార్యాలు ఎప్పుడూ పరిమితమైనసంఖ్యలోనే ఉంటాయి.

౩. ప్రకార్యాల అనుక్రమం ఎల్లప్పుడూ ఒకే విధంగా ఉంటుంది. వాటి అనుక్రమం మారదు. ప్రకార్యాలు ఎప్పుడూ వ్యతిక్రమంలో ఉండవు.

౪. అన్ని జానపద (అద్భుత) కథలు నిర్మాణ రీత్యా ఒకేమాదిరిగా ఉంటాయి. అంటే ఏకరూపతని కలిగి ఉంటాయి. కథానిర్మాణాన్ని అలా ఉంచగలిగేది ప్రకార్యాలు.

ప్రాప్ తన గ్రంథంలో మార్ఫాలజీ ఉదాహరించడానికి అఫాన్స్యేవ్ అనే పరిశోధకుడు సేకరించి ప్రచురించిన కథలనుండి ఒక వంద కథలను గ్రహించాడు. కానీ అద్భుత కథానిర్మాణాన్ని చర్చించడానికి, ప్రకార్యాలను నిర్వచించడానికి ప్రాప్ చేసిన పరిశ్రమ ఈ వందకథలకే పరిమితం కాలేదు. అందుకోసం ఆయన కొన్ని వేల కథలను పరిశీలించాడు. విస్తృతమైన పరిశ్రమచేశాడు. ప్రపంచ అద్భుత కథలు అన్నీ ఒదిగే 31 ప్రకార్యాల కథానమూనాని సృష్టించగలగడమే అతని పరిశ్రమకు మేధస్సంపదకు తార్కాణ. ఇది పొగడడం కోసమే అయితే చెప్పవలసిన పనిలేదు. కాని దీన్నిబట్టి ఆయన ప్రకార్యాల క్రమాన్ని నిర్దేశించిన విధానాన్ని తెలుసుకోవడానికి అవసరం అవుతుంది.

> బాలనాగమ్మకథలో బాలవర్ధిరాజుకు ముగ్గురు రాజకుమార్తెలతో జరిగే వివాహం (W) అదే కథలో నవభోజరాజుకు మాణిక్యాల దేవితో జరిగే వివాహం ఒకే రకమైన ప్రకార్యం కిందికి రావు.

ప్రకార్యాల ప్రక్రమం (pattern) యాదృచ్ఛికంగా అనూహ్యంగా ఉంటుంది. అంటే ఎవరో ఒకవ్యక్తి సృష్టించిన విధానం కాదు. వెస్లోవస్కీ అభిప్రాయం ప్రకార్యం "ప్రకార్యాల ఎన్నిక వాటి క్రమం పూర్వసిద్ధమైన స్వేచ్ఛను కోరుకుంటాయి". ఆయన ప్రాప్ అభిప్రాయాన్ని బాగానే గ్రహించాడు. పూర్వసిద్ధమైన స్వేచ్ఛ అంటే ప్రకార్యాల అనుక్రమాన్ని జానపదవిజ్ఞాని తన బుద్ధిచాతుర్యానికి అనుకూలంగా నిర్ణయించడానికి వీలులేదు. అది కొన్ని వందల, వేల కథా నిర్మాణాలను అర్థంచేసుకొని వాటన్నింటిలో సామూహికంగా అంతర్గతంగా ఉన్న ప్రకార్యాల అనుక్రమాన్ని దర్శించి వెలికితీసి చెప్పాలి. అంతే కాని ఆ అనుక్రమం

జానపదవిజ్ఞాని ఇష్టం మీద ఆధారపడి ఉండదు. అది కథానిర్మాణంలో నిబిడంగా ఉంటుంది. అదే పూర్వసిద్ధమైనస్వేచ్ఛ. అందువల్లనే ప్రకార్యాల అనుక్రమం మారదు.

ప్రకార్యాల అనుక్రమాన్ని ఏర్పాటు చేసుకోవడంలో ప్రాప్ అనుసరించిన పద్ధతిని గమనిద్దాం. అద్భుతకథలో అన్నింటా ఒక సందర్భంలో ఒకే విధంగా ఉన్న ప్రకార్యానికి 'A' అని నామకరణం చేసి తిరిగి దీనిని అనుసరించి ఉండే కథాసందర్భంలో అన్నికథలలోని ఒకే విధమైన చర్యకు 'B' అని నామకరణం చేశాడు. ఈ ప్రకార్యం ఎప్పుడూ 'A' కన్నా ముందు ప్రవర్తించదు. తాళం పగల గొట్టడం దొంగతనం చేయడం క్రమంలో ఉంటాయని, ముందు దొంగతనం తర్వాత తాళం పగలగొట్టడం ఉండవని అనుక్రమం ఎలా ఉంటుందో చెప్పాడు.

తర్కానికి వచ్చిం తాళం పగలగొట్టకుండా తలుపులు విరగ్గొడితే గోడలు తవ్వితే అని ఎవరైనా అడగవచ్చు. కాని ప్రకార్యాల లక్షణాలను అనుసరించి తాళం పగలగొట్టడం, తలుపులు విరగగొట్టడం, గోడలు తవ్వడం ఇవి అన్నీ ఒకే విధంగా దొంగతనానికి దారితీసేవి కనుక ఈ మూడు ఒకేకరకమైన కథాపాత్రల ప్రకార్యాలు అవుతాయి. అందుకే ప్రాప్ "ప్రకార్యాల ఎన్నిక జానపద కథాసంచయం అంతటిపై ఆధారపడి చెప్పే కీలకాంశం" అని అంటాడు.

జానపద కథాధ్యయనం మనకు అందుబాటులో ఉన్నసామగ్రి నుండి తర్కబద్ధమైన అనుక్రమాన్ని పాటిస్తూ నిగమన పద్ధతి (deductive method) ద్వారా సాగాలి అనేది ప్రాప్ విధానం. ప్రకార్యాల ఎన్నికఅనుక్రమ నిర్దేశం ఈ నిగమన పద్ధతిలోనే చేశాడు. మనకు గ్రంథసామగ్రి పరిమాణం కన్నా విశ్లేషణలో గుణం ముఖ్యం. గణవిస్తృతికన్నా గుణ విస్తృతి ముఖ్యం అంటాడు. తన సిద్ధాంతానికి ప్రాతిపదిగకా వందకథలనే ప్రదర్శించాడు. ఇది నిగమన పద్ధతివల్లనే సాధ్యం అయింది. కాని సిద్ధాంతప్రతిపాదనలో వంద కథలనే గ్రహించినా ప్రాప్ అనుసరించిన పద్ధతి సిద్ధాంతం మొత్తం అద్భుతకథా ప్రపంచానికి చెందినది.

> "ప్రకార్యాల అనుక్రమాన్ని ఏర్పాటు చేసుకోవడంలో ప్రాప్ అనుసరించిన పద్ధతిని గమనిద్దాం."

ప్రాప్ అనుసరించిన విధానం, సైద్ధాంతిక ఆలోచనలు మొత్తం అద్భుతకథా ప్రపంచాన్ని 31 ప్రకార్యాల కథానమూనాలోనికి కుదించిగలిగింది

అంటారు జానపదవిజ్ఞానులు. అదే ప్రాప్ సిద్ధాంతంలోని సంక్షిప్తత దానిలోనే సమగ్రత. కింద ప్రాప్ చెప్పిన 31 ప్రకార్యాలను చూద్దాం. ఒకక్రమసంఖ్యలో ప్రాప్ చెప్పిన పద్ధతిలో ప్రకార్యాలు పేరు దాని సంఖ్యను మాత్రమే ఇక్కడ ఇవ్వడం జరుగుతూ ఉంది. క్లుప్తత కోసం ఇది తప్పదు. వీటి విస్తృతమైన వవరణ కొరకు ఆ ప్రకార్యాలకు ఉదాహరణ ప్రాయంగా ఉండే కథాంశాల కొరకు "జానపద అద్భుతకథానిర్మాణం" గ్రథాన్ని సంప్రదించండి .

> ప్రాప్ అనుసరించిన విధానం, సైద్ధాంతిక ఆలోచనలు మొత్తం అద్భుతకథా ప్రపంచాన్ని 31 ప్రకార్యాల కథానమూనాలోనికి కుదించగలిగింది అంటారు జానపదవిజ్ఞానులు.

జానపద అద్భుతకథ కు ఉన్న ప్రకార్యాలు:

కుటుంబంలోని ఒక సభ్యుడు ఇంటినుండి వెళ్ళిపోవడం.- ప్రకార్యం పేరు: నిర్వచనం. అనుపస్థితి, (absene) సంకేతం. (బీటా) (ఇక పైన అన్ని ప్రకార్యాలకు ఇదే విధంగా ప్రకార్యం పేరు దాని సంకేతం ఉంటాయి.

కథానాయకునికి (ప్రకార్యాలలో కథానాయకుడన్న ప్రతిచోటా దాన్ని కథలో ప్రధానపాత్ర అన్నదానికి పర్యాయంగా గ్రహించాలి. అది కథలో స్త్రీకూడాకావచ్చు. బాలుడు కావచ్చు. మరొకటి కావచ్చు) ఒక నిషేధం ఎదురుకావచ్చు. ని. నిషేధం (Interdiction)-సం. y

నిషేధాన్ని అతిక్రమించడం. ని. అతిక్రమణం (violation) సం. d

ప్రతినాయకుడు (ప్రముఖ ప్రధానదుష్టపాత్ర) దుష్టవ్యూహరచనా ప్రయత్నం చేయడం. (reconnaissance) ని. దుష్టవ్యూహం. సం. c

ప్రతినాయకుడు బాధితునికి సంబంధించిన సమాచారంతెలుసుకోవడం. ని. వార్తాబహిర్గమనం (Delivar) సం. f.

ప్రతినాయకుడు నాయకుని గాని వారికి సంధించిన వారిని గానీ పొందడానికి మోసగించే వ్యూహరచన. ని. మోసం (fraud). సం. n

ప్రతినాయక బాధితుడు (victim) తనకు తెలియకుండానే శత్రువుకు సహాయం చేయడం. ని. మోసానికి చిక్కడం (complicity). సం. z

ప్రతినాయకుడు, కుటుంబంలోని (నాయకుని) వ్యక్తిని గాయపర్చడం తీవ్రమైన హాని కలిగించడం. ని. దౌష్ట్యం (villainy). సం. A.

8A. కుటుంబంలోని వ్యక్తి ఏదో ఒక అభావం కలిగి ఉండి పొందాలనుకోవడం. ని. అభావం (lack) సం.a.

నాయకునికి తన దురదృష్టం లేక అభావం జ్ఞాతం కావడం. ని. మాధ్యమిక దశ (conjunctive movement) సం. B.

అన్వేషకుడైన నాయకుడు ప్రతిచర్యకు సంసిద్ధుడు కావడం. ని. ప్రతిచర్యారంభం (beginning- Counteraction) సం. C

నాయకుడు కార్యాన్వేషియై నిర్గమించడం. ని. నిర్గమనం. (Departure)↑

నాయకుడు సహాయకునినుండి సాయం పొందే దశలో పరీక్షలకు, ప్రశ్నలకు, దాడులకు గురికావడం. ని. సహాయకుని తొలి ప్రకార్యం (first function of the Doner). సం. D.

సహాయకుని చర్యలకు నాయకుడు ప్రతిస్పందించడం. ని. నాయకప్రతిస్పందన. సం.E.

నాయకుడు ఒక మాంత్రిక శక్తిని (వస్తువు, మొ..) అధీనంలోనికి తెచ్చుకోవడం. ని. మాంత్రిక శక్తి గ్రహణం. (Acquisition) F.

నాయకుడు తను వెదికి పొందదలచుకున్న స్థలాన్ని చేరుకోవడం, లేదా చేరుకునే విధంగా పూర్తిగా తెలిసిరావడం. ని. జ్ఞాతం. (translocation). సం. G.

నాయకుడు ప్రతినాయకుడు ప్రత్యక్ష యుద్ధానికి తలపడడం. ని. పోరాటం. (struggle). సం. H.

కథానాయకుడొక ముద్రని పొందడం. (ఇది ముద్ర రూపంలో కాని గుర్తు రూపంలో కాని ఉండవచ్చు). ని. ముద్ర (branding). సం.J.

ప్రతినాయకుడు (దుష్టశక్తి) ఓడింపబడడం. ని. విజయం. (victory) సం. I.

ప్రారంభంలో ఉన్న దురదృష్టం లేక అభావం తీరిపోవడం. ని. అభావ నిష్కృతి (lack liquidation). సం. K.

నాయకుడు (లక్ష్యసాధన పిదప) వెనక్కు తిరిగి రావడం. ని.తిరిగిరాక. (Return). సం. ↓

నాయకుడు వెంటాడబడడం. ని. వెంటాడబడడం (శత్రువ్యూహం). (pursuit) సం. Pr.

నాయకుడు ప్రతినాయకుని వేటనుండి రక్షించుకోవడం. ని. శత్రువ్యూహనిర్గమనం. (rescue). సం. Rs.

ఇంటికి చేరిన లేదా వేరే దేశానికి చేరిన నాయుకుడు గుర్తించబడకపోవడం. ని. గుర్తించబడకపోవడం. (Unrecognized arrival). సం. O.

ఒక వ్యక్తి (ప్రతినాయకుడు) నాయకునిగా ఆరోపించుకోవడం. ని. ఆరోపణ. (unfounded claim) సం. L.

నాయకుని ముందుకో కష్టసాధ్యమైన కార్యం రావడం. ని. కష్టకార్యం (difficult task). సం. M.

నాయకుడు కష్టకార్యాన్ని నిర్వహించడం. ని. సాధింపు (solution). సం. N.

నాయకుడుగా గుర్తించబడడం, నిరూపింపబడడం. ని. గుర్తింపు (recognition) సం. Q.

నాయకుడుగా ఆరోపించుకున్న వ్యక్తి అసలు రంగు బయటపడడం. ని. భంగపాటు. (exposure) సం. Ex.

నాయకుడు నూత్నరూపాన్ని పొందడం. ని. మార్పు (transfiguration) సం.T.

ప్రతినాయకుడు శిక్షింపబడం. ని. దుష్టశిక్షణం (punishment) సం. U.

నాయకుడు వివాహితుడు కావడం, సింహాసనాన్ని అధిష్ఠించడం. ని. వివాహం (Wedding). సం.W.

పైన చెప్పిన 31 ప్రకార్యాలకు వాటికే చెందిన ఉపప్రకార్యాలు రెండునుండి పది దాకా ఉండవచ్చు. అంటే ఉప ప్రకార్యాలు అన్నీ ఒకే లాగా ఉండకపోవచ్చు. కథను బట్టి మారవచ్చు. కాని వాటి స్వభావాలు ఆ యా ప్రకార్యాల క్రింద అలాగే ఉంటాయి. ఈ 31 ప్రకార్యాలు సూచించిన తర్వాత ప్రాప్ కొన్ని కథలలో నాయకుని భిన్న చర్యల వల్ల ఊహించని ప్రకార్యం అదనపు ప్రకార్యం లాగా రావచ్చునని సూచించాడు. దానికి Xని సంకేతంగా పెట్టుకోవచ్చునని కూడా సూచించాడు.

పై సూత్రాలను అన్నింటిని కలిపి చదివితే వాటి సంకేతాక్షరాలను ఒక చోట ఒక వాక్యంలాగా రాస్తే ఇది జానపదకథా నిర్మాణ సూత్రం లేద అద్భుతకథా నిర్మాణ సూత్రం అవుతుంది. దాన్ని కిందచూడవచ్చు.

**b y d e f n z A a B C↑D E F G H J I K↓Pr Rs O L M N Q Ex T U W-X**

ఇదే ప్రాప్ సృష్టించిన విధానం జానపద అద్భుత కథా నిర్మాణసూత్రం. దీనికింద ఉపప్రకార్యాలు కూడా వేసుకోవచ్చు. అది ఒక చిత్రాన్ని పోలి ఉంటుంది. దీన్ని ఒక గ్రాఫ్ రూపంలో కూడా వ్యక్తం చేసి గీయవచ్చు.

పైన చూపిన కథా ప్రకార్యాలను చూచినప్పుడు మనకు తెలుగులోని ఎన్నో కథల కథాంశాలు గుర్తుకు వస్తాయి. విశేషించి మనం బాలనాగమ్మ కథని చూస్తే ఈ నిర్మాణ ప్రకార్యాలు అన్నీ గమనించవచ్చు. అంతే కాదు మనకు అద్భుత కథల నిధి ఒకటి ఉంది. అది కాశీమజిలీ కథలు వాటిని మధిర సుబ్బన్న దీక్షితులు అనే ఆయన రచించాడు. రచించాడు అని చెప్పడం కన్నా వాటిని మౌఖిక మాధ్యమం నుండి సేకరించి తనదైన శిష్ట భాషలో పునః సృజన చేశాడు అని చెప్పవచ్చు. ఇవి కాక మనకు బి. విఠలాచార్య సినిమాలకున్న నేపథ్యం పేదరాశి పెద్దమ్మకథ. కాంభోజరాజు కథ వంటి సినిమాలకు ఉన్న కథా నేపథ్యం ఇటీవలే సినిమాగా వచ్చిన భైరవ ద్వీపం కథ నేపథ్యం అవి అన్నీ కూడా కొంత మార్పులు చేసిన జానపద కథలే. ఇవి అన్నీ కూడా మౌఖిక మాధ్యమం నుండి సేకరించినవే. వాటి అన్నింటిలో పైన చెప్పిన 31 ప్రకార్యాల నిర్మాణాన్ని మనం చూడవచ్చు. పైకి కొన్ని మార్పులు కనిపించవచ్చు. కానీ అంతర్గతంగా ఇలాంటి నిర్మాణమే కనిపిస్తుంది. ప్రాప్ ప్రతిపాదించిన నిర్మాణ సూత్రం ఇలా కొన్ని వేల కథలను వేరువేరు సంస్కృతులనుండి సేకరించిన కథలను పరిశీలించి చూడడంవల్లనే అలాంటి సూత్రాన్ని తయారు చేయడం సాధ్యపడింది. ఇదే ప్రాప్ చెప్పిన జానపద అద్భుత కథానిర్మాణం.

ప్రాప్ పరిశీలించిన కొన్ని వేల కథలలో కథాంతాన నాయకుడు మరణించి కథ దుఃఖాంతం అయిన కథ ఒకటే లభించింది. అద్భుతకథ వినోదాత్మకమూ, సుఖాంతమూ అన్న విషయం మనం మర్చిపోరాదు. ప్రాప్ సిద్ధాంత నిర్మాణానికి వినియోగించుకున్న కథల (౧౦౦) నిర్మాణ సూత్రాలన్నీ ఒక పట్టిక రూపంలో ఇచ్చాడు. ఈ కథా సూత్రాలు తెలుగు అద్భుత కథలతో తులనాత్మకంగా అధ్యయనం చేయడానికి ఉపయోగపడతాయి. బాలనాగమ్మకథ ప్రాప్ అద్భుత కథా నిర్మాణంతో

అంటే విశ్వ అద్భుతకథానిర్మాణంతో (universal structure of wonder tale) పూర్తిగా సంవదిస్తూ ఉంది.

కథా తత్త్వ వివేచన చేయడం ప్రాప్ పద్ధతి నిర్మాణాధ్యయనంలో స్థూలంగా చెప్తే ఉండదు. అయినా అసంఖ్యాక కథా నిర్మాణాలను ఒక జాతిలోని కథా సంచయం నుండి గ్రహించి వాటిలోని ప్రకార్యాలను విన్యాసాన్ని గమనించి వాటి నుండి సమాజంలో సామూహికంగా ఉన్న భావజాలాన్ని తెలుసుకోవచ్చు అని అంటాడు అలన్ డండెస్. కథాపాత్రల ప్రకార్యాలు భిన్న మానవ మనస్తత్త్వాలను తెలియ జేస్తాయి. కనుక అది కథలలో ఎలా ప్రవహిస్తుందో తెలుసుకోవడానికి ప్రాప్ చెప్పే కథాపాత్రల ప్రకార్యాలు పనిముట్లు అవుతాయి.

> ప్రాప్ పరిశీలించిన కొన్ని వేల కథలలో కథాంతాన నాయకుడు మరణించి కథ దుఃఖాంతం అయిన కథ ఒకటే లభించింది. అద్భుతకథ వినోదాత్మకమూ, సుఖాంతమూ అన్న విషయం మనం మర్చిపోరాదు.

ప్రాప్ కథా స్వరూప శాస్త్రానికి భారతీయ కావ్యశాస్త్రం చెప్పిన ఇతివృత్త నిర్మాణానికి సంబంధించిన ఆలోచనలలో చాలా పోలికలు కనిపిస్తాయి. మన కావ్యశాస్త్రాలు కూడా కథలను వివిధ రకాలుగా విభజించాయి. కథలలో క్రమంగా అయిదు అవస్థలు కలిగి ఉంటాయని చెప్పింది. బీజము, బిందువు, పతాక, ప్రకరి కార్యము అని అయిదు విభాగాలుంటాయని సంధి సంధ్యంగాలుంటాయని వివిధ అవస్థలుంటాయని మన శాస్త్రాలు చెప్పాయి. దశరూపకాలలో చెప్పిన నిర్మాణాలు ప్రాప్ నిర్మాణాలకు పోలికలున్నాయి. ముందు కాలంలో వీటి తులనాత్మక అధ్యయనం చేయవచ్చు.

ప్రాప్ నిర్మాణ విధానాన్ని తర్వాతి కాలంలో అలన్ డండెస్ భిన్న విధానాలలో వినియోగించుకోవచ్చునని సూచించాడు. అంతే కాదు తెలుగులో లభించే జానపదకథలకే కాకుండా నవలలోని కథావస్తువులకు వివిధ రకాలైన ఆధునిక కథలకు ప్రాప్ పద్ధతి ద్వారా అధ్యయనం చేసే వీలుంది. ఈ విధానంలో కూడా అవసరమైన మార్పులు చేసుకొని దీన్ని ఆధునిక అవసరాలకు కూడా వినియోగించుకోవచ్చు.

## Select Bibliography:


**Foley John Miles. 1985. Oral-Formulaic Theory and Research: An Introduction and Annotated Bibliography. New York: Garland Publishing.**

**Foley Jon Miles.1988. The Theory of Oral Composition. Bloomington: Indiana University Press.**

**Lord Albert B. 1960. The Singer of Tales. Cambridge, Mass: Harvard University Press.**

**Narayanarao Velcheru. 1987. Telugulo Kavita Viplavala Swrupalu. Hyderabad: Hyderabad Book Trust.**

**Ong, Walter 1982. Orality and Literacy: The Technologizing of the Word. New York: Methuen.**

**Ramaraju B. 1978. Telugu Janapada Geya Sahityam. Hyderabad: Janapada prachuranalu.**

**Subba Rao TV. 1976. Katama Raju Kathalu Vol. I. Hyderabad: Andhra Pradesh Sahitya Akademi.**




పతితులార!
భ్రష్టులార!
దగాపడిన తమ్ముల్లార!
మీకోసం కలం పట్టి,
ఆకాశపు దారులంట,
అడావుడిగ వెళిపోయే,
అరచుకుంటు వెళిపోయే
జగన్నాథుని రథచక్రాల్!
రథచక్ర ప్రళయ ఘోష
భూమార్గం పట్టిస్తాను!
భూకంపం పుట్టిస్తాను! - శ్రీ శ్రీ

# తెలుగు కథాకావ్యాలు విశిష్టత



ఆచార్య రాచుగాల్ల రాజేశ్వరమ్మ
9491420180

తెలుగులోని కథాకావ్యాలకు మూలం సంస్కృత భాషలో వచ్చిన కథాకావ్యాలే. మిగిలిన ప్రక్రియలు మాదిరిగానే కథా కావ్యాలను సైతం తెలుగు కవులు అనుసరించారు. సంస్కృతంలోని బృహత్కథ, బేతాళ పంచవింశతి, సింహాసన ద్వాత్రింశిక, శుకసప్తతి, పంచతంత్ర కథలు, దశకుమార చరిత్ర, బల్లాల దేవుడి భోజ ప్రబంధం మొదలగు వాటిని ఈ కోవలో వచ్చిన సాహిత్యంగా చెప్పుకోవచ్చు.

## కథాకావ్య లక్షణాలు :

మనోరంజకాన్ని కలిగించటంతో పాటు నీతి ధర్మాలను బోధించటం ఈ కథల ఉద్దేశ్యం. మనోరంజకంతో పాటు ఈ కథలు రాజనీతి, వ్యవహార జ్ఞానాన్ని కార్య కుశలతను బోధించేవిగా కూడా ఉన్నాయి. ఈ కథలలో మనుష్య పాత్రలతో పాటు పశుపక్ష్యాదులు కూడా చేరి ఉండటం ఒక విశిష్టత. ఆయా పక్షులు ఆయా గుణాలకు ప్రసిద్ధి. ఒక్ ప్రధాన కథలో మరొక కథ, మరొక కథలో మరోకథ చేరి ఉండటం భారతదేశ కథల ప్రత్యేక లక్షణం.

## కథాకావ్య భేదాలు :

*కథా కావ్య భేదాలను 4 విభాగాలుగా విభజించారు.*

1. ఆలంకారిక శైలిలో రచింపబడిన గద్య కథాకావ్యాలు : సుబంధుని వాసవదత్త, బాణుని కాదంబరి, దండి దశకుమార చరిత్ర ఈ విభాగానికి చెందినవి.

2. సాహసాద్భుత కథలు : బృహత్కథ, శుకసప్తతి, విక్రమార్కుని కథలు, మొదలైనవి.

3. రాజనీతిని, వ్యవహార జ్ఞానాన్ని బోధించే కథలు : పంచతంత్ర కథలు, సింహాసన ద్వాత్రింశిక కథలు, భోజరాజీయము.

4. ధర్మ బోధనకై, మత సంబంధమైన నేపథ్యంలో పుట్టినవి : బౌద్ధ, జాతక కథలుగా పేర్కొన్నారు.

ఈ లక్షణాలతో తెలుగులోకి ఇవి రావడానికి గల కారణాలేమి, కథాకావ్యాలను తెలుగు వారు ఎందుకు ఆదరించారు? వీటినుండి ఏమి గ్రహించాలి అన్న ప్రశ్నలు ఉదయిస్తాయి.

తెలుగులో 12,13 శతాబ్దాల కాలంలో కథా కావ్యాల రచనకు అంకురార్పణ చేశారు. దీనికి గల కారణాలను పరిశీలిస్తే - నెల్లూరును తెలుగు చోడులు, ఓరుగల్లును కాకతీయులు పరిపాలిస్తున్న కాలం. ఆంధ్రప్రదేశ్లో జైన, బౌద్ధ మతాలు అంతరించిపోతున్న కాలం. రాజకీయంగా తూర్పు చాళుక్యుల పాలన ముగిసి అనేక చాళుక్య చోళ కుటుంబాలు చిన్నచిన్న రాజ్యాలుగా పరిపాలిస్తున్న కాలం. సమాజంలో మతపరమైన మార్పులు ప్రవేశించాయి. జైన, బౌద్ధ మతాల స్థానంలో శైవం, వైష్ణవాలు ప్రాబల్యాన్ని పొందుతున్న కాల పరిస్థితి, చిన్నచిన్న రాజవంశాల వలన రాజకీయ సుస్థిరత లోపించిన కాలంలో ఇటువంటి స్థితిలో ఈ కథాకావ్యాలు వెలుగులోకి వచ్చాయి. మత సామరస్యమును, సాంఘిక శాంతిని నెలకొల్పాల్సిన స్థితి ఏర్పడింది. మత సహనమునకు అనుకూలమైన పరిస్థితులు ఏర్పడాల్సిన అవసరం కలిగింది. రచనాపరంగా శ్రీనాథుని కాలం సంధియుగం. నన్నయాదుల పురాణమార్గం, శ్రీనాథుని తర్వాత ప్రబంధ కవితాయుగం రెండింటి మిశ్రమం, పురాణేతిహాసాల అనువాదమునకు, ప్రబంధముల స్వతంత్రతకు నడిమికాలం. మూల విధేయత, స్వతంత్రత రెండూ గుణాలు కలిగిన సంధి యుగంలో ఈ కథా కావ్యాలు వచ్చాయి.

తెలుగులో వచ్చిన కథా కావ్యాలలో ప్రధానంగా దశకుమార చరిత్ర, కేయూర బాహుచరిత్ర, సింహాసనా ద్వాత్రింశిక, భోజరాజీయము శుకసప్తతి, హంసవింశతి, పంచతంత్ర కథలకు నేడు పరిమితమై వీటి విశిష్టతను తెలియజేస్తున్నాను.

## కేతన 'దశకుమార చరిత్ర' :

కేతన దశకుమార చరిత్ర తెలుగులో తొలి కథా కావ్యము. తెలుగులో కథా కావ్యాల ప్రారంభకుడిగా కేతనను చెపుతారు. తిక్కన సమకాలికులలో కేతన (1200 - 1280) ముఖ్యుడు. సంస్కృత భాషలో రాసిన 'దశకుమార చరిత్ర' గద్య కావ్యమును చంపూకావ్యముగ రచించి, తిక్కనకు అంకితమిచ్చాడు. ఇది పన్నెండు ఆశ్వాసములు 1625 గద్య పద్యములతో అంచితభావ రసోదయాభిరామముగా అనువదించాడు. మూలములోని వర్ణనలను కథా

ధోరణికి అవరోధము కలుగనీయకుండ సంగ్రహించాడు. మూలములో లేని కొన్ని ఆంధ్ర దేశీయాచారాలను చొప్పించాడు.

ఈ కావ్యంలో పదిమంది వీరకుమారుల సాహస గాథలను కథనం చేశాడు. వీళ్ల వీరోచిత చరిత్రలో మొదట క్లుప్తంగా విళ్ల తండ్రుల పైనాలు, వాళ్లంతా ఏ రాజుల దగ్గర ఉండిందీ చెప్పాడు. యవ్వనం రాగానే పదిమంది కుమారులు సాహస యాత్రకు వెళ్ళి చెల్లాచెదరవుతారు. ఒక్కొక్కరు ఒక్కో విచిత్ర జీవితానుభవాన్నే పొందుతారు. అపూర్వ సంఘటనలలో చిక్కుకుంటారు. వీరంతా మరల కలుసుకొని, తమ తమ కథలను తమకు నాయకుడైన రాకుమారుడు రాజవాహనునికి చెప్తారు. దీనిని కథనం చేయడంలో కేతన గొప్ప ప్రజ్ఞ కనబరిచాడు. ఇందులో సోమదత్తుని, పుష్పోద్భవుని, రాజవాహనుడి కథలలో సందర్భానుసారం సమకాలీన సమాజ స్థితిగతులను వివరించారు.

ఇందులో ఆనాటి స్త్రీలు ధరించే ఆభరణాలు గురించి దశకుమార చరిత్ర 3 ఆశ్వాసం, 77వ పద్యంలో 'ఉలుజ్వల మణినూపురంబులు, మొలనూలు వస్త్రముల్ ముత్తియములు, కట్టువడంబులు, గట్టినూళ్ళను సుద్ద సరితీగెమినుకులు, సంది దండ, లంగుళీయకములు, హరి కంకణములు చేకట్టుసాలెలు, చెన్ను మెరుగుటాకులు, సరిపెణ లాలక్తకముపూత కాటుక తిలకంబు కమ్మపువ్వు అని ఆనాడు ధరించే ఆభరణ విశేషాలను వివరించారు.

దొంగతనానికి ఆనాటి దొంగలు ఏ సాధనాలను పట్టుకొని వెళ్ళేవారో ఈ పద్యంలో స్పష్టం చేశారు.

*పొయిదల నీలి దీట్కొలిపి బూడిద ముండల బంతి గాల చీ*
*రయు సెలగోల కత్తి భ్రమరమ్ముల క్రోలును మైలమందు గొ*
*య్యయు సురిగ్రొంకి నారసము నాదిగ గల్గిన సాధనంబుల*
*న్నియు సమకూర జేసికొని నేర్పున నేగితి మ్రుచ్చు ప్రొద్దునన్*

*(ద.కు.చ. 5-72)*

"వేశ్యాతల్లులు తమ /ఆడబిడ్డలను పెంచడంలో, తమ వృత్తిలో నేర్పించే మెళుకువలను నియమాలను, విధులను ఈ విధంగా తెలిపారు కేతన.

"పిల్ల పుట్టినప్పటి నుంచి చక్కగా ఆహారంలో పెంచాలి. పుట్టిన పండుగలు, పేరంటాలు చేయాలి. కామశస్త్రం చదివించాలి. వివిధ కళలను, చదువు, మాటకారితనం నేర్పించాలి. ఉత్సవాదులలో బాగా అలంకరించి, కూతురును

ప్రదర్శించాలి. ఎవరికో ఒక జాతి రూపధనాదులు గల వారికి గాంధర్వ వివాహం చేసి శుల్కం పుచ్చుకోవాలి. ఇవే మాధర్మాలని కామమంజరి పాత్ర తెలిపింది. ఆనాటి సమాజంలో "సానుల వల్ల చెడిపోయిన వాళ్ళంతా భ్రష్టులే వారికి విమోచన లేదని వాళ్ళు జైనమతంలో కలవవలసిందేనన్న విపరీత భావన ఆనాడు ప్రజలలో కలిగి ఉండేవారు. కేతన ఈ విషయాన్ని

*"మిండాట మాడి పొలసిన - మిండలకును జైనవృత్తి మేలని మదిలో*

*నొండు తలపుడిగి జినముని - మండలి కృప వడసి యొక్క మాంత్రికుచేతన్"*

*అని తెలిపారు. (ద.కు.చ.5-59)*

ఆనాటి జైనులనే గాక, బ్రాహ్మణ్యంలోను ఉన్న నీచత్వాన్ని, దిగజారుడు తనాన్ని కేతన చక్కగా ఆవిష్కరించాడు. "చదువుల విడిచి, యాచారంబు దిగద్రావి ధర్మపు చెరిచి, సత్యంబు గీటున బుచ్చి వలను దప్పి శౌనంబు వదిలి.... అని తెలిపారు.

ఆ కేతన దశకుమార చరిత్రలో చిన్నచిన్న తెలుగు మాటలతోనే కథా కథనం చేశాడు. తెలుగుతనం ఉట్టిపడే సామెతలు జాతీయాలు, పలుకుబళ్ళు అతని రచనలో ఉన్నాయి.

**ఉదా :**

*కన్నుగానక కయ్యమునకు కాలుద్రువ్వి (2)*

*లోకము వారు నవ్వరే (2-32)*

*ఏటికి ఎదురీదు మాడ్కి (3-120)*

*తల ప్రాణము తోకకు వచ్చె (3-129)*

*అందని మ్రాని పండ్లకును నర్రులుసాచిన నేమి చేయుదున్ (3-131)*

*తేనియబడ్డ ఈగ గతి (6-30)*

మొదలగునవి ఉదహరించుకోవచ్చు.

కేతన తెలుగులో మొట్టమొదటి కథా కావ్యాన్ని విరచిస్తూ ఇందులో కొన్ని కొత్త పద్ధతులు ప్రవేశపెట్టారు. కావ్యం మొదలుపెట్టక ముందే కృతిపతి ఉండే 'విక్రమసింహపురిని' వర్ణించడం, తిక్కనను వారి తల్లి కడుపుతో ఉన్నతీరును వర్ణించడం ముందు కవుల కంటే కేతన చూపిన కొత్త పద్ధతిగా చెప్పవచ్చు.

*సీ. గర్భితన వసుధాకర పయోనిధి మాడ్కి, సతిమేను పాండురచ్ఛవి*

*వహించె..... మది సందదించె నారు నందమయ్యె, ననుప*

*మాన భాగ్యయగు నన్నయాంబకు వర్ణనీయ గర్భవైభవమున"*

*అని (1-86) లో తెలిపారు.*

కృతిపతి జననానికి ముందు ఇలా గర్భవైభవాన్ని ఇంకే కవి వర్ణించలేదని సాహితీవేత్తల అభిప్రాయం.

ఈ దశకుమార చరిత భిన్న భిన్న కథలున్న వీరరస ప్రధాన కావ్యం. ఇది బహునాయకాశ్రయత్వం గలది. ఇందులో సాహసకృత్యాలు, అద్భుత సంఘటనలు మహిమాన్విత దృశ్యాలు, జానపదులకు దగ్గరగా ఉన్న కథలు కన్పిస్తాయి. ఈ కావ్యములో రాజనీతియే ప్రధానమై ఆద్యంతమూ కన్పిస్తుంది. సందర్భానుసారంగా రాజనీతి విషయాలు అక్కడక్కడా కన్పించినా, విశ్రుతుని కథలో విస్తృతంగా చెప్పాడు. వీటితో పాటు సప్త వ్యసనాలు కథాగమనంలో విహరిస్తుంటాయి. జూదం, దొంగతనం, దోపిడి ఘాతుకాలు, మారువేషాలు, పరకాంత పరాయణత్వం, విటుల వేశ్యాకలాపాలు మొదలగునవి కథలో వస్తువులుగా కన్పిస్తాయి.

### రాజనీతి:-

మానసారుడు - రాజహంసుల ఘట్టంలో తనకంటే బలవంతుడైన రాజు దండెత్తినపుడు ఏ సందర్భంలో సంధిచేసుకోవాలో, లేని పక్షాన ఎలా అడవుల పాలవుతారో వర్ణించాడు.

కామ మంజరి జైనమునిని వశపరచుకున్న సందర్భాన్ని "అలరులు బూత లంబరము లాభరణములు దమ్ములంబు నె....... త్ఫలమగు సౌఖ్యసిద్ధి దెలుపన్ వశమె యనుభూతి దక్కగన్" అని (ద.చ. 5-28)లో వివరించారు. దీంతో పాటు రాగమంజరి మోహంలో చిక్కినవాని స్థితి గురించి "దాని తానూ విలాసములు దాని యుపాంగ విలోకనముల్.... దేనియపడ్డ యీగగతి ధీరత నొల్పెడి బిట్టు చిక్కితిని" అని తెలిపారు.

దీనిని కేతన ఆలంకారిక శైలిలో రాసిన కథా కావ్యంగా రాశాడని, ఇందులోని వర్ణనల ఆధారంగా అర్థం చేసుకోవచ్చు.

### మంచెన 'కేయూర బాహు చరిత్ర':-

ఇది 4 ఆశ్వాసాల, 767 గద్యపద్యాలతో కూడిన రసవత్ కావ్యము. కావ్య

అవతారికలో గాని, ఆశ్వాసాంతగద్యలోకాని మంచెన తన గురించి, ఏమీ చెప్పుకోలేదు. ఈ రచనను, వెలనాటి చోళరాజు అయిన నండూరి గండయకు అంకితమిచ్చాడు. వెలనాటి చోళుల కాలంనాటి సామాజిక స్థితిని గురించి 'కేయురబాహు చరిత్ర' తెలుపుతుంది.

సంస్కృతంలో రాజశేఖరుడు రాసిన 'విద్ధసాలభంజిక' అను నాలుగు అంకాల నాటికకు ఇది చంపూరూపమైన స్వతంత్ర కావ్యము. సంస్కృతంలోని దృశ్యకావ్య రచనను తెలుగులో శ్రవ్యకావ్యముగా అనువదించిన మొదటి రచనగా దీనిని చెప్పుకోవచ్చు. మంచెన పంచతంత్ర హితోపదేశముల నుండి కొన్ని నీతికథలను గ్రహించి తన కాలమున జన సామాన్యములో వాడుకలో ఉన్న కొన్ని నీతికథలను కల్పించి మొత్తం 22 కథలను ఈ రచనలో చేర్చాడు. మంత్రికి అతని మేనల్లుడు సోమదత్తుడు చెప్పిన కొన్ని కథలను, అంతఃపురదాసీలగు సుమతి, మకరందిక, సుకుమారికలు తమలో తాము చెప్పుకున్నట్లు మరికొన్ని కథలను, రాజుకు విదూషకుడు, బాదరాయణుడు చెప్పినట్లు కొన్ని కథలను మంచెన వివరించి, మూలకథతో ముడిపెట్టినాడు.

ఇందులో కేయూర బాహుడు, మృగాంకావళీ, రత్నసుందరి ప్రధానపాత్రలు. కేయూరబాహు భార్య రత్నసుందరి వ్యామోహంతో రాచకార్యాలను పట్టించుకోడు. మంత్రి దీనికి బాధపడి దీన్ని నివారించే ఉపాయం ఆలోచిస్తుంటాడు. భాగురాయణుడు, లాటదేశరాజు చంద్రవర్మ దేశంపైకి మహరాష్ట్రులు దండాయాత్రకు వస్తున్నారని, కుమార్తె మృగాంకావళిని కొడుకుగా భావించి 'మృగాంకవర్మ' పేరుతో పెంచుతున్నాడని, తన కూతుర్ని వివాహమాడిన వారికే తన రాజ్యానికి సార్వభౌముడవుతాడని ఒక చారుడి ద్వారా తెలుసుకొని, తన కోరిక, రాణి కోరిక సైతం తీరుతుందని, రాజు దృష్టి రెండవ భార్యపై మళ్ళించడానికి తగిన ప్రయత్నం చేయడం, రాణి తన చెలికత్తె మాటలను నమ్మి రాజును అవమానించాలనుకొని, ఆ ప్రయత్నంలో తానే మోసపోయి, చివరకు వేరేమార్గం లేక మృగంకావళితో రాజు పెండ్లి జరిపించి, ఆమెను రెండవ రాణిగా అభిమానించడం ఇందులోని కథ.

ఈ కథ ప్రధానంగా స్త్రీలోలుడైన రాజును ఆ వ్యామోహం నుండి మరలించి, రాజుకు సార్వభౌమత్వాన్ని సంపాదించి పెట్టడానికి మంత్రి పన్నిన ఉపాయాలతో కూడిన చమత్కార సన్నివేశాలతో కూడి ఉంది. ప్రధాన కథలో భాగంగానో, ఏదో ఒక సందర్భంలో పాత్రల పరస్పర సంభాషణలో భాగంగానో ఈ కథా కావ్యంలో 22 కథలు చెప్పబడ్డాయి. ఇందులో 'వైశ్యబాలిక' కథలో వ్యాపార వర్గాలలో కోడలిగా

వెళ్ళే స్త్రీకి ఎత్తుకు పై ఎత్తులు వేసే లౌకిక జ్ఞాన అవసరాన్ని ఈ కథలో చెప్పారు.

దక్షుని కథలో కాముకులైన వ్యక్తులు స్త్రీలను వేధించే విధానాన్ని, అవసరాన్ని బట్టి తమ ప్రవర్తనను కప్పి పుచ్చుకోవడానికి వాళ్ళు అనుసరించే పద్ధతులను ఈ కథ తెలుపుతుంది.

చతురిక కథలో వేశ్యలు ఏ ఉపాయంతో అనేకమంది విటులతో కపట ప్రేమను కనబరిచి, ధనం రాబడతామనే విషయాన్ని, 'నిపుణిక కథ'లో స్త్రీల జీవితంలో గర్భం మోయటం, ఎంత కష్టమో అందులోని సాధక బాధకాలను తెలపడంతో పాటు స్త్రీ ప్రసవించడం అదనపు బరువుగా భావించే స్థితిని చిత్రించాడు.

సందర్భానికి తగినట్లుగా అనేక కథలను రసవత్తంగా, నీతి కథాబోధకంగా ఆవిష్కరించారు.

పనియొక్క లోతు తెలిసికోకుండా ఇతరులు చెప్పిన మాటలు నమ్మి, ఇతరులను మోసం చేయాలనుకునే వారు రత్న సుందరి వలె తామే మోసపోతారని ఈ సంఘటన వలన గ్రహించవచ్చు. ఈ విషయాన్ని

*కార్యమూల మెరుంగక కడగి యొరుల*
*కఱపు మదినమ్మి తమకు నయ్యేఱుక లేక*
*యొరుల బఱచెద మని పోయి యొరులచేత*
*వారు పడుదురు రత్న సుందరి విధమున"*

*(కే.బా.చ. 4)*

తెలుగు పదాల కూర్పు, మృదుమధురమైన శైలి ఈ కథల్లో బాగా కన్పిస్తుంది. ఇతని రచనాశైలి తర్వాత కవులకు అనుసరణీయమైంది.

**ఉదా :**

పోతన చెప్పిన పద్యంగా మనం భావిస్తున్న "బాలరసాలవల నవపల్లవ..... అనుదన్ని, పెద్దన మనుచరిత్రలోని "ఎవ్వరిదాన వీవు హరిణేక్షణ యెయ్యది నీకు పేరు? అను మంచెన తన కావ్యంలో చెప్పిన రెండు పద్యాలను తరువాత కవులు అనుకరించాలని తెలుస్తుంది.

ఎక్కడివాడో యక్ష తనయేందు జయంత వసంత కంతులం... అను రెండు పద్యాలను తర్వాత కవులు అనుకరించారు.

అవాంతర కథలలో పంచతంత్ర ప్రేరణతో కొన్ని రాశారు. ఇందులో బుద్ధి చాతుర్యానికి (ఎత్తుకు పై ఎత్తు) సేవానిరతికి, మిత్రత్వానికి, రాజనీతికి సంబంధించిన సమయస్ఫూర్తికి కథలను ఇందులో తెలిపారు. ఇవిగాక, సాధారణ నీతులను కూడా ఇందులో తెలియజేశారు.

**ఉదా :**

సజ్జనులకు - దుర్జనులకు మధ్యగల వ్యత్యాసాన్ని గురించి

"చెలిమి శిలాక్షర మెప్పుడు; నలుక జలాక్షరము సుజనులగు వారలకున్, జెలిమి జలాక్షర మెప్పుడు, నలుక శిలాక్షరము కుజనులగు వారలకున్" అని (కే.చ. 3)లో చక్కగా వివరించారు.

శ్రమించినవాడు, కర్షకుడు వృద్ధి పొందుతాడనే, లోక సత్యాన్ని, లోకమున ఎవరెవరు ఎంత మోతాదులో ఉంటారనే విషయాన్నే "ఈ లోకమంతయు నాలుగుపాళ్ళు లొండొకట భిక్షకులు పోషకుల నొక్క.... పాలు.... జీవనము బోల దొండొక జీవనంబని" (కే.చ. 3)లో వివరించారు.

మంచిచెడులను చెప్పదలచిన మంచెన నేరుగా చెప్పక కథల ద్వారా సూచించాడు. ఇందులో చెడును ఎక్కువగా వివరించి, అలా ఉండకూడదన్న నీతిని తెల్పాడు. లోకనీతి కంటె వ్యక్తినీతినే అధికంగా చెప్పాడని తెలుస్తుంది.

**జక్కన విక్రమార్క చరిత్ర :**

ఇది 8 ఆశ్వాసములు, 1519 గద్య పద్యాలతో ఉన్న అపూర్వ కథా ప్రబంధము. దీనిని వెన్నెలకంటి సిద్ధయ మంత్రికి అంకితమిచ్చాడు. ఈ గ్రంథము చరిత్ర ప్రసిద్ధికెక్కిన విక్రమార్కుని పేరుమీద ఉన్నా ఇది చారిత్రక కావ్యము కాదు. విక్రమార్కుని సాహస ఔదార్యములను వర్ణించు కథలే ఎక్కువగా కన్పిస్తాయి. జక్కన దీనిని మహాకావ్య పద్ధతిలో ప్రబంధ శయ్యగా సంతరించాడు. ఇది అనువాద రచన కాదు. స్వతంత్ర రచనయే. జక్కన కల్పనాశక్తి, కథాకథన నైపుణ్యం, రమణీయమైన శయ్యా సౌభాగ్యము, చతుర కావ్య రచనా విధానం కన్పిస్తుంది. ఇది వీర, అద్భుత రసాలతో కూడిన గ్రంథము. జక్కన తనకాలం నాటికి విశేష ప్రచారంలో ఉన్న విక్రమార్క కథలను ఒకేచోట చేర్చి చక్కని కథలా చెప్పాడు. ఇవన్నీ విక్రమార్కుని పుట్టుక సాహస కార్యాలు, నిస్వార్థతను తెలిపేవిగా పన్నెండు కథలు ఉన్నాయి. సందర్భాన్ని బట్టి ఇందులో అనేక నీతులను తెలియజేశారు.

'మదన రేఖ' వృత్తాంతం ద్వారా స్త్రీలు తల్లిదండ్రుల అనుమతి తోనే ఏ పని అయినా చేసేవారని తెలుస్తుంది. ఆనాడు మేనరికపు వివాహాలుండేవని,

ఇల్లరికాలకు వచ్చే అల్లుళ్ళు ఉండేవారని, గర్భవతులైన భార్యలను చాలా జాగ్రత్తగా చూసుకునేవారని ఇందులోని సంఘటనల ద్వారా తెలుస్తుంది.

భర్తృహరి భార్య 'అనంగసేన' వృత్తాంతం ద్వారా భార్యల వ్యభిచారం భర్తకు తెలియడం వలన భర్తృహరి ఇంటిని, బంధువులను విడిచి తపస్సుకు వెళ్ళిన స్థితిని తెలుపుతుంది.

పద్మావతి, గుణవతి, లీలావతి అను అక్కాసెల్లెల్ల కథల ద్వారా వ్యభిచారంలో స్త్రీలు ఎంత నేర్పరులో, కుటుంబ నిబంధనలను అతిక్రమించి ఎంతటి విచ్చలవిడి జీవితాన్ని అనుభవిస్తున్నారో తెలుపుతుంది.

ఇందులో ఆ కాలంనాటి రాజుల వినోద విలాసాలను, ఆభరణాలను, వృత్తులను, ప్రయాణసాధనాలను వివరించారు.

ఈ కావ్యంలో శ్రీశైలం, అహోబిలం, తిరుపతి శ్రీరంగం, రామేశ్వరం, గంగ స్నాన మహిమ వంటి వివిధ తీర్థక్షేత్రాల వర్ణన వలన జక్కన క్షేత్ర పర్యటన చేసినట్లు అర్థం చేసుకోవచ్చు. జక్కన కడప జిల్లా సిద్ధవటం ప్రాంతం వాసిగా నిర్ధారించటం జరిగింది.

విక్రమార్కుని కథ ద్వారా మనిషికి సంఘర్షణలో పోరాడే స్వభావం, సమన్వయించుకునే ఔదార్యం మనిషికి కావాలి. ఈ రెండూ లేకపోతే మనిషి పిరికితనంతో పారిపోయి, జీవితాన్ని విఫలం చేసుకుంటాడు. సఫలమైన జీవితాలలో సాహసం, ఔదార్యం మనిషిలో పిరికితనాన్ని ప్రక్షాళన చేసి జీవితంలో పురోగమించడానికి ప్రేరణను కల్గించడమే ఈ గాథల లక్ష్యమని అర్థం చేసుకోవచ్చు.

## అనంతామాత్యుని భోజరాజీయము :

తెలుగులో మొట్టమొదటి స్వతంత్ర కథాకావ్యంగా కీర్తించబడింది. ఇది 7 ఆశ్వాసాల కథాకావ్యం. ఇందులో 17 కథలున్నాయి. భోజరాజు కథను కాంభోజు రాజుకు దత్తాత్రేయుడు చెప్తాడు. సర్పటి అను సిద్ధుడు భోజునకు ప్రసంగ వశమున చెప్పిన కథలే ఈ రచనలో కుర్చబడినవి. ఈ కథలన్ని అనంతుని స్వకపోల కల్పితములు. ఇది మానవ జీవిత ధర్మములకు ఉదహరణలుగా చెప్పబడినవి. ఇందులో అన్నదాన సుకృతమును గూర్చి తెలిపాడు.

గో వ్యాఘ్ర సంవాదం, దుష్టసతి, సత్పుతుల చరిత్ర, చండాల దంపతుల చరిత్ర, పుష్పగంధి కథ మొదలగునవి ఇందులో కలవు.

అన్నదానమే సకల దానములలో ఉత్తమమని మదనరేఖ బ్రహ్మ రాక్షసునికి కడగి "యుదారాగ్ని మర్చుట కంటే నెక్కడైన సుకృతంబు గలదయ్య యసురవర్య" అని తెలిపింది. అతిథిపూజనమే సర్వదేవతా పూజమని, బాహ్యాంతర శుద్ధిలేని దానము కొరగాదని, సత్యము, త్యాగము అను గుణములు క్రూర మృగాలను ఘోర రాక్షసులను కూడా హింసా విముఖులను చేయగలవని స్త్రీలకు పాతివ్రత్యమే సకలార్థ ప్రదమని, ధర్మపరమైన విషయాలను అనంతుడు ఈ కావ్యములో వివరించాడు.

ఈ కథల మాటున ఆనాటి సామాజిక, కుటుంబ జీవన స్థితిగతులను చక్కగా ఆవిష్కరించారు.

ఆడకు అసత్యభాషలు, కూడకు కొఱగాని వాని కొంకక యెరులెగ్గాడిన నెదు రుత్తర మీఁజూడకు విని వినని వాని చొప్పున జనమీ అని బిడ్డకు బుద్ధులు చెప్పినరీతికి ఉదాహరణగా చెప్పవచ్చు" ఆనాటి కాలంలో బహు భారత్వం అమలులో ఉండేదని భోజుని ద్వారా తెలుస్తుంది. భర్త మరణిస్తే స్త్రీలు సహగమనం చేసేవారు.

సమాజం చాతుర్వర్ణ వ్యవస్థను అనుసరించేదని, పంచముల జీవితాలు దారుణంగా ఉండేవని తెలుస్తుంది. ఇందులో కవి తన కలం ద్వారా మత మౌఢ్యంను ఖండించి, వర్ణంకన్నా ధర్మం గొప్పదని చెప్పాడు.

రాజ్యంలో ప్రజలంతా ధర్మ మార్గంలో నడిచేవారని ఆజ్ఞలను అతిక్రమించిన వారికి తప్పుచేసిన వారికి కఠినమైన శిక్షలుండేవని స్త్రీలు, బాలురకు చాలా తక్కువగా శిక్షలుండేవని తెలిపారు.

మొత్తానికి 15వ శతాబ్దం నాటి సామాజిక జీవితాన్ని పాటించే ధర్మ పరాయణతను, ఇది చిత్రిస్తుందని చెప్పుకోవచ్చు.

## కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక :

ఇది 12 ఆశ్వాసాల సరసోక్తి కథా కావ్యము. ఇది హరిహరనాథునికి అంకితమిచ్చాడు. భోజరాజు విక్రమార్కుని సింహాసనాన్ని అధిరోహించడానికి వచ్చినప్పుడు 32 సాలభంజికలు అతన్ని వారించి విక్రమార్కుని గుణకీర్తనలను చెప్పిన 32 కథలు ఇందులో వర్ణించబడినాయి. విక్రముని సాహసము, ఔదార్యం, ఉపకారం సత్య ధైర్యాలు త్యాగం, సామర్థ్యం అనే గుణాలకు చెందిన కథలున్నాయి. ఈ కావ్యంలో భర్తృహరికి రాజ్యం సంక్రమించినట్లు అతడు దుశ్శీలమైన భార్యచే విసిగి విరక్తి పొంది తపస్సు చేసుకోవడానికి వెళ్ళినట్లు కలదు. సంస్కృత భాషలోని

విక్రమార్కుని కథలే ఈ కావ్యానికి మూలమని కొందరు భావించారు.

మూలములో లేని అనేక విజ్ఞానదాయకమైన లౌకిక విషయాలను, ఇందులో వివరించారు. ఇది ప్రధానంగా రెడ్డిరాజుల కాలంనాడు సాంఘిక చరిత్రను తెలుసుకోవడానికి తోడ్పడే 'విజ్ఞాన కోశమువంటిదని తెలిపారు.

గోపరాజు తనకాలం నాటి శూద్రజాతులు కొలిచిన పలు దేవతాశక్తులు కామాక్షి, మహాకాళి, చండికి, కాళి, ఏకవీర, నక్కజియ్యకు మొదలగు వేల్పులకు మొక్కేవారని తెలిపారు.

ఈ కావ్యములో ఆటవిక జాతులవారు నరబలులను ఎలా ఇచ్చేవారో చక్కగా ఆవిష్కరించారు.

ఆనాటి ప్రజలలో శకునాలపై విశ్వాసమెక్కువగా ఉండేదని రాజకుమారుడు వేటకు వెళ్ళగా అతనికెదురైన శకున పరంపరలో చక్కగా వివరించారు.

"పిల్లులు పోరాడె, బల్లియూకర త్రెళ్ళె, తమ్మళి పొడసూపె, తుమ్మి రెదుర తొరగు, దూడను పోగొట్టుకున్నాఆవు, కంపపై వాలి అరచేకాకి, మైల చీరల చాకి, బట్టమేక, పాము మొదలైనవి దర్శనమిచ్చాయని ఇవన్నీ అశుభాన్ని కల్గించేవని అర్థం చేసుకోవచ్చు.

గోపరాజు తన కాలమున వాడుకలో ఉన్న పట్టు బట్టలలోని 40కి పైగా రకాలను తెలియచేశాడు. చందన కావులు, పట్టెడు కావులు, చెంగావులు, కదంబ, కరకంచులును, బొమ్మంచు, ముడుగు, ముయ్యంచులు, చిలుక వేటవాళ్ళు, వేట, నిండు, రుద్రాక్షగంటకి, పుప్పొడి వన్నెలలు మొదలైనవి.

ఈ కావ్యములో చేపలలోని రకాలను, మంత్ర తంత్రములను, పురుడు పోసే పద్ధతిని, పాముల రకాలను, స్వప్న ఫలములను, గ్రహకాంతులు, జూదము, చదరంగము, చోరళిలను, పద్దులు రాసే పద్ధతులను, ఇంద్రజాలవిద్యను, వితంతు ధర్మములను వివరించి గోపరాజు తన సర్వజ్ఞత్వమును ప్రకటించాడు.

## దూబగుంట నారాయణ కవి పంచతంత్ర కథలు :

జగత్ ప్రసిద్ధమైన పంచతంత్రాన్ని తెలుగులోనికి అనువదించాడు. ఇందులో మిత్రభేదం, మిత్రలాభం, సంధి, విగ్రహము, లబ్ధనాశము, అవిమృశ్య కారిత్వము అను ఐదు విభాగములున్నాయి. ఇందులోని పాత్రలన్నీ పశుపక్ష్యాదులు. పేను మొదలు సింహము వరకు అన్ని రాజనీతిలో ఆరితేరినవే. ఇవి చేయు నీతి ప్రసంగాలు గంభీరంగాను, ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి. మనుషుల మనస్తత్వాలకు,

కుటిలత్వానికి ప్రతీకలుగా కొన్ని పశుపక్ష్యాది పాత్రలను నిలిపి రచన చేసి మంచి సందేశాన్నిచ్చాయి. ఈ జంతు ప్రవర్తనల ద్వారా మనిషి జ్ఞానాన్ని పొంది యుక్తితో జీవించాలని, జీవిత రహస్యాలను, రాజనీతి విశేషములను, జంతుపాత్రలతోనే బోధించాడు.

## పాలవేకరి కదరీపతి 'శుకసప్తతి' :

ఈయన 1660 ప్రాంతానికి చెందిన కవి ఈయన మైసూరు రాజ్యంలోని (కోలార్ ప్రాంత) తెలుగు కవిగా అభిప్రాయపడుతున్నారు. ఇందులో చిలుక డెబ్బది రాత్రులలో వరుసగా 36 కథలను చెప్పిందనని ఇది స్వతంత్ర్య కావ్యమని, ఏకావ్యానికి అనుకరణ కాదని పండితులు చెపుతారు. ముఖ్యంగా స్త్రీల జీవితాన్ని, వారి మనస్తత్వాలను తెలుపుతుంది. ఇంద్రప్రస్థంలోని ధర్మరాజు దౌమ్యుడితో 'భామల చిత్తాన్ని తెలుసుకోవడం బ్రహ్మ తరం కూడా కాదని, కొంతమంది స్త్రీలు చేసే కామ ప్రయత్నాలు చాల విచిత్రంగా ఉంటాయని చెప్పారు. దానికి దౌమ్యుడు స్త్రీల మనసులు లోకాతీత దుర్వృత్తములనియు, వారు చేసే సాహస కార్యాలను ఎవరూ నివారించలేరని, దీనికి సంబంధించిన ఒక ఇతిహాసముందని, దానిని శివుడు పార్వతికి పరమ రహస్యంగా చెప్పాడని దానిని తాను చెప్తానని ప్రభావతి కథను చెప్పాడు.

చిత్రభానుడు, ప్రభావతి, మదనసేనుడి కథలో చిలుక ప్రభావతీ చెప్పిన నీతిలో భర్త పరదేశగతుడైనప్పుడు పరిచారిక పల్లవిమాటల వలన రాజైన చిత్రభానుడితో గడపాలని నిర్ణయించుకొని బయలుదేరిన సమయంలో వెళ్ళివస్తానని చిలుకతో పలికినపుడు చిలుక ప్రభావతితో ఈ విధంగా అంటుంది. "ఇది పాతివ్రత్య ధర్మం కాదని చెబుతూ, ప్రాణహానిని, మానహానిని కలిగించే పనిచేయవద్దని, సామమార్గంలో ఆమె ప్రయత్నాన్ని విరమింపజేయాలనుకొని, వరుసగా ఈ కథలను చెపుతుంది. ఇవన్నీ పరపురుష సంగమం పట్ల స్త్రీలను విముఖులుగా చేయటానికి ఉద్దేశించినవే.

తొందరపడి ఏ పనైనా చేస్తే అది అనేక ఆపదలను తెచ్చి పెడుతుందనే సత్యాన్ని చంద్రావతి కథ ద్వారా తెలియజేశాడు. ఇది భారవి వ్యక్తిగత జీవితంలో చెప్పిన కథను పోలి ఉంది.

కుటుంబంలోని భార్యాభర్తలు పరస్పర వంచనతో వారి సంబంధాలు ఎంత బోలుగా ఉన్నాయో 'శుభవతి' కథ తెలుపుతుంది.

జారిణులు, కాముక స్త్రీల మనస్తత్వాలను, ఆలోచనలను, వారి పన్నాగాలను

చిలుక వివిధ కథల ద్వారా తెలియజేసింది. కుటుంబ వ్యవస్థలో చాటుమాటుగా సంబంధాలను ఏర్పరచుకొంటూ స్వేచ్ఛావర్తనులై జీవించే స్త్రీలు అసత్యాలు, అపద్దాలు నేరుస్తారని తెలుపుతుంది.

మొత్తంగా ఇవన్నీ మానసికవ్యభిచారం చేసేవారికి ఇవి నీతిని బోధిస్తున్నాయని ఒక్కమాటలో చెప్పవచ్చు. కామాన్ని నియంత్రించుకోకపోతే భార్యాభర్తల మధ్య కుటుంబంలో, సంఘంలోను కలిగే అవమానం, అగౌరవాలను నష్టాలను ఇవి తెలియజేస్తున్నాయని చెప్పవచ్చు. ఇన్ని కథల ద్వారా స్త్రీలకే ఎందుకు నీతులను, మంచి వ్యక్తిత్వాన్ని శీల సంపదను కలిగి ఉండాలని చెప్పడంలోని ఉద్దేశం, ఇంటి మంచిచెడులు, కుటుంబ అభివృద్ధి, పరువు - ప్రతిష్టలు అన్నీ ఇంటి ఇలాలిపైనే ఆధారపడి ఉన్నాయని భావించి ఉండవచ్చని గ్రహించవచ్చు. దాంపత్యం ధర్మబద్ధంగా ఉండాలన్న కోరిక, ఈ వ్యవస్థ పదికాలాల పాటు నిలబడాలన్నా, సమాజం, నీతి, నియమాలతో కొనసాగాలన్నా, స్త్రీలు బాధ్యతగా ప్రవర్తించాల్సిన అవసరం ఎంతైనా ఉందని మొత్తంగా ఈ కావ్యం ద్వారా అర్థం చేసుకోవచ్చు.

## అయ్యలరాజ నారాయణామాత్యుడి హంసవింశతి :

నిషిద రాజైన నలుడు తన పురోహితుడైన ప్రత్యుత్పన్నముడి చేత మునుపటి రాజుల కథలు చెప్పించుకొని వింటూ స్త్రీల చిత్తవృత్తిని తెలుసుకోవటం బ్రహ్మకైనా సాధ్యంకాదని, వారి చిత్ర విచిత్రాలను చెప్పమని కోరడం, పురోహితుడు ఈ కథలు చెప్పడం మొదలవుతుంది.

పురోహితుని అవగాహన మేరకు మొండిపట్టు పట్టేవాళ్ళు, అబద్దాలాడేవాళ్ళు, అదిరించి బెదిరించేవాళ్ళు, మాయోపాయాలు చేసేవాళ్ళు పాపములకు ఒడిగట్టే ధూర్తులు మొదలగు వారి ప్రవర్తనలను తెలుసుకోవడం శంకరునికైనా సాధ్యం కాదు. కనుక స్త్రీల ప్రవర్తనను పురుషులు, స్త్రీలు ఇరువురూ కూడా రెండు కళ్ళతో కనిపెట్టి చూస్తూనే ఉంటారని, ఎవరి అదుపుకు లొంగని విశ్వంఖలత్వం స్త్రీల స్వభావమని పరోక్షంగా ఈ కథల ద్వారా చెప్పినట్లయ్యింది.

స్త్రీల అంగాంగ వర్ణన వివిధ కోణాలలో జరిగింది. ఏఏ లక్షణాలున్న స్త్రీలు ఉత్తములో, ఎవరు కాదో వారి ఆకారాల వల్ల చేష్టలవల్ల స్త్రీలను ఏ జాతికి / ఏ కోవకు చెందినవారో నిర్ధారించవచ్చని తెలిపారు.

ఇవేకాక తెలుగులో వెన్నెలకంటి అన్నయ్య, షోడశకుమార చరిత్ర, కూచిరాజు ఎర్రన సకలనీతి కథా విధానం మొదలగునవి ఇతర కథాకావ్యాలు కూడా ఉన్నాయి.

## విశిష్టత :

ఈ తెలుగులో కథాకావ్యాల ప్రయోజనం ఏమిటి? ఇవి ఏ మార్పును కోరుకున్నాయి అని పరిశీలిస్తే రచనా, ప్రక్రియా పరంగా ప్రధానంగా ఇవి ఈ కథాకావ్యాలలో ఒకే వస్తువు లేకపోయినా సామాజిక నీతిని, ధర్మాన్ని బోధించే లక్ష్యంతో వచ్చాయని తెలుస్తుంది.

వీటిలో శృంగారాన్ని ప్రధాన రసంగా చేసుకొని కథలు నడిపినా, నీతి - ధర్మ విషయాలను కథలుగా చేసి చెప్పటం వీటి ప్రధాన లక్ష్యమని తోస్తుంది.

మధ్య యుగంలోని సామాజిక, రాజకీయ, ఆర్థిక సంస్కృతిలో భోగలాలసత్వం పెరిగిపోయి విశృంఖలత ఏర్పడిన పరిస్థితులు నెలకొని ఉన్నప్పుడు ఈ రకమైన నీతికథలు అవసరమయ్యాయి. ఈ కథలు సామాజిక సంబంధాలను సరిచేసి నైతిక విలువలను నిలబెట్టడం ఈ కథా కావ్యాల ప్రధాన ఉద్దేశం. ప్రత్యేకంగా స్త్రీల లక్షణాలనే ఎందుకు చెప్పాల్సి వచ్చిందని పరిశీలిస్తే ఆనాటి సామాజిక వ్యవస్థ పితృస్వామ్య కుటుంబాలలో పురుషుడికి స్వేచ్ఛ, బాధ్యతా రాహిత్యాలు, విచ్చలవిడితనం, బహుభార్యత్వం, పలువురితో సంబంధాలు మొదలగునవి ఉండటం మూలాన స్త్రీలు కూడా ఎదురైన పరిస్థితుల దృష్ట్యా పురుషుల్లాగా మారితే సమాజం గాడి తప్పుతుంది. అలా తప్పకుండా కాపాడటం కోసం స్త్రీ తనకు తాను వ్యక్తిగతంగా మార్పుపొంది, సత్ప్రవర్తనను అలవరచుకోవాలని కాంక్షించినట్లు తెలుస్తుంది.

కుటుంబ, సమాజ కట్టుబాట్ల వలన, సాంఘిక ఆచారాల వలన, అత్తల పెత్తనం, భర్తల, శారీరక మానసిక బాధకు బాధ్యతారాహిత్యానికి అంతఃపుర నిబంధనలవల్ల స్త్రీలు విసిగి ఆడజన్మ పాపపు జన్మగా భావించి పురుష జన్మను కోరుకున్న స్థితి కనిపిస్తుంది.

మొత్తానికి కథా కావ్యాలు 13వ శతాబ్దంలో మొదలై 17వ శతాబ్దం మధ్య కాలం వరకు రావడానికి, కారణం ఆనాటి సామాజిక పరిస్థితులే ఈ ప్రక్రియను అనుసరించడానికి దోహదపడ్డాయని, పురాణ సాహిత్యం నుండి అనువాద రచనకు స్వస్తి చెప్పి సమకాలీన సమాజంలోని విషయాలను, సంస్కృతి, మత విశేషాలను, సందర్భానుసారంగా చిత్రించి, ఆనాటి తెలుగు సంస్కృతిని మనకందించారని అర్థం చేసుకోవచ్చు.

కొన్ని కథలలో అద్భుత ఘట్టాలు, వీరోచిత ప్రదర్శనలు, అతీతశక్తుల విద్యలు వర్ణించి ఉన్నప్పటికీ వాటిని మనుషులను కష్టాలనుండి బయట పడేయడానికి, సమాజహితానికి, వ్యక్తి శ్రేయస్సుకు ఉపయోగించాలే తప్ప తన స్వార్థానికి ఉపయోగించకూడదనే చక్కని సందేశన్నిచ్చాయి.

ఇవి సామాన్య మానవుల జీవన సరళిని చక్కదిద్దడానికి, జీవితంలోని ఒడిదుడుకులను ఎదుర్కోవడానికి, ధర్మబద్ధంగా జీవింపజేయడానికి ఇవి ఉపయోగపడతాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

## ఆధార గ్రంథాలు :-


1. ఆరుద్ర - సమగ్రాంధ్రసాహిత్య మొదటి సంపుటం, తెలుగు అకాడమి, హైదరాబాదు, 2005
2. డా. కనకదుర్గ జంధ్యాల - తెలుగు స్వతంత్ర కథా కావ్యాలు స్త్రీ జనజీవన చిత్రణ, కాకతీయ విశ్వవిద్యాలయం, పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ హైదరాబాదు, 1995
3. జి. నాగయ్య - తెలుగు సాహిత్య సమీక్ష మొదటి సంపుటం
4. నారాయణం శేషబాబు - ప్రాచీనాంధ్ర కథాకావ్యాలు నీతిబోధ, తెలుగు అకాడమి, హైదరాబాద్, 2012
5. రామకృష్ణారెడ్డి పాకాల - విక్రమార్క చరిత్రలో ప్రతిఫలించిన జనజీవనం (పి.హెచ్.డి సిద్ధాంత వ్యాసం) ఎస్వీయు, సెప్టెంబర్ 1995
6. సాంబశివారెడ్డి నందనూరు - సింహాసన ద్వా త్రింశక సవిమర్శక పరిశీలనము, (పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం) ఎస్వీయు, ఆగష్టు, 1986
7. విశ్వనాథం. పి భోజరాజీయం సమకాలీన జవనీవనం, (పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం) ఎస్వీయు, మే, 2004




అరే.. ఈ కొండలు అరవ్వేం
ఈ రాత్రుల కపాలాలు పగలవేం
ఈ నక్షత్రాలు చచ్చి నేలకు రాలవేం
ఈ గుంపు వినరే నా మాట
నా దేశంలో నా గొంతు
పరాయిదయిపోయింది...

- శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ

# జానపదుల ఆటలు - ప్రయోజనాలు



డా. కూన వెంకట రామకృష్ణ
✆ 70934 42138

జానపదుల జీవనంలో ఆటలు అంతర్భాగంగా ఉన్నాయి. జానపద ఆటలు ఆటగాళ్ళ శారీరక, మానసిక పరిపక్వతకు తోడ్పడతాయి. సంస్కృతి సంప్రదాయాలకు ప్రతిబింబంగా కూడా ఉంటాయి. వివిధ ఆటల్లోని నమ్మకాలు వారి ఆత్మవిశ్వాసాన్ని పెంచి గెలుపుకు బాటలు వేస్తాయి.

*ఉదా: మూడు ఆటలు వివరించి ఆటలు ప్రయోజనాలు వివరిస్తాను.*

## 1. వైకుంఠపాళి :

వైకుంఠపాళి పటంపై పాములు, నిచ్చెనలు, కోతి, ఆవు, పంది వివిధ బొమ్మలు ఒకటవ స్థానం నుండి నూట ఎనిమిదవ స్థానం వరకు ఉంటాయి. ఈ పటంను పరమపద సోపానం అని కూడా అంటారు. ఈ పటం సహాయంతో ఆడే ఆటను 'వైకుంఠపాళి' అంటారు.

**ఆడే విధానం :** ఈ ఆటను ఆడ, మగ అనే భేదము లేకుండా పిల్లలు పెద్దలు కలిసి ఆడుతారు. ఆటగాళ్ళు ఇద్దరికి తక్కువగాకుండా సరిసంఖ్యలో ఉండి ఆడుతారు.

వైకుంఠపాళి పటం మీద ఆటగాళ్ళు ఎవరికాయను వారు పెట్టుకుంటారు. అరగదీసిన చింతగింజలు తీసుకుని పందెము ఒకరి తరువాత ఒకరు ఎడమ నుండి కుడికి వరుసగా వేస్తారు. పడిన పందెము (పంజాను) ప్రకారము తమ కాయను గడుల వారిగా నడుపుతారు. అనగా చెమ్మాలు వేసినపుడు, నాలుగు తెల్లగా పడి ఒకటి నల్లగా పడితే నాలుగు గడులు జరపాలి. నాలుగు నల్లగా పడి

ఒకటి తెల్లగా పడితే ఒక గడి (డబ్బా) జరపాలి. మూడు నల్లగా పడి రెండు తెల్లగా పడితే రెండు గడులు జరపాలి. అలాగే రెండు నల్లగా పడి మూడు తెల్లగా పడితే మూడు గడులు జరపాలి. పందెం వేసినపుడు అన్ని నల్లగా లేదా తెల్లగా పడితే 'అష్ట' అంటారు. అప్పుడు ఎనిమిది గడులు జరపాలి.

వైకుంఠపాళి పటం మీద వివిధ బొమ్మలతో పాములు, నిచ్చెనలు ఉంటాయి. పందెం వేసి కాయను జరిపిన స్థలంలో నిచ్చెన ఉంటే నిచ్చెన పైకి కొన గడివరకు కాయను జరుపుతారు. లేదా పాముతల ఉంటే పాము తోక వరకు కిందికి జరుపుతారు. పందెము వేస్తూ ఒకటవ స్థానం నుండి నూట ఎనిమిదవ స్థానం వరకు చేరాలి. ఈ ప్రయాణంలో అనేక ఆటంకాలు పాములు కల్గిస్తాయి. నిచ్చెన్లు ఎక్కుతూ వెళ్ళిన వారు ముందుగా చేరుతారు. ఎవరు ముందుగా చేరితే వారు పరమపదం లేదా స్వర్గం చేసినట్లు భావిస్తారు. మిగిలిన ఆటగాళ్ళు వారి ఆటను కొనసాగిస్తారు. చివరికి ఉన్నవాడు దొంగ ఆటగాళ్ళకు ఆడాలనే ఇష్టము ఉంటే ఆటపూర్తి అయిన తరువాత మరలా ఆడుతారు.

## ఆట నిబంధనలు :

1. పందెం ప్రకారం నంబర్ల ఆధారంతో కాయను జరపాలి.

*ఉదా: రెండు తెల్లగా పడితే రెండు గదులు జరపాలి.*

2. జరిపిన స్థలంలో నిచ్చెన ఉంటే పైకి ఎక్కించాలి.
3. జరిపిన స్థలంలో పాముతల ఉంటే తోకవరకు కిందకు కాయను దించాలి.
4. చెమ్మా లేదా అష్టపడితే తిరిగి పందెం వేయాలి.
5. నూట ఎనిమిదవ స్థానం మొదట చేరినవారు స్వర్గం చేరినట్లు, స్వర్గం చేరినవారు పాములకు దేవుళ్ళకు మొక్కి వెళ్ళాలి.
6. ఈ ఆటలో బుడ్డీసు ఉంటుంది. మూడు అష్టాలు గాని లేదా మూడు చెమ్మలు గాని వరుసగా పడితే బుడ్డీసు.
7. మత్తుపానీయం సేవించినవారు ఆడరాదు.

**నమ్మకాలు :**

1. పుణ్యాత్ములు త్వరగా స్వర్గానికి పోతారు.
2. పాపం చేసినవారిని/ అబద్ధాలాడిన వారిని పాములు మింగుతాయి.
3. రాత్రివేళ గవ్వలు చప్పుడైతే మంచిది కాదు. అంటే లక్ష్మీ పోతుంది అని నమ్ముతారు.

**ప్రయోజనాలు :** ఈ ఆట మానవ జీవితానికి వర్తించేదిగా ఉంది. ఆట ద్వారా పిలల్లు కొంత సత్ ప్రవర్తన వైపు మల్లుతారు. మత్తుపానీయం సేవించరాదు అనే సందేశము ఉంది. ఆట ఆడడం ద్వారా మానసిక ఆనందము పొందుతారు. ఆటగాళ్ళు కలిసి ఆడడం ద్వారా వీరిమధ్య మంచి స్నేహం ఏర్పడుతుంది. ఈ ఆట ఆంధ్ర, తెలంగాణ అంతట ఉన్నా ప్రాంతాల వారిగా చిన్న చిన్న బేదాలు కనిపిస్తున్నాయి.

**ఉదా :** శ్రీకాకుళం ప్రాంతమువారు అయిదు గవ్వలు ఉపయోగిస్తే, వరంగల్లు ప్రాంతములో నాలుగు గవ్వలు ఉపయోగించడం ఉంది. మూడు అష్టాలు గాని లేదా మూడు చెమ్మాలు వరుసగా పడితే బుడ్డీసు అని వరంగల్లు ప్రాంతములో అంటే తూర్పుగోదావరి జిల్లాల్లో ముక్కచెక్కలు అంటారు.

## 2. కప్పతల్లి ఆట :

ఆటగాళ్ళు రోకలి బండను తీసుకవచ్చి వాటికి కప్పను గుడ్డలో పెట్టి కడతారు. రోకలిని ఇద్దరు మోస్తూండగా ఒకరు తాంబూలం పట్టుకొని నడుస్తూ వారి వెంట కొందరు ఉండి గ్రామం మొత్తం తిప్పుతూ పాటలు పాడుతారు. వీటినే కప్పతల్లి ఆట అంటారు. ఈ ఆటను బాల బాలికలు కలసి ఆడుతారు. వర్షాలు పడాలని ఆడుతారు.

**పాట :**

*కప్పతల్లి కప్పతల్లి కావేడి నీళ్ళు*
*కావేడి నీళ్ళకు కడవ నిండుతాది*
*దోమతల్లి, దోమతల్లి, దొడ్డెడు నీళ్ళు*
*దొడ్డెడు నీళ్ళకి డొప్ప నిండుతాది*
*ఈగతల్లి, ఈగతల్లి ఇల్లుడే నీళ్ళు*
*ఇల్లుడే నీళ్ళకు ఇండ్లు నిండుతాయి.*

వానదేవుడా! మాకప్ప దేవుడా వానలు కురిపించు అంటు పాటలు పాడుతూ ప్రతి ఇంటికి వెళ్తారు. ఇండ్ల ముందు రాగానే ఆ ఇంటివాళ్ళు పసుపు నీళ్ళను రోకలికి కట్టిన కప్పపైన పోస్తారు. ఈ విధంగా ఆటగాళ్ళు అంతా వానదేవుడా వర్షాలు కురవాలి, వానదేవుడా వర్షాలు కురవాలి అని ఎగురుకుంటూ ఇళ్ళకు వెళ్తూ గ్రామం మొత్తం తిరుగుతారు. ప్రతి ఇంటివారు తాంబూలంతో బియ్యం వేస్తారు. గ్రామం మొత్తం మీద వచ్చిన బియ్యాన్ని ఆటగాళ్ళు చెరువుకట్టమీద మైసమ్మ దగ్గర పాలు పొంగించి పాయసం వండుతారు. వాటిని వానదేవునికి మైసమ్మకు నైవేధ్యంగా పెట్టి కప్పను చెరువులోకి వదులుతారు.

**ప్రయోజనం :** ఇటువంటి అనుష్ఠాన పరమైన ఆటలు తూర్పుగోదావరిలో అట్లతద్ది, నాగులచవితి వంటి పండుగ పేర్లతో ఉన్న ఆటలున్నాయి. ఈ ఆటలు ఆడుట వలన పండగ చేసిన ఫలితము వస్తుందని నమ్మకం. ఆటల్లో ఉన్న పాటలు పాడడము ద్వారా మానసిక ఆనందము మరియు పాటలు పాడే అలవాటు అబ్బుతుంది. ఈ ఆటలు ద్వారా అంతర్గతంగా ఉన్న కౌశలాలు వృద్ధి చెందును.

**నమ్మకం :** ఈ విధమైన అనుష్ఠాన పరమైన ఆటలు ద్వారా వర్షము పడుతుందని నమ్ముతున్నారు.

### ౩. సీతారాముడాట :

సీతారాముల పేర్లతో చీటిలు వేసి ఆడటం చేత ఈ ఆటకు సీతారాముడాట అని పేరు వచ్చింది. ఈ ఆటను శ్రీకాకుళం జిల్లాలో చీటిలాట అని కూడా అందురు. ఈ ఆటను ఆడ, మగ పిల్లలు కలిసి లేదా వేరువేరుగా ఇంటిలో లేదా ఇంటి ఆవరణములో ఆడుకుంటారు. ఆటగాళ్ళు అయిదుగురు ఉంటారు. ఒక కాగితం తీసుకుని వాటిని అయిదు సమాన చీటీలుగా చించి వాటిలో రాముడు వెయ్యి, భరతుడు తొమ్మిది వందలు. లక్ష్మణుడు ఏడువందలు, ఆంజనేయుడు ఎనిమిదివందలు, సీత సున్న అని నిర్ణయించి రాస్తారు. అయిదు చీటీలను చిన్నగా ఉండేలా గుండ్రంగా మలుస్తారు. అయిదుగురు ఆటగాళ్ళు వృత్తాకారంగా కూర్చుంటారు. అందులో ఒకరు చీటీలను నేలమీద వేస్తారు. తలా ఒక చీటిని తీసుకుంటారు. అందులో రాముడెవరో చెప్పమని ఒకరు అడుగుతారు. రాముడు చీటి వచ్చినవాడు, సీతను కనుక్కోవాలి. అప్పుడు అతనికి 1000మార్కులు, లేదా కనుక్కోలేని పక్షములో సున్నామార్కులు వస్తాయి. సీత చీటి తీసినవారికి

వెయ్యి మార్కులు వెళ్తాయి. అయిదుగురి పేర్లు ఒక కాగితంపై వ్రాసి వారికి వచ్చిన మార్కులు వారివారి పేరులు కింద వేస్తారు. కాగితము నిండిన తరువాత వారివారి మొత్తాన్ని వేస్తారు. తక్కువమార్కులు వచ్చినవారిని దొంగగా నిర్ణయించు పద్ధతి శ్రీకాకుళం జిల్లాలో ఉండగా, తూర్పుగోదావరి జిల్లాల్లో ఈ ఆటలో ఎక్కువ మార్కులు వచ్చేవారు రాజు అని, రెండవ స్థానం రాణి, మూడవ స్థానం వచ్చినవారు మంత్రి, నాల్గవ స్థానం వచ్చిన వారు భటుడు చివరికి తక్కువమార్కులు వచ్చినవారికి కుక్క అని ఎగతాళి చేస్తారు. ఈ విధంగా ఆట ముగుస్తుంది.

**ప్రయోజనం :** ఈ ఆట మన సంస్కృతికి మూలాధారము అయిన రామాయణకథను గుర్తుచేస్తుంది. ఆటలో రామాయణములో గల అయిదు ప్రధాన పాత్రలు రాముడు, సీత, భరతుడు, లక్ష్మణుడు, ఆంజనేయుడు పేర్లు చీటీలపై వ్రాసి వాటి మార్కులు ద్వారా గెలుపు నిర్ణయిస్తారు. ఆటలో రాముడు చీటి అతను సీత చీటి వచ్చిన వారిని కనుక్కోవాలి. రామాయణంలో రాముడు కూడా అరణ్యాలు తిరిగి తిరిగి ఆంజనేయుని సహాయంతో లంకలో ఉన్న సీతను కనుక్కుంటాడు. రామాయణ కథా సారాంశము ఈ ఆట వలన గుర్తుకొస్తుంది. ఈ ఆట వలన పిల్లలు మధ్య స్నేహం ఏర్పడటము, ఎదుటవారిని గుర్తించటము అన్నది మానసికమైన పరీక్ష కావున మానసిక సమర్థత బలపడుతుంది.

### విషయదాతలు :

1. బాడాన సావిత్రమ్మ (49) గోరింట్ గ్రామం) శ్రీకాకుళం జిల్లా.
2. బి. అమృత లక్ష్మి (68) శాంతినగర్, హన్మకొండ, వరంగల్లు జిల్లా

### ఉపయుక్త గ్రంథాలు :


1. డుం.....డుం....ఆటలు - సిహెచ్. శ్రీనివాస్ జె.పి పబ్లికేషన్స్, గాంధీనగర్, విజయవాడ - 2002
2. జానపద విజ్ఞాన వ్యాసాలు - నేదునూరి గంగాధరం, (పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం - 2003)
3. తూర్పుగోదావరి జిల్లా జానపద ఆటలు - ఆచార్య యన్. భక్తవత్సల రెడ్డి మరియు (పరిశోధకులు) జానపద గిరిజన విజ్ఞానపీఠం, పి.యస్. తెలుగు విశ్వవిద్యాలయం, వరంగల్లు 2004

# ఉత్తరాంధ్ర జానపద కళారూపాలు-నేటి స్థితి



డా. శ్రీ పురుషోత్తం గణపతిరావు
94904 97566

ఆంధ్రుల సాంఘీక చరిత్ర రెండువేల సంవత్సరాల కన్నా ముందటిది. నిజానికి ఆంధ్రుల ప్రస్తావన వేదకాలము నాటిది. శాస్త్రీయ కళలు రాకపూర్వము నుండి జానపద కళారూపాలు వర్ధిల్లాయి. జానపద కళారూపాలు గురించి పురాణ, ఐతిహసములలో పేర్కొనబడినవి. తరువాత కాలంలో శాస్త్రీయ కళలతో సమానంగా రాజులచే ఆదరింపబడినవి. శతాబ్దాలుగా రాజులు, రాజ్యాలు పోయిన జానపద కళలు ప్రజా హృదయాలలో నిలిచిపోయాయి.

జానపద కళాకారులు తమ కళారూపాలను తమ కన్నబిడ్డలుగా చూసుకొంటున్నారు. ప్రజాదరణ తగ్గిన కళాకారులు తమ కళలను నమ్ముకొని పరిమిత ప్రదర్శనలతో తమ సంస్కృతిని తమ వారసత్వపు సంపదను కాపాడుకొంటూ భావితరాలకు అందజేస్తున్నారు. అటువంటి జానపద కళారూపాలలో ఉత్తరాంధ్ర కళారూపాలు ప్రముఖమైనవి.

ఈ జానపద కళారూపాలు జాతీయ ఉద్యమాలకు, శ్రీకాకుళం రైతాంగ పోరాటానికి పునాదులైనాయి. ఉత్తరాంధ్ర కళారూపాలు ఉద్యమ స్ఫూర్తిని ప్రజలలో నివురుగప్పున నిప్పులా వున్న విప్లవ చైతన్యాన్ని రగిలించాయి. గొల్ల సుద్దులు రెండవ ప్రపంచ యుద్ధములో ఫాసిష్టులు యుద్ధ దాహాన్ని వివరించాయి. పడవ పాటలు దేశ సమైక్యతను వివరించే పాటలైనాయి. సోది జాతీయ సమస్యలను ఏకరువు పెట్టాయి. బుర్రకథలు, జముకుల కథలు, సాంఘీక సమస్యలను ప్రపంచం ముందుంచాయి. కళారూపాలుగా ప్రదర్శింపబడ్డాయి. సాంఘీక చైతన్యానికి నాందీ వాచకమైయాయి. అటువంటి ఉత్తరాంధ్ర కళారూపాలు ఈ రోజున హారతి కర్పూరంలా కరిగి కాలగర్భంలో కలసిపోతున్నాయి. నేదునూరి గంగాధరమ్ గారు అన్నట్లు "ఆంధ్రజాతి ప్రాచీనత, సంస్కృతి, భాష, ప్రాంతీయ వైభవము మన

జానపద వాఙ్మయంలో కనిపిస్తుంది. సామెతలు, మాండలికాలు, జాతీయాలు మొదలగువాటి ద్వారా మానవ జాతి సంప్రదాయ జీవనము తెలియవస్తున్నవి. అటువంటి జానపద కళారూపాలు కాలగర్భంలో కలిసిపోతున్నాయి.

వంగపండు ప్రసాదరావు అన్నట్లు

*"అమ్మతల్లులు*
*డప్పులు గెంతులు*
*హరిదాసులు*
*మద్దిలి - వంతులు*
*తాళం - పాటలు*
*తప్పడిగుళ్ళు*
*ఎటుపోయెనమ్మో*
*మన జానపదుల కళలు*
*ఏమైపోయేవో*
*మన జనం కన్న కలలు"*

> ఉత్తరాంధ్ర నుండి కనుమరుగైన ప్రధాన జానపద కళారూపాలలో ప్రముఖమైనది తోలుబొమ్మలాట.

ఇటువంటి మాటలు, పాటలు విన్నప్పుడు ఎంతో జనాదరణ పొందిన ఈ జానపద కళారూపాలు ఈనాడు ఎందుకు కనుమరుగైపోయాయి?

మన సంస్కృతిలో భాగం, మన జీవనవేదమైన జానపద కళారూపాలను కాపాడుకోలేమా? ఒకనాడు ఎంతో వైభవాన్ని పొంది, ఈనాడు కనుమరుగైపోతున్న ఈ జానపద కళారూపాలను మరోమారు స్మరించవలసిన అవసరం వుంది.

ఉత్తరాంధ్ర నుండి కనుమరుగైన ప్రధాన జానపద కళారూపాలలో ప్రముఖమైనది తోలుబొమ్మలాట. ఈ కళారూపం మహారాష్ట్రలో పుట్టి ఆంధ్రదేశమున బహుళ ప్రచారం పొందింది. ఇక్కడ నుండి ఖండ ఖండాంతరాలకు వ్యాపించి ఎంతో ఆదరణ పొందింది. ప్రజాదరణ పొందిన ఈ కళారూపము సినిమాలు రాకముందు ప్రజలను రంజింపజేసి భారత దేశంలోనే గాక ఇతర దేశాలకు వ్యాపించి పేరుపొందింది. ఇటువంటి కళారూపము ఈనాడు నామమాత్రపు ప్రదర్శనలుగా పాఠశాలలో, టి.వి మాధ్యములలో ప్రదర్శింపబడుతున్నాయి. శ్రీకాకుళం జిల్లాకు పరిమితమైన మరో జానపద కళారూపము రుంజు వాయిద్యం. ఈ జానపద వాయిద్యం శ్రీకాకుళం జిల్లాలోని

> ఈనాటికి ఈ కళాకారులు శ్రీకాకుళం, విజయనగరం, జిలా పరిసర ప్రాంతములలో జీవిస్తూ తమ కళను జీవింపజేస్తున్నారు.

అంపోలు, మామిడివలస, అడవరం మొదలైన గ్రామాలలో మాత్రమే కనిపిస్తుంది. ఈ కళారూపము విశ్వబ్రాహ్మణ కులాన్ని ఆశ్రయించి కథాగానం చేస్తూ జీవించేవారు. వీరు విశ్వబ్రాహ్మణుల మరో గమనాన్ని, పంచ బ్రాహ్మల జన్మ ప్రకారాలను వివరించేవారు. ఈ రుంజులు విశ్వకర్మ పుట్టుక, పంచబ్రహ్మల పుట్టుక, దక్ష యజ్ఞం, పార్వతీ కళ్యాణం, రుంజుల పుట్టుక, వీర బ్రహ్మంగారి చరిత్ర చెప్పేవారు. విశ్వబ్రాహ్మణులచే ఆదరింపబడి ప్రసారం గావింపబడిన ఈ కళారూపం ఈనాడు ఆదరణకు నోచుకోక ఈ కళాకారులు ఇతర వృత్తులకు అలవాటు పడుతున్నారు. నాటి స్థానిక జమీందారులచే పోషింపబడిన ఈ కళారూపము ఈనాడు ఎవరు నేర్చుకోవడం లేదు. మరో రెండు తరాలు వచ్చేనాటికి ఈ కళారూపం పూర్తిగా కనుమరుగైపోతుంది. అంతరించిపోయే దశకు చేరుకొన్న మరో కళారూపం బోనేల పాట దీనినే బుడబుక్కల పాట లేద జముకుల పాట అని కూడా పిలుస్తుంటారు. గతంలో ఉత్తరాంధ్రలో అతి ప్రాచుర్యం పొందిన కళారూపము ఎన్నో జానపద గేయాలకు, పాటలకు బాణీలందించిన వాయిద్యం, ప్రాచీన కళారూపం. ఈ కళాకారులు జముకను చంకకు తగిలించి వాయిద్యం మధ్యలో అమర్చిన నరమును లయబద్దంగా మీటుతూ వాయిద్యం పుట్టుక గురించి, యల్లమ్మ కథను స్థానిక అమ్మవార్ల కథలను, కాటమరాజు కథలను, శృంగార, కరుణ, అద్భుత రసాలలో చక్కని బాణీలను కట్టి, చేతిమువ్వలు తాళమునకు అనుగుణంగా కథను పాడుతారు. రామాయణ, భారత కథలను అలవోకగా పాడుతూ జానపదుల హృదయాలను రస రంజితంగా చేసిన చేయి తగిలిన కళాకారులు.

ఈనాటికి ఈ కళాకారులు శ్రీకాకుళం, విజయనగరం, జిలా పరిసర ప్రాంతములలో జీవిస్తూ తమ కళను జీవింపజేస్తున్నారు. శ్రీకాకుళం రైతాంగ పోరాటంతో ప్రధాన భూమికను పోషించిన ఎన్నో విప్లవ గేయాలకు బాణీలు అందించిన కళారూపము. ఈనాడు ఈ కళాకారులు యాచక వృత్తిని అవలంబిస్తూ

పొట్ట పోషించుకుంటున్నారు.

ఉత్తరాంధ్రలో క్షీణ స్థితిలో వున్న మరో కళారూపం బాగోతులాట. దీనినే తూర్పు భాగవతం అని కూడా పిలుస్తారు. ఈనాడు ఈ కళారూపము సినీకరణం పొంది స్థానిక ఉత్సవములలో ప్రదర్శింపబడుతున్నది.

గతకాలంలో భాగవత సంబంధ కథలను పద్య, గద్య, దరువులు, ద్విపదలు, రాగ తాళయుక్తంగా నవరస యుక్తంగా అభినయించిన దృశ్యరూపకం. ఈ కళారూపంలో ప్రధాన కథకుడు, మాటగాడు, హాస్యగాడు వీరు ముగ్గురు కలిసి ప్రదర్శింపబడే కళారూపం. ఎక్కువగా ఈ కళాకారులు భాగవత కథలు, మల్లమ్మ కథలు, కాటమరాజు కథలు, స్థానిక అమ్మవార్ల కథలను పాటగట్టి పాడుతారు. ఈ కళారూపానికి లిఖితసాహిత్యం ఆధారం. ఈనాడు వినాయక చవితి, దసరా స్థానిక అమ్మవార్ల ఉత్సవములతో ఈ కళారూపాన్ని ప్రదర్శిస్తున్నారు. ఈనాడు ప్రదర్శనలో జనాకర్షణ కొరకు అశ్లీల పదాలను, ద్వంద్వార్ధ ప్రయోగాలను సినీగీతాల బాణీలను ప్రదర్శిస్తున్నారు.

ఎంతో వైభవోపేతంగా వర్ధిల్లిన ఈ కళారూపం రైతాంగ పోరాటంలో ప్రధాన భూమికను పోషించిన కళాకారులు ఈనాడు భుక్తి కొరకు, మనుగడ కొరకు తన అస్థిత్వాన్ని కోల్పోతు రూపాంతరం చెంది తమ మనుగడ కొనసాగిస్తున్నారు.

గ్రామదేవత, స్థానిక ఉత్సవాలలో వీర, భయానక, శాంత, భక్తియుక్తమైన రూపములతో జానపదుల హృదయాలలో ప్రముఖ స్థానం, నిలబెట్టుకున్న మరో కళారూపం పగటి వేషాలు. ఈ పగటి వేషాల్లో వివిధ దేవతా మూర్తులను, జంతురూపాలను, విభిన్న వేషదారణలలోను ఉత్సవం నడుమ తిరుగుతూ నృత్యము చేస్తూ ఉత్సవాలకు ఉత్సాహాన్ని కలిగించే కళారూపము. డప్పులు, తాళాలు శబ్దాలు నడుమ ఘనకాలతో వేపమండలతో, మెరుపుల ఆభరణాలతో, రంగు రంగు దుస్తులతో వేషధారణకు అనుగుణంగా పద్యాలను నృత్యాలను ప్రదర్శిస్తూ వాళ్ళు వేషాలగాను, బుట్టబొమ్మ వేషాలగాను భక్తుల నడుమ నేలపై నడుస్తూ తమ విభిన్న రూపాలతో అలరించే కళారూపం.

ఈ పగటి వేషాలలో బద్రకాళీ వేషము

ఉత్తరాంధ్రలో క్షీణ స్థితిలో వున్న మరో కళారూపం బాగోతులాట. దీనినే తూర్పు భాగవతం అని కూడా పిలుస్తారు.

> ఉత్తరాంధ్రలో వందకుపైగా కళారూపాలు ఉన్నప్పటికి కొన్ని కళారూపాలు నామమాత్రంగా మనుగడ సాగిస్తున్నాయి.

ప్రముఖమైనది. దీనిని ప్రదర్శించేవారు ముందురోజు నుండి ఉపవాసం వుండి చేతిలో నిమ్మకాయలు, మెడలో నిమ్మకాయల దండ మరో చేతిలో వేపమండలుతో పూనకం పూని వీరరస, భయానక రసయుక్తంగా నడుస్తూ వర్తమాన, భవిష్యత్తు కాలాల గురించి మాట్లాడుతూ భక్తులచే పూజింపబడే కళారూపం.

కళాకారులు ఆయా వేషాల పేర్లను ఇంటిపేర్లుగా మార్చుకున్న కళారూపం ఈ పగటి వేషాలు. ఈ పగటివేషాలలో కోయ వేషం ఒక భాగమే. ఈ కళాకారులు అటవిక జాతులవారి వేషధారణను ధరించి అడవుల్లో జంతువులను వేటాడుతున్నట్లు, కౄర మృగాలతో పోరాడుతున్నట్లు నృత్యము చేస్తుంటారు. ఈనాడు ఇటువంటి పగటివేషాలు అంతరించిపోయాయి. ఈ జానపద కళారూప ప్రదర్శనలకు బదులు ఆధునిక పోకడలకు జనాదరణ హెచ్చి గౌరవప్రదమైన స్థానమున నిలిచిన ఈ కళారూపాలు కనుమరుగైపోతున్నాయి.

ఉత్తరాంధ్రలో వందకుపైగా కళారూపాలు ఉన్నప్పటికి కొన్ని కళారూపాలు నామమాత్రంగా మనుగడ సాగిస్తున్నాయి. మరికొన్ని కళారూపాలు ఆధునికరింపబడి ప్రదర్శింపబడుచున్నాయి. అటువంటి కళారూపాలలో మొదటి స్థానం తప్పిటగుళ్ళు. ఈ కళారూపం ఈనాటికి తన అస్థిత్వాన్ని కొనసాగిస్తూ జాతీయ, అంతర్జాతీయ వేదికలపై ప్రదర్శనలు ఇవ్వగలుగుచున్నది. అయినప్పటికి తగునటువంటి ప్రోత్సాహాన్ని, గుర్తింపును పొందలేకపోతున్నది. ఇటువంటి కళారూపాలే కోలాట, భజనలు, సాము గారడీలు మొదలైనవి. ఈ కళారూపాలన్ని దేశసంస్కృతిని అద్దంపడుతు తమ అస్థిత్వాన్ని కొనసాగిస్తున్నాయి.

ఏ దేశమైనా, ఏ ప్రజలైనా తమ గతాన్ని, తమ ఆచార వ్యవహారాలను విస్మరిస్తాయో, ఆ దేశస్థులు ఎంత అభివృద్ధి చెందిన తమ ఉనికిని కోల్పోతాయి. తమ సంస్కృతికి పునాదులైన ఉన్నటువంటి జానపద సాహిత్యాన్ని, కళారూపాలని అభివృద్ధిపరచి భావితరాలకు అందజేయవలసిన అవసరం వుంది. జాతి ఐక్యతకు తలమానికమైన ఈ జానపద కళారూపాలను, వారసత్వపు సంపదను కాపాడుకోవలసిన అవసరం ఉంది.

# తెలుగు పద్యామృతం



N Ch. చక్రవర్తి
✆ 9491420180

అష్టదిగ్గజాలలో ఒకరైన భట్టుమూర్తి అనే నామాంతరం కల రామరాజభూషణుడు వసుచరిత్ర కారుడు. ఇదొక అద్భుత ప్రబంధం.

తెలుగులో ఉన్న పంచమహాప్రబంధాల్లో ఒకటి

ఇది మనుచరిత్ర తరువాత అదే మార్గంలో వచ్చిన ప్రబంధం. పెద్దనతో కొంత విభేదం ఉండి, తాను మనుచరిత్ర కంటే గొప్ప కావ్యం వ్రాయాలని వసుచరిత్ర వ్రాసాడని కొందరంటారు. ఏది ఏమైనా అలంకారయుతమైన శ్లేషశోభిత అద్భుతకల్పనాకమైన గొప్ప ప్రబంధాన్ని సృజించాడు భట్టుమూర్తి. ఈయనయే

**కావ్యాలంకార సంగ్రహ కర్త.**

వసుచరిత్ర(1) లోని ఒకపద్యాన్ని పరిశీలిద్దాం.

*శా. నానాసూనవితాన వాసనల నానందించు సారంగ మే*
*లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకందపంబంది యో*
*షానాసాకృతి దాల్చి సర్వసుమనస్సౌరభ్య సంవాసియై*
*పూనెంబ్రేక్షణమాలికా మధుకరీ పుంజంబులిర్వంకలన్*

తెలుగు సాహిత్యంలో ఇదొక గొప్ప పద్యం. పేరెన్నికగన్న పద్యం.తుమ్మెద చాలా పూలమీద వ్రాలి మకరందం త్రాగుతుంది. కానీ సంపెంగజోలికి పోదు. ఇది సాధారణ విషయం. ఇందుకై సంపెంగ చింతించి తపస్సు చేసిందట.ఆ తపస్సు ఫలితంగా నాయిక ముక్కుగా అవతరించింది. ఆ విధంగా నాయిక నేత్రాలనే(కంటి చూపులు అనే) రెండు తుమ్మెదలు తనను ఎప్పుడూ వదిలిపెట్టకుండా ఉండేటట్లు చూసుకుంది అని.

నానాసూన వితానవాసనల నానందించు సారంగము=అనేకానేక పూవుల సువాసనలు ఆఘ్రాణించే తుమ్మెద,

ఏలా నన్ను ఒల్లదు అటంచున్ = నన్ను ఎందుకు లెక్కచెయ్యదు అనుకొని, గంధఫలి = సంపెంగ, బల్ కాకన్ తపంబంది = మిక్కిలి పట్టుదలతో తపస్సు చేసి, సర్వసుమనః సౌరభ్య సంవాసియై = అనేక పుష్పాల సువాసనలు తనలో నింపుకొని, యెషానాసాకృతి దాల్చి = స్త్రీ (నాయిక) ముక్కు రూపాన్ని ధరించి, ప్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబులన్ ఇర్వంకలన్ పూనెన్ = తనకు రెండువైపులా (ఆ ప్రక్క, ఈ ప్రక్క) చూపులు అనే తుమ్మెదల వరుసలను ధరించింది.

అని. ఇక్కడ కవి చెప్పదలచిన విషయం ఏమంటే ఆ నాయిక ముక్కు సంపెంగలా ఉంటుంది. నాయిక చూపులు తుమ్మెదలు అని. దీనికి ఎంత మనోహరమైన కల్పన. ఊహ. అలంకారయుత వర్ణన. తుమ్మెదనూ తేటినీ అభేదంగా చెప్పడం మన కావ్యాలలో ఉంది. ఈ పద్యం ముక్కుతిమ్మన వ్రాసాడనీ ఆ పద్యాన్ని భట్టుమూర్తి వినియోగించుకున్నాడనీ ఒక మాట ఉంది. కానీ అపారమైన ప్రతిభా వ్యుత్పత్తీ కల్పనావైదుష్యం ఉన్న భట్టుమూర్తి కి ఆ అవసరం ఉండదు అనడంలో విప్రతిపత్తి లేదు.

ఆధునిక నవతరపు కవయిత్రులలో ఒకరైన పాలపర్తి హవీలా ఇటీవల పద్యప్రభాతం(2) అనే కావ్యాన్ని వెలువరించారు. హవీలా మనోహర భావసౌందర్యం తో వివిధ భంగిమల్లో సూర్యోదయాన్ని ఉత్ప్రేక్షిస్తూ కవనం సాగించారు. ప్రతిపద్యం అలంకారయుతంగా సాగే ఈ కావ్యంలోని ఒక పద్యాన్ని తిలకిద్దాం.

*తేగీ. రిక్కలే జిగిచుక్కలై రేల బారి*

*కాంతి కుల్యలై జారుచు కడకునన్ని*

*యొక్క వెల్గుసంద్రపుటొడి నొరగిపోవ*

*దరణి యా రుచి వనధియై ధరణిముంచె.*

120 పద్యాలు ఉన్న ఆ కావ్యంనుండి పెద్దపద్యాలు ఎంచుకోవచ్చు. కానీ ఒక చిన్న పద్యం ఎంచుకోడానికి కారణం ఏమిటీ అంటే అతి చిన్న పద్యంలో కూడా గొప్ప భావనను ఇమడ్చవచ్చు అని చెప్పడం కొఱకు.

రిక్కలే జిగిచుక్కలై = నక్షత్రాలు కాంతి బిందువులై, రేలన్ పారి = రాత్రి ప్రవహించి, కాంతికుల్యలై జారుచున్ = కాంతి కాలువలై జారి, కడకున్ అన్ని = తుదకు అన్నీ, ఒక్క వెల్గు సంద్రపుటొడిన్ = ఒక వెలుగు సముద్రపు ఒడిలో, ఒరిగిపోవన్ = ఒరిగిపోగా, తరణి = సూర్యుడు, ఆ రుచివనధియై = ఆ కాంతి సముద్రమై, ధరణిన్ ముంచెన్ = భూమిని ముంచెత్తాడు.

సూర్యుడు రావడం, అప్పటిదాక మెరిసే చుక్కలు మాయం కావడం సహజ దృశ్యం. సూర్యుడు ఒక వెలుగు సముద్రంగా చెప్పి నక్షత్రాలు అనే కాంతి ప్రవాహాలు అన్నీ అతనిలో కలిసిపోయాయి అని చెప్పడం ఒక అద్భుత ఊహకు తార్కాణ. ప్రవాహాలు అన్నిటికీ చిట్టచివరి గమ్యం సముద్రమే కదా! ప్రకృతిలో ఉన్న సహజ సిద్ధాంతాన్ని ఇలా తన కవనంలో వర్ణనాత్మకంగా చెప్పడం విశేషం. ఇలాంటి పద్యాలు చదివి ఆస్వాదించి ముగ్ధులు కాని సరసులు ఉండరు.

అష్టదిగ్గజాలలో మరొక కవి ధూర్జటి. ధూర్జటి కవి శ్రీకాళహస్తీశ్వర శతకం, కాళహస్తి మాహాత్మ్యం అనే కావ్యమూ వ్రాసాడు. భక్తి వైరాగ్యాలతో నిండిన శతకం శ్రీకాళహస్తీశ్వర శతకం.. ఇందులో అనేక వాస్తవాలను ఉట్టంకిస్తూ సమాజాన్ని నిలదీస్తూ రాజులగర్వాన్ని నిరసిస్తూ శివునకు నివేదించుకుంటాడు. రాజుల కొలువులో ఉంటూ రాజుల గురించి వ్యంగ్య బాణాలు సంధించడం అబ్బురం అనిపించి ఈ కవి ధీరత్వాన్ని చాటుతుంది.

శ్రీ కాళహస్తీశ్వరశతకం(3) లోని ఒక పద్యం చూద్దాం.

*శా. ఆలంబిడ్డలు మిత్రులున్, హితులు, నిష్టార్థంబు లీనేర్తురే?*
*వేళన్ వారిభజింప జాలిపడకావిర్భూత మోదంబునం*
*గాలంబెల్ల సుఖంబు నీకునిక భక్తశ్రేణి రక్షింపకే*
*శ్రీలెవ్వారికి గూడబెట్టెదవయా! శ్రీకాళహస్తీశ్వరా!*

ఓ కాళహస్తీస్వరా!! ఆలున్ బిడ్డలు మిత్రులున్ సఖులు = భార్యా పిల్లలూ స్నేహితులూ, ఏ వేళనవారిన్ భజింపన్ = ఎప్పుడూ వాళ్లనే సేవించినా, ఇష్టార్థంబు లీనేర్తురే? = కోరిన కోరికలు తీరుస్తారా? జాలిపడక = జాలిలేకుండా, నీకు ఆవిర్భూతమోదంబునన్ = నీకు కలిగిన ఆనందంతో, భక్తశ్రేణి రక్షింపకే = భక్తులు అనేవాళ్లను రక్షించే పనిలేక, కాలంబెల్లసుఖంబు = కాలం సుఖంగా గడచిపోతుంది.

ఇక శ్రీలెవ్వారికి కూడబెట్టేదవయా = ఇంక మోక్షం అనే సంపద ను ఎవరికి ఇస్తావయ్యా?

అని ఐహిక దైహిక బంధాలనే నిత్యమూ నమ్మకోవద్దు అని లోకులకు హితం పలికి మోక్షసంపద భక్తులకు ఇమ్మని లోకుల పక్షాన శివుని ప్రార్థన చేస్తాడు. ఇక్కడ రే+ ఏవేళన్ అన్నచోట, జాలిపడక+ఆవిర్భూత అన్నచోట్ల సంధులు చేస్తాడు. నిజానికి అక్కడ సంధులు కావు. ఇవి భాషా స్వతంత్రతకు నిదర్శనాలు. శ్రీకాలహస్తీశ్వర శతకం ద్వారా ధూర్జటి మహాకవి సాహిత్యలోకంలో శాశ్వతుడయ్యాడు.

ఆధునిక కవులలో ఒకరు శతావధాని మహాకవి డా. వారణాసి శివరామకృష్ణ గారు.వారు వ్రాసిన అనేక కావ్యాల్లో సింహశైల నృసింహ శతకం ఒకటి.(4 )ఇవి కందపద్యాలు. ఇందులో ఒకపద్యం పరిశీలిద్దాం.

*కం. అంధులన వేరెవరు? కా*
*మాంధులు ,మోహాంధులును, ధనాంధులు, నధికా*
*రాంధులు గాక ,పురాతన*
*సైంధవునకనుజులు,సింహశైల నృసింహా!*

ఈ పద్యం సరళ సుబోధకంగా ఉన్నది కదా!! గ్రుడ్డివాళ్ళు అని మనం లోకంలో సాధారణంగా కళ్లులేని వారిని అనుకుంటూ ఉంటాం. నిజానికి వాళ్ళను అలా అనరాదు అంటారు కవి. కామమోహాల చేత కళ్ళు మూసుకుపోయినవాళ్ళూ డబ్బువల్ల విర్రవీగేవాళ్లూ అధికారంతో మదం ఎక్కినవాళ్ళూ వీళ్లంతా అంధులు అని కవి అంటారు. అంతేనా?? వీళ్లంతా భారతకథలోని సైంధవునికి స్వయానా తమ్ముళ్లు అంటారు. పై అన్ని దుర్గుణాల కలబోత సైంధవుడు. అందుచేతనే కవి అతడిని ఎంచుకుని వీళ్ళను పోల్చారు.

ఈ విధంగా తెలుగు సాహిత్యంలో నాటినుండి నేటిదాకా ఎన్నివేల పద్యాలో కోహినూర్ వజ్రాలలాగా భాషకూ సాహిత్యానికీ ఎనలేని అందాన్నీ విలువనూ సంతరిస్తూ ఉన్నాయి. అలాంటి తెలుగుతల్లి బిడ్డలు అయిన కవులను ఈ శీర్షిక ద్వారా సంస్మరించుకుందాం.

## సూచికలు :


1. రామరాజభూషణుని వసుచరిత్ర కావ్యం 2 ఆశ్వాసం 46 వ పద్యం.
2. పాలపర్తి హవీలా, శ్రీనగర్ కాలనీ, ఖమ్మం(భావనాప్రియ సాహిత్య బృందం ప్రచురణ 2022)పద్యప్రభాతం.
3. ధూర్జటి మహాకవి శ్రీకాళహస్తీశ్వరశతకం 54 పద్యం(శ్రీవేంకటేశ్వర బుక్ డిపో, కొత్తపేట, విజయవాడ)2006.
4. డా. వారణాసి శివరామకృష్ణ సింహశైల శతకం 119 పద్యం.సరసభారతి ప్రచురణ, హైదరాబాద్ 1995 జులై .




శాతవాహనుల వంశాన పుట్టినవాడు
కాకతీయుల పోతుగడ్డ మెట్టినవాడు
పల్లెలోనె కాదు ఢిల్లీలో సైతమ్ము
పెద్ద గద్దెల నేలి పేరుకెక్కినవాడు
ఎవడయ్య ఎవడువాడు ఇం
కెవడయ్య తెలుగువాడు!

మంచి మనసెదురైన మాలలిచ్చేవాడు
భాయి భాయి అన్న చేయి కలిపేవాడు
తిక్కరేగిందంటె డొక్క చీల్చేవాడు
చిక్కులెరుగని వాడు చిత్తాన పసివాడు
ఎవడయ్య ఎవడు వాడు ఇం
కెవడయ్య తెలుగువాడు.

పంచెకట్టుటలో ప్రపంచాన మొనగాడు
కండువా లేనిదే గడప దాటనివాడు
పంచభక్ష్యాలు ఆన కంచాన వడ్డించ
గోంగూర కోసమై గుటక లేసేవాడు
ఎవడయ్య ఎవడువాడు ఇం
కెవడయ్య తెలుగువాడు!

తెలుగు బాషను జుంటితేనెయని తెగపొగడి
పొరిగింటి పులుపుకై మరులు పెంచినవాడు
దేశ భాషలలోన తెలుగు లెస్సని చాటి
మల్లెలకు బదులు లిల్లీలు వలచినవాడు
ఎవడయ్య ఎవడువాడు ఇం
కెవడయ్య తెలుగువాడు!

ఒక చేతి మజ్జిగని బరసి పట్టినవాడు
ఒక చేతి మధుపాత్ర వొదిలి పెట్టనివాడు
ఒక ముహూర్తాన ఇంచుక బుర్రగోకుకొని
చల్ల వంచిన చేత కల్లు పంచినవాడు
ఎవడయ్య ఎవడువాడు ఇం
కెవడయ్య తెలుగువాడు!

నేల నల్దెసల దేరాలు నాటినవాడు
అన్ని మూసలలోన అట్టె బదిగినవాడు
ఏ దేశమేగినా ఎందు కాలిడినా
ఆవకాయ వియోగ మసలే సైపనివాడు
ఎవడయ్య ఎవడువాడు ఇంకె
వడయ్య తెలుగువాడు